స్పందన
శ్రీ జిడ్డు కృష్ణమూర్తి
జీవితం: తత్త్వం

గ్రంథకర్త
కె.కె. రామానుజాచార్యులు

ప్రచురణకర్తలు:
ప్రాప్తి బుక్స్
పి.బి.5018, బెసెంట్ నగర్
మద్రాసు - 600 090.

మొదటి ముద్రణ:
ఫిబ్రవరి - 1990
శ్రీ జిడ్డు కృష్ణమూర్తి
శతజయంతి
సందర్భంగా-
సవరణలు, విస్తరణలతో
ద్వితీయ ముద్రణ
సెప్టెంబరు - 1995

ముఖపత్రాలంకరణ:
కళాప్రపూర్ణ బాపు

వెల: రు.60/-

**SPANDANA**
(Telugu)
Life and Philophy of
Shri J.Krishnamurti

Author:
K.K. Ramanujacharyulu

Published by:
**Prapti Books**
Post Box: 5018
Besant Nagar,
Madras - 600 090.

First Edition:
February 1990
Revised and Enlarged
Second Edition
In connection with
Sri J. Krishnamurti Birth
Centenery
September 1995

Cover Design by:
Kalaprapurna Bapu

Price: Rs.60/-

## మొదటి ముద్రణకు

# సౌగంధికం

భావపరిధి విస్తృతంగా పెరిగి, మనిషి విశ్వమంతటినీ ఆలింగనం చేసుకునే ప్రయత్నంలో మనసును, హృదయాన్ని సమాయత్తం చేసుకుంటు న్నాడు. ఇదే 'చక్కని రాజమార్గం' అని అతనికి ధైర్యం చెప్పాలి, స్ఫూర్తిని ఇవ్వాలి. - ఈ ఆలోచన సంవత్సరాలుగా మనసులో మెదులుతూ 1989కి ఒక రూపుకట్టుకుంది.

సాహితీ ప్రక్రియలలో ఆధునికం అయినదీ, వర్తమాన సమాజ పరిణామాలకు అద్దం పట్టి చూపేది కథానిక. తెలుగు, ఇతర భారత భాషలు, ప్రపంచ భాషలలో వస్తున్న ప్రయోగాలు, బెళుకులు ఒకచోట చూపగలిగితే బాగుంటుంది. ఈ ప్రక్రియ పై 'సాహిత్య విమర్శ' తయారు అవ్వాలి.

విఖ్యాత తత్త్వవేత్త, దార్శనికుడు శ్రీ జె. (1895-1986) ఆలోచనా స్రవంతిని ఇంగ్లీషుతో అంతగా పరిచయం లేని తెలుగువారికి అందించాలి. నవ సమాజ నిర్మాణానికి, మానవుడు

నిత్య నూతనంగా వుండటానికి ఈ ఆలోచనలు నాంది - అన్న విషయం అందరి దృష్టికీ తీసుకురావాలి.

వర్తమానం ఎప్పటికప్పుడు అధునాతనం; అంతటా కొత్తదనం విస్తరించుకుంటుంది. సర్వదేశ దశాకాలాలలో ఎప్పటికప్పుడు ఈ కొత్తదనం అర్థం చేసుకోవడం అవసరం.

ఆచరణ పథంలో మొదటి రూపంగా 'కథానిక', 'కృష్ణమూర్తి', **'TACT'** అనే బులెటిన్లు **1989**లో నాలుగు చొప్పున వెలువరించాము. బరువయిన తాత్త్విక విషయాలను సాధారణ శైలిలో వివరిస్తూ **VISHNUPURANA IN THE SECRET DOCTRINE; NARADA; THE DIVINE MESSENGER** అనే చిన్న పుస్తకాలు ప్రచురించాము.

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి జీవితం- తత్త్వం విశదం చేస్తూ తెలుగులో ఓ పుస్తకం తీసుకు రావాలని తీవ్రంగా సంకల్పించాం. శ్రీ కృష్ణమూర్తిని గురించి విస్తార గ్రంథ పఠనమే కాక, ప్రగాఢంగా చింతనం చేసిన శ్రీ కె.కె. రామానుజాచార్యులు ఈ సంకల్పానికి సమగ్ర రూపం కల్పిస్తూ 'స్పందన' తయారు చేశారు. ఈ పుస్తకం సుందరంగా సుమనోహరంగా చదువరులకు అందించటానికి కళాప్రపూర్ణ శ్రీ బాపు గారిని ముఖపత్ర రచన చేయమని కోరాం. వారు హృదయార్ణవం నుంచి నాలుగు రంగుల ముఖ పత్రం వెలువరించి బహూకరించారు. వీరికి మా కృతజ్ఞతలు.

చదువరులు ఈ 'స్పందన'ను సమాదరిస్తారని విశ్వసిస్తున్నాం.

బెసెంట్ నగర్
మద్రాసు- **600 090**
ఫిబ్రవరి **1990**

ప్రాప్తి బుక్స్ తరఫున
శ్రీ విరించి
డైరెక్టర్

రెండవ ముద్రణకు

# సుసౌంగంధికం

మొదటి ముద్రణ ప్రతులు అన్నీ వితరణ అయిపోయి చాలాకాలం అయినా, ఈ ముద్రణ తీసుకు రావటానికి అనేక అనివార్య కారణాలు ఇంతవరకు అడ్డువచ్చాయి. వాటినన్నిటినీ అతిగమించి, శ్రీ కృష్ణమూర్తి గారి శత జయంతి సంవత్సరంలో ఈ విస్తృత ప్రతి చదువరులకు అందచేయ గలుగుతున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాము.

మా ప్రయత్నం వల్ల, ఇంకా యితరుల కృషి విశేషంవల్ల శ్రీ కృష్ణమూర్తిగారి భావజాలం తెలుగు పాఠకులకు మేము ఆశించిన దానికంటె ఎక్కువగానే అందుతూవున్నది. కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా వారు తెలుగు అనువాద గ్రంథాలు అయిదారింటిని ప్రచురించారు కూడ. ఏమయినా, కృష్ణమూర్తి జీవిత విశేషాలను, తత్త్వదర్శన వివరాలను మొట్టమొదటగా సమగ్రంగా ఒకచోట లభ్య పరచిన పుస్తకం భారత భాషలన్నిటిలోనూ ''స్పందన'' మటుకే. ఇది తెలుగుజాతి కృష్ణమూర్తికి ఇవ్వగలిగిన నివాళి. ఇందుకు శ్రీ కె.కె. రామానుజాచార్యులు గారు ప్రత్యేకంగా అభినందనీయులు.

జీవితం వేరు - వేదాంతం వేరు అనే పాక్షిక దృక్పథం నుంచి జీవితమంతా తత్త్వదర్శనంతో ఓతప్రోతంగా కలిసిపోవలసి వుంది - అని చెప్పటానికి కృష్ణమూర్తి జీవితమే ఒక నమూనా. వారి బోధనలను చక్కగా అవగతం చేసుకొని ఆలోచన పరిధిలోనికి తీసుక వచ్చి తమ జీవితాలను మానవజాతి మనుగడను పునర్వికాసవంతం చేసుకోవడం ఒక్కొక్కరిపైన ఆధారపడివున్నదని చెప్పడం మా కర్తవ్యం. ఇందుకు ఈ పుస్తకం సహాయకారి అవుతుందని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాము.

ప్రాప్తి బుక్స్ తరపున
శ్రీ విరించి
డైరెక్టర్

అడయారు
మదరాసు
18-9-95

# విషయానుక్రమణిక

# ప్రేరణ

ఈ పుస్తకంలోని కొన్ని భాగాలు వ్యాసరూపంలో లోగడ తెలుగు పత్రికలలో ప్రచురణ పొందినాయి:

| | | |
|---|---|---|
| ఈ శతాబ్దపు తాత్త్వికుడు | ఆంధ్రప్రభ (దిన పత్రిక) | 17-02-1987 |
| ధ్యానం | కృష్ణమూర్తి | 1989/2 |
| చదువు- జీవితం | ఆంధ్రజ్యోతి (దిన పత్రిక) | 16-02-1988 |
| మతం- మత జీవనం | ఉదయం (దిన పత్రిక) | 13-02-1989 |
| హింసా కాండ | ఆంధ్రప్రభ (దిన పత్రిక) | 17-02-1989 |
| జీవితం- మృత్యువు | ఆంధ్రప్రభ (దిన పత్రిక) | 14-02-1988 |
| విప్లవం | కృష్ణమూర్తి | 1989/3 |
| తత్త్వసార సంగ్రహం | కృష్ణమూర్తి | 1989/3 |
| బ్రతుకుభయం | యోగమార్గం | (1990 - ఏప్రిల్) |
| మానసిక పరివర్తనం | కృష్ణమూర్తి | (1990 - 1,2) |
| కృష్ణమూర్తి భావాలు, ప్రభావాలు | కృష్ణమూర్తి | (1990 - 3,4) |
| రాజమండ్రిలో కృష్ణమూర్తి | కృష్ణమూర్తి | (1990 - 3,4) |
| కృష్ణమూర్తి జీవనరాగం, మృత్యువిరావం | కృష్ణమూర్తి శతజయంతి సంచిక | (1995) |

పుస్తక రూపం ఇవ్వడానికి అవసరమయిన మార్పులు, చేర్పులు మాత్రం జరిగాయి. ఈ పత్రికల యాజమాన్యానికి, సంపాదకులకు రచయిత, ప్రకాశకుల కృతజ్ఞతలు: వారి ప్రోత్సాహమే ఈ గ్రంథ ప్రచురణకు ప్రేరణ.

# 1

# ఈ శతాబ్దపు తాత్త్వికుడు

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి - అభిమానులకు 'జె.కె.' మిత్రులకు అందరికీ 'కృష్ణాజీ' గా సుపరిచితులు.

ఆడంబరం లేని వారి మూర్తిలా, భాష కూడా సరళము, సులభ సుందరమయినది. నిశ్చయ భావముద్రితమైన వారి ముఖతః వినిపించే మాటల్లోని లోకానుభవమూ, ప్రదీప్తమైన నేత్రాలు ప్రసరించే ప్రసన్నతా- మనల్ని వారి దగ్గరకు చేర్చేవి. మనకు ఆహ్లాదాన్ని చేకూర్చేది- వారి మాటల్లోని కవితావేశం. ఆలోచనా బద్ధుల్ని చేసేది- వారి తర్కంలోని నిజాయితీ. స్వీయశైలిలో వారు అతిలోక విషయాలను, రహస్యాలుగా కాక, అందరికీ అర్థమయ్యేలా చేసే వివరణాత్మక ప్రసంగాలు ఆశ్చర్యచకితుల్ని చేసేవి.

కృష్ణమూర్తి భగవంతుడా, జగద్రక్షకుడా, ప్రవక్తా, వేదాంతియా, తాత్త్వికుడా, కవియా, తార్కికుడా, సౌందర్యోపాసకుడా? మరి ఎవరు? ఆయన ఒక నేస్తం. జీవిత పథంలో గమ్యమూ, గమనమూ తెలియక సందిగ్ధావస్థలో పయనిస్తున్న పథికులకు ఒక లక్ష్యాన్ని తెలిపిన జ్ఞాని. తానుగా నిర్దేశించక మన ఆలోచనల్లోంచే మన సమస్యలకు పరిష్కారాలను కనుగొనేందుకు సాయపడిన విజ్ఞాని.

వారు మహిమలు ప్రదర్శించ లేదు. తరణోపాయాన్ని ఎవరికి వారే తెలుసుకోవాలన్నారు. పీఠాధిపతులు కారు- గురు శిష్య వ్యవస్థను

వ్యతిరేకించి, ఏనాడో తనకు అంటగట్టిన గురుస్థానాన్ని, పీఠాధిపత్యాన్ని అలవోకగా త్యజించారు.

కృష్ణమూర్తి ఏ ప్రాంతానికో, ఏ దేశానికో, ఏ తీరానికో గాక అందరకూ చెందిన విశ్వ మానవుడు. అన్ని మతాలకూ అతీతుడు. ఈ శతాబ్దపు అసలైన జిజ్ఞాసువు; నిరంతర సత్యాన్వేషి.

'తాను', 'తనవాళ్లు', 'తన మతం', 'తన దేశం'- అనే ఆలోచనలను వదలి- మనం మానవులం; మనమంతా ఒక్కటే- అనే భావనకు ఎదగాలి- అంటూ మనలో రావలసిన మార్పును గురించి ఇంకా ఇలా హితవు చెప్పారు.

మోహం, దుర్బుద్ధి, ప్రాపంచిక సుఖం, అజ్ఞానం, దురభిమానం, రాగద్వేషాల నుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందాలి. అందుకు కావలసిందల్లా- ముందుగా మన అజ్ఞానాన్ని, దుఃఖాన్ని తెలుసుకొని క్షమ, సహనశీలాలను అలవరచుకోగలగటం.

గతంతో ముడిపడిన మనసు, గత అనుభవాల పునాదులనుంచే వచ్చి, స్మృతుల ద్వారా, ఆశల ద్వారా, ఆ గతాన్ని అంటిపెట్టుకొని ఉండటంవల్ల భారమైపోతుంది. అది స్వేచ్ఛను పొందలేదు. గతం, జ్ఞాపకం, ఆశ, ఆలోచన- ఇవన్నీ మానవ బంధాలు (Human Bondages). వీటికి మూల కారణం భయం. నిన్నటి బాధ, వ్యథ మనసులో తగులుకోగా, రేపటి ఆశలకు అర్రులు చాస్తూ, గత స్మృతుల ద్వారా ఆనందం, సంతృప్తిని ఆశ్రయించినప్పుడు- వాటిని ఎక్కడ కోల్పోతామోనన్నో, లేక తిరిగి పొందలేమన్నో, అదీగాక తిరిగి రాదనే భయంతోనో ఉన్నప్పుడు గాని, ప్రస్తుత సుఖప్రదమైన స్థితిని ఎక్కడ కోల్పోతామో అనే సందిగ్ధంలో ఉన్నప్పుడు గాని ఆలోచనలతో మనసును గాయపరచు కోవటం సాధారణంగా జరుగుతున్నది. ఇది కాలానికి, సందర్భానికి సంబంధించినది. అందువల్ల సుఖం, కోరిక, మృత్యువు అన్నవి భయానికి హేతు భూతాలు. ఆ భయం నుంచి విముక్తి పొంది స్వేచ్ఛగా ఉండాలంటే సుఖం, కోరిక, మృత్యువు అనే పీడలను వదలించుకోవాలి. వాటి స్వభావాలను తెలుసుకోవటం ద్వారా మనం ఆ భయాందోళనల నుంచి విముక్తి పొందగలం.

హింసాప్రవృత్తిని వివరిస్తూ- హింస అనేది దౌర్జన్య ప్రవృత్తి; హింస అంటే సంహారమే గాదు; దౌర్జన్య, దౌష్ట్యాహంకారాల ద్వారా బాధించే ఉగ్ర స్వభావం- అంటూ, అందుకు కారణాలు తెలుసుకోమన్నారు. కార్య కారణాలు తెలుసుకొన్నప్పుడు సమస్య ఇట్టే పరిష్కారమవుతుందని అభిభాషించారు.

హింసా ప్రవృత్తిలోని హెచ్చుతగ్గులు ప్రాణుల ననుసరించి ఉంటాయి. తాము ఫలానా వారిలా ఉండాలి, తాము పరిపూర్ణ స్థితికి రావాలి- అనుకొంటుంటారు. స్వీయాభివృద్ధి- స్వేచ్ఛకు, విద్యకు, పాండిత్యానికి విరుద్ధమైనది. పోలికలు లేకుండా జీవించేందుకు ప్రయత్నించి చూచి నప్పుడు ఎంత అద్భుతం జరుగుతుందో తెలుస్తుంది. ''నేను'', ''నాది'' అనే భావన లేకుండా, పోలికలు లేకుండా, ఎఱుకతో జీవించినప్పుడు ఈ విషయం మరింత స్పష్టమవుతుంది. మన బుద్ధిని పోలికలతో, పోటీలతో మలినపరచుకొంటున్నాం. ఏవో కొన్ని చోట్ల తప్పించి, ప్రపంచమంతటా విద్యా సంస్థలలో గూడా పోలికలు, పోటీలు సర్వసాధారణమైనాయి. ఈ పద్ధతివల్ల బుద్ధికి ఎంతో అపకారం జరుగుతున్నది. బుద్ధికి చెందిన దశలను విడివిడిగా చూడటం ద్వారా మనలోని తత్తరపాటును, ఆలోచనల్లోని విభేదపుటలవాట్లను ప్రదర్శించుకొంటున్నాం.

'నేను' అనే భావనను వదలుకొన్నప్పుడే విముక్తి లభిస్తుంది. ఆదిలో ఈ 'నేను' అనే భావన లేదు. తనకు, ఇతరులకు మధ్య శరీరగతమైన అంతరం తెలుసుకొన్నప్పుడు ఈ 'నేను' అన్న భావన ఏర్పడింది. అలాగే నా చేయి, నా కాలు, ఆ తర్వాత- నా యిల్లు, నా మతం, నా దేశం- వంటి భావనలు ఏర్పడ్డాయి. అనుభూతులలోను, అనుభవాల లోను, ఆలోచనలలోను, ఆదర్శాలలోను, కోర్కెలలోను, జ్ఞాపకాలలోను, భయాందోళనలలోను ''నేను'', ''నాది'' అనేవి చోటు చేసుకున్నాయి. అప్రమత్తత, ఎఱుక, సాధనల ద్వారా మనం ఈ ఆత్మగతమైన భావాన్ని వదలించుకోవచ్చు.

మన బాధలకు కారణం మన ద్వంద్వాలోచనలే. అనుభవాలు మనం పొందినవి. అవి మన యథార్థ స్థితికి భిన్నమైనవి. సత్యాన్ని మనం ద్వంద్వాతీతము, భావాతీతమైన అన్వేషణ ద్వారా మనసును ఖాళీగా ఉంచగలిగినప్పుడు తెలుసుకోగలం.

అనుభవం- అనుభవించేవాడు; అలాగే చూచేది- చూచేవాడు; రెండూ భిన్నమైనవిగా తోస్తాయి. ద్వంద్వ భావనవల్లే మనం ఆ రెండూ ఒకటేనన్న సత్యాన్ని తెలుసుకోలేక పోతున్నాం.

జ్ఞాపకాలను మనసులోనుంచి పారద్రోలినప్పుడు- అంటే మానసిక మైన గత స్మృతులు, భావనలు, భావోద్రేకాలను త్యజించినప్పుడు మనసు నిర్మలమవుతుంది. మనసు, హృదయం, శరీరం- సమశ్రుతిలోనున్నప్పుడు జ్ఞానం కలుగుతుంది.

ధ్యానమంటే- అనుభవానికి, అనుభవానికీ మధ్య స్థితిపైని మనసును కేంద్రీకరించటం అంటూ కృష్ణమూర్తి తెలిపిన సాదృశ్యం చాలా తేలికగా, అందరూ అర్థం చేసుకొనేటట్లు హృదయాలకు హత్తుకొనేటట్లు ఉంటుంది. గోడ గడియారంలోని లోలకం అటూ ఇటూ ఊగటం- ఎఱుకలోని భూత భవిష్యత్తుల మధ్య సంచరించటం వంటిది. అందులో క్రొత్తకు చోటు లేదు. కారణం- భవిష్యత్తు గతంలోంచి పుట్టుకు వస్తుంది. ఏదో కొంత మార్పుతో గతం మరొక రూపంలో మనకు సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. ఆ స్థితిలో ఎఱుక వాస్తవాన్ని వాస్తవరూపంలో గ్రహించలేదు. అయితే ఎఱుక వర్తమానాన్ని వదలి మరోలా ఉంటుందా అనే ప్రశ్న ఉదయిస్తుంది. లోలకం నిరంతరం ఊగుతున్నా అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ తిరిగే లోపల ఏదో ఒక స్వల్ప విరామంలో సంపూర్ణ నిశ్చల స్థితిని పొందుతుంది. అలాగే ఆలోచనకు ఆలోచనకు మధ్య ఈ స్థితిని మన ఎఱుకకూడా పొందుతుంది. రెండు ఆలోచనల మధ్య నిశ్శబ్ద కాలానికి ఆలోచనల క్రమంతో సంబంధంలేదు. సూక్ష్మంగా పరిశీలించితే ఆ నిశ్చలస్థితి, ఆ విరామం కాలానికి సంబంధించినవి కావని తెలుస్తుంది. ఈ స్థితిని కనిపెట్టి దాన్ని అనుభవించటంవల్ల నియమాలనుంచి, నియమబద్ధతల నుంచి విముక్తి లభిస్తుంది.

కృష్ణమూర్తి నిశ్చల మనసు **(Silent Mind)** గురించి, దాని ప్రాధాన్యం గురించి చెప్పారు. మనసు ఏ ఆలోచనా లేకుండా ఖాళీగా ఉన్నప్పుడు ఆ స్థితి లభ్యమవుతుంది. అది ప్రయత్నపూర్వకంగాకాక, సహజోద్గమంగా పొందగలిగినప్పుడు, ఆ స్థితి ఏమిటి అన్నది తెలుసు కొంటాం.

మతాలు మానవుల సామాజిక ప్రేరణకు ఉపకరించాయి. కాని, మతంపేరుతో కొన్ని దుష్టశక్తులు మంచికన్న చెడు ఫలితాలనే ఎక్కువగా ఇచ్చాయి. తద్వారా క్రౌర్యం, 'స్వ', 'పర' పీడనలవంటివి వచ్చి చేరాయి. మతం ముసుగులో కొందరు స్వార్థపరులు అధికారాన్ని చెలాయించటానికి, కొన్ని ప్రత్యేక సదుపాయాలు పొందటానికి అవకాశం లభించింది. నమ్మకత వేరు- వాస్తవం వేరు. నమ్మకాలతోటే కాలం గడుపుతూ మన బాధ్యతలను విస్మరించి వాటిని ఇతరులకు వదలి మందబుద్ధితో ఉండక, యథార్థాన్ని తెలుసుకోవాలన్నదే కృష్ణమూర్తి హెచ్చరిక. నమ్మకాలనుంచి విముక్తి పొందిన బుద్ధి యథార్థాన్ని చూడగలుగుతుంది. ప్రచారాల ద్వారా, మూఢ నమ్మకాలను పెంచటం ద్వారా ఎందరో ఐశ్వర్యవంతులవుతున్నారు. మతం, నమ్మకాలు ఎన్నో విపత్కర పరిస్థితులకు దారి తీయిస్తున్నాయి. వీటిని తుదముట్టించటానికి ప్రతివారు చాలా తీవ్రంగా ఆలోచించాలి. మత అనుయాయులం అనుకుంటున్న వాళ్ళంతా ఆలోచనల్లోంచి పుట్టిన ఆకారాలను పూజిస్తున్నారు. అంటే భావనలమీద, సృష్టించుకొన్న ఆకారాలపైన మక్కువ చూపుతున్నారు. ఇతరులను అందుకు అనుగుణంగా మలుస్తున్నారు. తద్వారా మనసులను ఎదగనీయటం లేదు. భావనల్లోంచి ఉద్భవించినదేదీ పవిత్రం కానేరదు. సత్యశోధనే నిజమైన మతం. సత్యశోధకుడే నిజమైన మతావలంబి. మత జీవితమంటే అందాన్ని, ఆనందాన్ని త్యజించటం కాదు. వక్రబుద్ధి, క్షుబ్ధచిత్తం, కృతక మనసు, కపటపు బుద్ధులతో మతాన్ని తెలుసుకోలేరు. నిర్భీతి, నిరీహ, నిర్మత్సరా లతో మనం జీవించగలిగినప్పుడు. సత్ఫలితాలు కలుగుతాయి.

మానవులు తమకు కలిగిన అనుభవాల నుంచి ఇతరులను గురించి కొన్ని ఊహలు (మిథ్యాబింబాలు) చిత్రించు కొంటారు. ప్రతి సమస్యకు ఆ ఊహల ననుసరించే స్పందించుతారు గాని వాస్తవాన్ని తెలుసుకొని వ్యక్తుల గురించి స్పందించలేకపోతున్నారు. అటువంటివాళ్ళు జీవితానికి అర్థాన్ని, ప్రయోజనాన్ని తెలుసుకోవాలి. జీవించటాన్ని నిజంగా అర్థం చేసుకొన్నప్పుడు, మరణం సమస్య కాదు. దాన్ని గురించిన భయంకూడా ఉండదు.

మృత్యువంటే భయానికి కారణం- తెలియని దాన్ని గురించిన భయమేకాదు, తెలిసినదాన్ని వదలుకోలేకపోవటం. మరణం అనేది

పుట్టుకలాగా జీవితంలో ఒక భాగం. ఎవ్వరూ శాశ్వతం కారు. జీవితంలో పాత విషయాలు మరచి క్రొత్త విషయాలు తెలుసుకొంటూ జీవించే వారికి మృత్యు భీతి ఉండదు. అసలు చనిపోయేది ఏది? శరీరం మాత్రమే. 'తన'కు చావులేదు. ఈ విషయం అందరికీ తెలుసు. చావుకుముందు బ్రతకటమంటే చావుతో బ్రతకటం. అంటే 'తాను' కాలాతీతమైన ప్రపంచంలో జీవిస్తున్నట్లు- అన్నారు కృష్ణమూర్తి, జీవన్మరణాలను విశదం చేస్తూ.

మానవుల మధ్య సంఘర్షణలకు దారి తీసిన పరిస్థితులను విశదం చేస్తూ ఇలా అన్నారు-

మనం సృష్టించుకొన్న ఆదర్శాలు, మూఢనమ్మకాల ద్వారా, మనం వాటిని ఒకరిపై మరొకరు రుద్దుకోవటానికి ప్రయత్నించటంవల్ల సంఘర్షణ ఏర్పడుతోంది. ఈ పరిస్థితులనుంచి విముక్తి పొందటానికి సహజమైన మార్పు రావాలి. ఆ మార్పు వ్యక్తిలో, అతని నడవడిలో, అతని ఒరవడిలో రావాలి. ఇతరులతోటి అతని సంబంధాలలోనే గాక- ప్రకృతికి ప్రతిస్పందించటంలో గూడా మార్పు రావాలి. సృజనాత్మకమైన మార్పు- వ్యక్తుల సంబంధాలలో, అంటే సమాజంలో మార్పు ద్వారానే సంభవమవుతుంది.

'ప్రేమ' ఒక్కటే ప్రస్తుత ప్రపంచంలో నెలకొన్న ఉన్మాదాన్ని, ఆందోళనను మార్చుతుంది. ప్రేమ అంటే స్వార్థ త్యాగం. అంటే ఇద్దరు వ్యక్తుల మధ్య అంతరం లేకుండా చూచుకోవటం. ఆ స్థితిలోనే ప్రేమ జనిస్తుంది. శ్రవణం, దర్శనం, శ్రద్ధ- అనేవి అందుకు ఆచరించవలసిన పద్ధతులు.

కృష్ణమూర్తి ఎందరిని మార్చగలిగారు; ప్రపంచంలోని కష్టాలు, నష్టాలు, క్రౌర్యం, కపటం, దగా, మోసం, అక్రమం, యుద్ధం, మూఢ నమ్మకం, నిర్మించుకొన్న అడ్డుగోడలు- వీటిని మానవులు వదలించుకొన్నారా?- అన్న ప్రశ్నలకు ''అది తన బాధ్యత కాద''న్నారు. తాను ''జగద్రక్షకుడు'' కాని, ''ఆపద్బాంధవుడు'' కాని, కానన్నారు. తాను తెలుసుకొన్నవాటిని ఇతరులపై రుద్దక, సత్యాన్వేషణకు తనవంతు సహాయాన్ని అందించారు. తాను నిరంతర సత్యాన్వేషి.

కృష్ణమూర్తి జీవితం అసాధారణమయింది. ఆలోచించగల ప్రతి వ్యక్తి వారు చెప్పేది వినగోరాడు. విన్నవాళ్ళలో కొందరు ప్రయోజనం పొందారు. మరి కొందరు మిన్నకున్నారు. అభిభాషణమే తనవంతు పనిగా కడవరకు ప్రసంగించారు.

కృష్ణమూర్తి మేధావులకే మేధావి. జవహర్‌లాల్ నెహ్రూ, లియోపాల్డ్ స్టాకోవ్‌స్కీ, జార్జి బెర్నార్డ్ షా, ఆల్డస్ హక్స్‌లీ, దలైలామాల వంటి మేధావులు, నాయకులు, కవులు, రచయితలు, మతగురువులు, వేదాంతులు గూడా వారివల్ల ప్రభావితులయ్యారు. కృష్ణమూర్తిలో వారు భగవంతుడిని, మైత్రేయుడిని, శ్రీకృష్ణుడిని, గౌతమబుద్ధుడిని, ఏసుప్రభువును, జగద్రక్షకుడిని, ప్రవక్తను, మేధావిని, ఒక మంచి మిత్రుని- ఇలా రకరకాల విశేషాంశాలను చూచారు. కృష్ణమూర్తి తమ పరిచర్యల ద్వారా తమ వద్దకు వచ్చిన వారి రుగ్మతలను బాపారు. స్వస్థతపరచే శక్తులు తమ వద్దనున్నట్లు బహిర్గతం చేయలేదు. పాదాభివందనం చేయబూనిన వారికే పాదాభివందనం చేసి దాస్య ప్రవృత్తిని నిరసించారు.

కృష్ణమూర్తి దృష్టిలో ప్రత్యేకమైన మతంగాని, జాతిగాని, దేశంగాని లేవు; మానవులంతా ఒక్కటే. ప్రతిదానికి ఇతరులపై ఆధారపడటంగాని, బాధ్యతలను ఇతరులపై మోపటాన్నిగాని వారు నిర్ద్వంద్వంగా ఖండించేవారు. తమకు ఎంత జీవించే హక్కుందో, ఇతరులకు గూడా అంతే హక్కున్నదన్న మానవతావాది. తనను నిరసించిన వాళ్లను, హాని తలపెట్టిన వాళ్లను కూడా దరికి చేరదీసి ప్రేమను పంచి ఇచ్చిన దయామయుడు. పుట్టినప్పుడుగాని, ఆ తరువాతగాని ఏమీలేని తాను, వీలునామా వ్రాసే ప్రసక్తే లేదన్న సర్వసంగ పరిత్యాగి. తనను ఆశ్రయించిన వారికి ఏదోవిధంగా సాయంచేసి సంతృప్తిపరచిన ఉదారుడు. మానవాళికి, ముఖ్యంగా సంకుల సమరంలో చిక్కుకుపోయిన యువతరానికి జీవిత గమ్యాన్ని, గమనాన్ని తెలిపిన మేధావి. తమ ప్రవచనాల ప్రచారంకాని, వాటిపై భాష్యాలు, వ్యాఖ్యానాలు చేయబూనటంకాని అవసరం లేదన్న నిరహంకారి.

## శ్రీకృష్ణమూర్తి పరిపూర్ణులు
## వారి జీవితమే సందేశం

# పరిపూర్ణ జీవితం

అప్పుడే విరిసిన కుసుమంలా మదరాసు వసంతవిహార్ శోభను సంతరించుకొంటున్నది. విశాల ప్రాంగణంలో ఎన్నో రకాల వృక్షాలు. ఆ వృక్షాల నడుమ ఆగంతుకుల దృష్టిని ఆకర్షిస్తూ ఒక భవనం- అక్కడే శ్రీకృష్ణమూర్తి నివాసం. ప్రాంగణ ప్రవేశ ద్వారానికి ఒకవైపు చిన్న నీటికొలను. దానికి ఎదురుగా మరొకవైపు మైదానం- ఆ మైదానం చుట్టూ రకరకాల వృక్ష సంతతి. అదే కృష్ణమూర్తి సమావేశ ప్రాంగణం.

ఆకాశం మబ్బులు వీడి నీలిరంగు పులుముకొంటోంది. చంద్రుడు చిరుమబ్బుల చాటున దోబూచులాడుతున్నాడు. నీలాంబరంలో తారకలు మిణుకు మిణుకు మంటున్నాయి. ఈశాన్య ఋతుపవనాలద్వారా రెండు రోజులుగా కురిసిన వర్షంలో తనికి ప్రకృతి పునీతమై శుచిగా ఉన్నది. గూళ్లకు చేరుకొంటున్న పక్షుల కిలకిలారావాలతో పరిసరాలు పులకరిస్తు న్నాయి.

ఎక్కడినుంచో ఒక కోకిల కూజితము. దూరంగా నాదస్వరం.

సింహద్వారమునుంచి సభాస్థలి వరకు మొగలి పూరేకుల స్వాగత తోరణాలు. అక్కడక్కడ మామిడి మండల మంగళతోరణాలు.

సమయం - **1986**, జనవరి నెల 4వ తేది శనివారం, సాయంత్రం, ఐదు గంటల ముప్పది నిమిషాలు. సమావేశ ప్రాంగణానికి ఇంకా ఒక్కరొక్కరే వచ్చి చేరుతున్నారు. విదేశాలనుంచి, దేశంలోని పలు ప్రాంతాల నుంచి విచ్చేసిన ఆ జనసందోహం ప్రపంచానికి దర్పణం పట్టినట్లుగా ఉంది.

కృష్ణమూర్తి మరికొన్ని క్షణాలలో వేదికపైకి రానున్నారని ప్రకటన-అది ముగుస్తూనే అందరి దృష్టి భవనంవైపుకు మళ్లింది.

బారులుతీరి దారి చేసిన జనం మధ్య నుంచి కృష్ణమూర్తి వేదికవైపుకు నడువసాగారు.

పసిమిరంగు ఎఱ్ఱంచు ధోవతి, లేతనారింజ రంగు లాల్చి, ఆపైన అంగరకాతో నిటారుగా ఉండి ఎవరి సహాయమూ లేకుండా వేదికపైకి వస్తున్న ఆకృతిని దర్శించిన వారికి 91 సంవత్సరాల వయసు పండినవాడు అనిపించటం లేదు.

వేదికపైకి నడచివచ్చి అందరకూ నమస్కరించి ఆసీనులైనారు. కుర్చీలు లేవు. పరువులు లేవు. తిన్నెపై ముదురు నారింజ రంగు తివాచీ పరచి ఉన్నది. మరెవరూ వేదికపైన లేరు. నేపథ్యంలో ఒక వృక్షశాఖ వారిపైకి వాలి ఉన్నది. వేదికపైకి విద్యుద్దీపాల కాంతులు ప్రసరిస్తున్నాయి. అందరివైపు విశాల నేత్రాలతో కలయజూశారు.

ఆ రూపులో ఒక బుద్ధదేవుని, ఒక దక్షిణామూర్తిని ఎవరికి తోచిన విధంగా వారు కాంచగలిగారు.

ప్రశాంత వాతావరణం- ప్రకృతి కల్పించుతున్న శబ్దతరంగాలు మినహా నిశ్శబ్దం నెలకొన్నది. సభంతా ఒక్కటిగా దీక్షాదృక్కులతో కృష్ణమూర్తివైపు చూస్తున్నది.

ప్రసంగం ప్రారంభమయింది.

దయచేసి ప్రసంగంలో పాల్గొనాలి. కేవలం వినటం వరకే పరిమితం చేసుకొని, విన్నవాటిని గురించిన ఆలోచనలేక యాదాలాపంగా ఉండక-మనం సమాలోచనం చేసుకోవాలి..

ఒకటి రెండు విషయాలు ముందుగా స్పష్టం చేసుకోవాలి. ఇది వ్యక్తి పూజకు, ఔన్నత్య ప్రదర్శనకు సంబంధించినది గాదు. వాటిని ఉపన్యాసకుడు ఏనాడో వదలించుకొన్నాడు. వ్యక్తి పూజకు, దైవత్వారోపణకు అలవాటైన వాళ్లు ఉపన్యాసకుడు చెప్పిన వాటిని నిరాకరించారు. ప్రసంగాన్ని శ్రద్ధగా వినాలి. కేవలం వినటమేగాక ప్రసంగంలో పాల్గొనాలి-అంటూ ప్రారంభించి-

ఆపైన-

జీవితం, జీవన సమస్య, సృష్టికి మూలం, భగవంతుడు- వంటి విషయాలను చర్చిస్తూ-

ఈ విషయాలను ఎవరికి వారే అన్వేషించాలి. గురువు, దైవము వంటి ఆశ్రిత భావాలను విడనాడాలి. మన జీవన విధానం, మనల్ని బంధించివేసిన భయం, అనిశ్చితత్వం, భద్రతారాహిత్యంవంటి విషయాలనే గాక, మన జీవనంలో క్రొత్తగా ప్రవేశించిన 'కంప్యూటర్లు' వంటి విషయాలను గురించిన విచారణ కావాలి.

ఇరవై లక్షల సంవత్సరాల అనంతరం మనం ఏ పరిస్థితిలో ఉన్నామో ఒక్కసారి పరిశీలించుకోవాలి. దీనికి ఆరంభం ఎప్పుడు? ఎక్కడికి వెళ్లుతున్నాం??- అనే విషయాలు యోచించాలి. ఆద్యంతాలు ఒక్కటే- అంటే మీరు అంగీకరించకపోవచ్చు. కాని యోచన చేసి చూడండి. తుది మొదలు అన్న విషయం గురించి మనం తెలుసుకోబోతున్నాం-

నాటినుంచి నేటివరకు మానవుడు మతపరంగానే ఆలోచిస్తున్నాడు. అసలు మతం అంటే ఏమిటి? ప్రపంచానికి అతీతమైన దేనికోసమో మానవుడు నిరంతరాన్వేషణా సక్తుడైనాడు. శక్తినంతా వెచ్చించి అభీష్ట సిద్ధికి గుళ్ళు, గోపురాలు నిర్మించుకొన్నాడు. ఈ జంజాటం అంతా కేవలం ఉన్నతిని సాధించటానికి, దానిని కాపాడుకోటానికి పరిమితమై పోయింది. మతం అభీష్టసిద్ధికి, సుఖప్రదాయక జీవితానికి అవసరం అవుతున్నది. ఫలసిద్ధికి ప్రతిఫలం ప్రార్థన రూపంలోనో, మరొక రూపంలోనో చెల్లించాలి. ధనం, దైవం రెండూ కలసి మెలసి ఉంటున్నాయి. ఇదంతా కేవలం మానవ సృష్టి.

చురుకైన మేధతో బహిరంతర విషయ వివేచన చేయాలి. మెదడువేరు, మనసు వేరు. మెదడు సర్వనాడులకు కేంద్రం. మస్తిష్కంలో మనం సేకరించుకొన్న విజ్ఞానం, అనుభవాలు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు, నిక్షిప్తమై ఉంటాయి. ఈ విజ్ఞానం, అనుభవాలు, నమ్మకాలు, సంప్రదాయాలు కొన్ని లక్షల సంవత్సరాలుగా పేరుకొని పూర్వీకుల నుంచి సంక్రమింపజేసుకొని, ప్రోదిచేసుకొని వృద్ధి చేసుకొన్నట్టివి. అవి మెదడును బంధించివేశాయి. మనసుకు మెదడుతో సంబంధంలేదు. మనసు మెదడుకు

ఆదేశాలను ఇస్తుంటుంది. కాని మెదడు మనసుకు ఏవిధమైన వర్తమానాలను అందివ్వలేదు.

'కంప్యూటరు' కేవలం ఒక యంత్రం. దానంతట అదే కార్యక్రమాలను రూపొందించుకొంటుంది. మానవుడు నిర్వహించలేని కార్యక్రమాలన న్నింటినీ కంప్యూటరు నిర్వహిస్తుంది. దీనిని కనిపెట్టిన మానవునికన్న కంప్యూటరు సమర్థంగా పనిచేయగలుగుతున్నది. ఈ యంత్రాన్ని సృష్టించిన మానవుడే దీనికి బానిస అవుతున్నాడు. క్రమంగా ఇది మానవుని మేధస్సును మార్చివేసే సమయం ఆసన్నమవుతున్నది.

జనన సాధన శాస్త్రం **(Genetic Engineering)** అంటూ ఒక సరిక్రొత్త యాంత్రిక విజ్ఞానాన్ని ప్రవేశపెట్టబోతున్నారు. మనిషి నడవడిని పూర్తిగా మార్చటమే ఈ శాస్త్రం లక్ష్యం. తద్వారా ఆలోచనా విధానమే మార్చే ప్రయత్నంలో ఉన్నారు. ఈ జనన సాధన శాస్త్రానికి కంప్యూటర్లు తోడైనప్పుడు మనిషి ఉనికి ఎలా ఉండగలదో ఆలోచించండి. మానవ సహజ స్థితికి ఈ ప్రక్రియ ఒక విఘాతం. ఇది మెదడునే మార్చి వేయగలదు. మానవుని మేధ ఇప్పటికే యాంత్రికంగా పని చేస్తున్నది. ఈ జనన సాధన శాస్త్రం కంప్యూటర్లతో కలిసి సృష్టించే విలయం ఎలా ఉండగలదో ఊహకందని విషయం.

సృష్టి అంటే ఏమిటో తెలుసుకోవాలి. అది ఉపజ్ఞకు భిన్నమైనది. సమకూర్చుకొన్న విజ్ఞానం ఆధారంగా జరిగే కల్పనాశక్తి ఉపజ్ఞ. విజ్ఞానానికి హద్దులు ఉన్నట్లే కల్పనకు కూడా కొంత హద్దు ఉంటుంది. సృష్టికి మూలం తెలుసుకోవటం ద్వారా సృష్టి అంటే ఏమిటో, జీవితం అంటే ఏమిటో, బోధపడగలదు. ఈ సందర్భంలోనే 'ధ్యానం' అంటే ఏమిటో కూడా తెలుసుకోవాలి. ఒక చిన్న గదిలో పటం ముందు కూర్చుని ముక్కు మూసుకుని కొన్ని మంత్రాలను ఉచ్చరించటం ధ్యానం అనిపించుకోదు. ఒక రూపం పైననో, మంత్రం పైననో మనసును నిలిపి ఏకాగ్రతతో ఉండటం కూడా ధ్యానం కాదు. బుద్ధి కుదురుగా ఉండదు. దాన్ని స్వాధీనపరచుకోవాలని ప్రయత్నించటం వృధా శ్రమ అవుతుంది. స్వాధీనమైనా అది తిరిగి విజృంభిస్తుంది. ఏవో కొన్ని క్షణాలు ప్రశాంతంగా

ఉండినంత మాత్రాన ఏదో సాధించినట్లుగా భ్రమపొందగూడదు. అది ఆత్మ సమ్మోహనమే అవుతుంది.

ఆలోచనలు, కోర్కెలు, ప్రయత్నాలు లేకుండా అత్యంత శ్రద్ధాసక్తులతో ఎటువంటి ఉద్రేకాలకు లోనుగాకుండా మెదడును ఉంచగలిగిన స్థితే ధ్యానం. వర్ణనలతో ధ్యాన స్థితిని ఎఱుకపరచుకోలేం. ఆ స్థితిలో మెదడు శూన్యంగా, నిర్మలంగా ఉంటుంది. ఆలోచనలతో సతమతమయ్యే మెదడు ధ్యానస్థాయిని చేరుకోలేదు. మాదక ద్రవ్యాలద్వారా కాక స్వశక్తితోనే ప్రశాంత స్థితిని చేరుకోవాలి.

జీవితమంటే కేవలం ఉద్యోగం, ఔన్నత్యం, పిల్లల్ని కనటం, ఆస్తులు పెంచుకోవటమే కాదు- కోర్కెలకు మూలం ఆలోచన. కోర్కెలు ఇంద్రియాలకు సంబంధించినవి. ఇంద్రియ వాంఛలు తీరేందుకు మెదడులో ఆలోచన ఆరంభమవుతుంది. పరిసరాలు, సంప్రదాయాలు, సామాజిక ప్రభావాలు మెదడును కలుషితం చేశాయి.

జీవితానికి మూలాన్ని తెలుసుకోవటం అతి ముఖ్యం. ఒక పక్షిని చంపితే మరొక పక్షి సజీవంగానే ఉంటున్నది. వాటి సంతతి పెరుగుతూనే ఉంటుంది. అన్ని పక్షులనూ ఒకేమారు చంపి పక్షి సంతతిని నిర్మూలించలేం. ఈ సృష్టికి మూలం నామరహితం. అది సంపూర్ణ ప్రశాంత స్థితి. దాన్ని వర్ణించలేం. అది చాలా పవిత్రమైనది. వక్రబుద్ధితోగాక, హేతుబద్ధంగా ఎవరి జీవితాలను వారు సరిచేసుకోవాలి. అప్పుడే సృజన సవ్యంగా ఉంటుంది-

-ఇలా కృష్ణమూర్తి ప్రసంగం మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలపై అనర్గళంగా సాగింది.

ప్రసంగ కాలంలో ముందు వరుసలలో కూర్చున్న ఒక శ్రోత తనకేసి తదేకంగా చూడటం గమనించి వారిని వారించారు. ఆ శ్రోతలో ఏమాత్రం మార్పు కానరాకపోవటంతో వారిని అచ్చటినుంచి లేచి మరొకచోట కూర్చోమన్నారు. సభ చైతన్యంగా ఉండాలనేదే వారి అభిప్రాయం.

ఇది చివరి ప్రసంగం. కొన్ని క్షణాలు ప్రశాంతంగా కూర్చోవాలని అనుకుంటే- అలాగేనని- మూడు నిమిషాలు మౌనంగా కూర్చున్నారు. సభంతా ఏకంగా మౌన ముద్ర వహించింది.

చేతులు జోడించి నమస్కరించి లేచి నిలుచున్నారు.

జనం బారులుతీరి త్రోవ వదలారు. నమస్కారాలకు ప్రతినమస్కారాలు. కొందరు సాష్టాంగ దండ ప్రణామాలు- వారిని వారించుతూ ముందుకు సాగిపోయారు. కొందరు వారి కుడిచేతిని బలవంతంగా లాగుకొని తమ నెత్తిన పెట్టుకొన్నారు- ఇబ్బందిగా ముందుకు సాగిపోయారు.

అందరి కళ్లలోనూ ఆ మూర్తి బింబమే. అందరి మనసులలోనూ, ఆ రూపమే.

ఇది చివరి ప్రసంగం... అంటే? మరొకరకంగా ఆలోచించటానికి మనస్కరించలేదు.

క్రితం సంవత్సరం మదరాసుకు విచ్చేసినప్పుడు కొంతమంది మిత్రులతో బహుశః వచ్చే సంవత్సరం కృష్ణమూర్తి ప్రసంగాలుండవు- అన్నారు. తప్పకుండా ఉంటాయి- అని వారు తమ అభీష్టాన్ని వ్యక్తపరచారు. వారి అభీష్టం మేరకు, కృష్ణమూర్తి ఆరోగ్యం కొంత మెరుగుగా ఉండటంవల్ల, ప్రసంగాలు ఏర్పాటయ్యాయి. వాటిని అదనపు లబ్ధి (బహుమానం - **Bonus**) గా చెప్పుకొన్నారు. నిజానికి ఆరోజు కృష్ణమూర్తి ప్రసంగం విన్నవారిదే అదృష్టం.

ఆరోజు తిరిగి రాదు.

సభాసదులు గృహోన్ముఖులైనారు. వారి మనసులలో కృష్ణమూర్తి ప్రసంగ విశేషాలు అలజడిని రేపాయి. కొందరికి అయోమయం- మరికొందరికి ఆలోచనల హోరు, ఇంకొందరు- ఇవన్నీ మన శాస్త్రాలలో ఏనాడో చెప్పినవే- కాకుంటే చెప్పే విధానంలో మార్పు- అంతే! అనుకొంటూ తమను తాము తృప్తిపరచుకొన్నారు.

ఆరోజు రాత్రి తిరిగి వానజల్లులు పడ్డాయి.

కృష్ణమూర్తి మహోన్నతుడు. పవిత్ర గ్రంథాల ప్రసక్తి, శాస్త్ర మీమాంస, ప్రమాణాల అవసరం లేకుండా, తానుగా తెలుసుకొన్న విశేషాలను అనుభవైక వేద్యంగా తేలిక మాటలతో వివరించేవారు. ఏ సిద్ధాంతానికీ ఇమడని వారి తాత్త్విక సమాలోచనం- పండితులను కూడా ఇబ్బంది పెడుతుంది.

మానవ సమాజం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో ఒకే కుటుంబంగా చైతన్యంతో మెలగాలి- కృతకమైన కట్టుబాట్లు, సంప్రదాయాలు, విశ్వాసాలు, నియమాలు, నిబంధనలు- వాటినుంచి ముందుగా మానవుడు విముక్తుడు కావాలి- గురువు, దైవంవంటి నమ్మకాలకు అతీతంగా ప్రతి మానవుడు తన స్థితిని తాను తెలుసుకొనేందుకు ఉద్యుక్తుడు కావాలి- ఇదే వారి ఉద్బోధ.

ప్రవచనాలకు, ప్రవర్తనలకు పొంతనలేని కాలంలో తాను చెప్పింది ఆచరించారు. అది ఒకరు విధించినదిగా కాక నిరంతర సత్యాన్వేషణ ద్వారానే తెలుసుకొన్న జీవిత సరణి. ఆ జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు, హఠాత్సంఘటనలు, అద్భుతాలు- అది అసాధారణ జీవితం.

కృష్ణమూర్తి జీవిత చరిత్రను వ్రాసిన వారిలో మొదటగా పేర్కొనవలసిన వారు- శ్రీమతి మేరీ లూట్యెన్స్, ఆ తరువాత శ్రీమతి పుపుల్ జయకర్. ఇద్దరూ కృష్ణమూర్తికి అత్యంత సన్నిహితులు. శ్రీమతి మేరీ లూట్యెన్స్‌కు బాల్యం నుంచి కృష్ణమూర్తితో సాన్నిహిత్యంకాగా శ్రీమతి పుపుల్ జయకర్ సాన్నిహిత్యం 1948 నుంచి కొనసాగింది. ఇద్దరి తల్లిదండ్రులూ కృష్ణమూర్తికి సన్నిహితులు, పరిచితులు. మేరీ లూట్యెన్స్ తండ్రి ప్రముఖ వాస్తుశిల్పి శ్రీ ఎడ్విన్ లూట్యెన్స్ ఢిల్లీ నగరాన్ని రూపొందించారు; తల్లి శ్రీమతి ఎమిలీ లూట్యెన్స్ కృష్ణమూర్తి అభిమాని.

కృష్ణమూర్తి సన్నిహితుల ప్రోద్బలంతో మొదట తానే ఆత్మకథను వ్రాయబూనారు. కొంత గ్రంథం నడచాక విముఖత చూపారు. ఆపైన కృష్ణమూర్తికి సన్నిహితుడు, చిరకాల స్నేహితుడు, మేధావి, రాజనీతిజ్ఞుడు, శ్రీ బి. శివరావుపై ఆకార్యభారం పడింది. కొంత విషయ సేకరణ జరిగాక వారికి ఆరోగ్యం బాగాలేని కారణంగా గ్రంథ రచన సాగలేదు.

మేరి లూట్యెన్స్, కృష్ణమూర్తి అనుమతితో గ్రంథరచనకు ఉపక్రమించి సమగ్రజీవిత చిత్రణను పాఠకులకు అందించారు. ఆ ప్రయత్నంలో కృష్ణమూర్తి, వారి సహచరులు, ఆప్తులు, బంధువులు ఎంతగానో సహకరించారు. మేరి లూట్యెన్స్ వ్రాసిన కృష్ణమూర్తి జీవిత చరిత్ర మూడు సంపుటాలుగా వెలువడింది.

కృష్ణమూర్తి జననం నుంచి, శ్రీమతి ఆనీ బెసెంట్, శ్రీ లెడ్ బీటర్‌గార్ల నిర్యాణం వరకు- అంటే మొదటి ముప్పై ఎనిమిది సంవత్సరాల జీవితకాలానికి సంబంధించిన వివరాలు The Years of Awakening అన్న పేరుతోను; ముప్పై తొమ్మిది నుంచి ఎనభైలయిదు సంవత్సరాల జీవితానికి సంబంధించిన వివరాలు The years of Fulfilment అన్న పేరుతోను; ఆపై జీవితాన్ని అంటే 1980-86 మధ్యకాలానికి సంబంధించిన వివరాలను The Open Door అన్న పేరుతోను వెలువరించారు.

పూపుల్ జయకర్ గారి 'కృష్ణమూర్తి' అన్న గ్రంథం 1986లో వెలువడింది.

మేరి లూట్యెన్స్ రచన ఎక్కువగా పశ్చిమదేశాల నేపథ్యంతోను పూపుల్ జయకర్ రచన ఎక్కువ భాగం భారత దేశం నేపథ్యంతోనూ సాగాయి.

మేరి లూట్యెన్స్ కృష్ణమూర్తి తాత్త్వికోపన్యాసాలు, ప్రసంగాలు, చర్చలు, రచనల సంకలనాలకు సంపాదక బాధ్యత కూడా వహించారు.

కృష్ణమూర్తి జీవిత చరిత్రను- వికాసం, విక్రమణం, విరాజమానం- అని మూడు దశలుగా విభజించుకోవచ్చును.

## వికాసం

శ్రీకృష్ణమూర్తి 1895 మేనెల 11వ తేదీన రాత్రి 12.30 గంటలకు మదనపల్లిలో జన్మించారు. తండ్రి శ్రీజిడ్డు నారాయణయ్య. తల్లి శ్రీమతి సంజీవమ్మ. జిడ్డువారు వెలనాటి వైదిక బ్రాహ్మణులు. పూర్వీకులు కోస్తా

జిల్లాలలోని గోదావరి మండలం నుంచి వలసవచ్చి మదనపల్లి ప్రాంతాలలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. నారాయణయ్య మద్రాసు విశ్వవిద్యాలయ పట్టభద్రులు. బ్రిటిషు ప్రభుత్వ రెవెన్యూ శాఖలో ఉద్యోగిగా ప్రవేశించి తహశీల్దారు పదవికి ఎదిగి, జిల్లామేజిస్ట్రేట్‌గా పదవీ విరమణ చేశారు. కృష్ణమూర్తి తాతగారు శ్రీగురుమూర్తి కూడా విద్యావంతులు- ప్రభుత్వ ఉద్యోగం చేశారు. ముత్తాత శ్రీ రామకృష్ణయ్య సంస్కృత పండితులు. వేదాధ్యయనం చేసిన వారు. కుంఫిణి (ఈస్టిండియా కంపెనీ) న్యాయ స్థానంలో బాధ్యతాయుతమైన పదవినలంకరించారు.

నారాయణయ్య దంపతులకు కలిగిన పదకొండుమంది సంతానం లోను ఆరుగురు మాత్రమే దక్కారు. మిగతా అయిదుగురు పసితనంలోనే మృత్యువాత పడ్డారు. కృష్ణమూర్తి ఎనిమిదవ కాన్పు బిడ్డడు. ఎనిమిదవ కాన్పులో జన్మించిన బిడ్డలకు పురాణ పురుషుడు శ్రీకృష్ణభగవానుని పేరు పెట్టుకోవటం సంప్రదాయం. కృష్ణమూర్తి తల్లి శ్రీమతి సంజీవమ్మ పూర్వాచారపరాయణ. పూజ పునస్కారాలు మెండు. మడి, మైలా పట్టింపులు కూడా ఎక్కువ. అటువంటి ఛాందసురాలు తన ఎనిమిదవ కాన్పు పూజగదిలోనే జరగాలని పట్టుబట్టింది. పూజగదిని చాలా పవిత్రంగా ఎంచుకొని మైల సోకనీయకుండా మడి బట్టలతోనే ప్రవేశించి పూజలు, జపాలు, తపాలు వంటి ఆచార వ్యవహారాలు నిర్వహించుకొనే కాలం అది. అందునా సనాతన ధర్మాలు అనుష్ఠించుతున్న కుటుంబంలో ఇల్లాలు పూజగదిలోనే కాన్పు జరగాలనటం విడ్డూరమే. కాని, ఆ ఇల్లాలికి జరుగబోయే సంఘటనలను ముందుగా గ్రహించే అతీంద్రియశక్తి అబ్బింది. తన గర్భస్థశిశువు మగ సంతానమని, శ్రీకృష్ణుని అంశ అని ఆమెకు గట్టినమ్మకం. ఏది ఏమైనా కాన్పు పూజగదిలోనే జరగాలని అందుకు కావలసిన ఏర్పాట్లన్ని చేసుకొన్నదా ఇల్లాలు. పూజ గదిలో ఇష్టదేవతల సరసన దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షురాలు ఆనీ బెసెంట్ పటం కూడా ఉండినదన్న విషయాన్ని గమనించాలి. ఎంత సనాతనులైనా నారాయణయ్య 1881లో దివ్య జ్ఞాన సమాజసభ్యులైనట్లు తెలియ వస్తున్నది. సతీమణి శ్రీమతి సంజీవమ్మ భర్త అడుగుజాడలలో నడచుకొనే ఇల్లాలు కావటం అటుంచి, అనీబెసెంట్ పట్ల గౌరవాభిమానాలుండేవని, అనీబెసెంట్ భారత

జన జాగృతికి ముఖ్యంగా విద్యాభివృద్ధికి ఎంతో కృషి చేశారని తనకు చెబుతుండేవారని కృష్ణమూర్తి చెప్పుకొనేవారు. పూజగదిలో ఇష్ట దేవతల సమక్షాన రామనామం ఆంజనేయనామ జపం జరుపుతూ రాత్రి 12.30 గంటలకు బంధువుల ఇంటి ఆడబడుచు సాయంతో ఆ ఇల్లాలు పురుష సంతానాన్ని సుఖంగా ప్రసవించింది. శీర్షోదయమైన వేళా విశేషం అమోఘంగా ఉందని ఆప్రాంతాల ప్రసిద్ధులైన జ్యోతిషపండితులు శ్రీ కుమార శ్రౌతులవారు చెప్పారు. కుర్రవాడికి ''కృష్ణమూర్తి'' అని నామకరణం చేశారు.

ఆ మరుచటి సంవత్సరం నారాయణయ్య గారికి కడపకు బదిలీ అయింది. ఆ ప్రాంతం అప్పట్లో 'మలేరియా'కు ఆలవాలం. కృష్ణమూర్తికి మలేరియా వ్యాధి అంటుకొన్నది. చాలా కాలం వరకు తరచుగా జ్వరం వస్తుండేది. ముక్కునుంచి తరచు నెత్తురు కారుతుండేది. ఈ రోగాలతో బిడ్డడు బ్రతికి బట్టకడతాడనిపించలేదు. కృష్ణమూర్తి అయిదవ ఏట తిరిగి నారాయణయ్యగారికి కదిరికి బదిలీ అయింది. కడపకన్న కదిరి ఆరోగ్యకర మైన ఊరు. బిడ్డడి ఆరోగ్యం బాగు పడుతుందనుకొన్నారు. కాని మలేరియా వ్యాధి, ముక్కునుంచి నెత్తురు కారటం కృష్ణమూర్తిని చాలాకాలం అంటి పెట్టుకొన్నాయి.

కదిరిలోనే కృష్ణమూర్తికి శాస్త్రోక్తంగా అక్షరాభ్యాసం, ఆరవ ఏట ఉపనయనం జరిపించారు.

**1898** మే నెల **30**వ తేదీన కృష్ణమూర్తి తమ్ముడు శ్రీ నిత్యానంద కడపలో జన్మించారు. నిత్యానంద చిన్నప్పటినుంచి చాలా చురుకుగా ఉండేవారు. అన్న కృష్ణమూర్తి చదువులో వెనుకడుగు వేస్తుంటే తమ్ముడు నిత్యానంద ముందుకు దూసుకు పోతుండేవారు. ఇద్దరూ కలిసే బడికి వెళ్లుతుండేవారు. కొద్దికాలానికి ఇద్దరూ ఒకే తరగతిలో కలుసుకున్నారు.

కృష్ణమూర్తి మందకొడిగా, నీరసంగా, ఎటోచూస్తూ, చదువుమీద శ్రద్ధ లేకుండా ఉండేవారు. ప్రతిరోజు ఏదో పుస్తకమో, పెన్సిలో పారేసుకోవటం లేదా బీద విద్యార్థులకు ఇచ్చివేయటం జరిగేది. బిచ్చగాళ్లకు బియ్యపు గింజలు వేయటం ఆనవాయితీగా ఉన్నరోజులవి. కృష్ణమూర్తి

తల్లి ఇచ్చిన బియ్యం మొత్తం మొదటి బిచ్చగానికి వేసి తిరిగి లోపలికి వచ్చి మరికొంత బియ్యం తీసుకువెళ్లుతుండేవారు. రాత్రిపూటలు అన్నంకోసం వచ్చిన బిచ్చగాళ్ల విషయంలో కూడా ఇదే తంతు. అలా మొదటినుంచి కూడా కృష్ణమూర్తిని ధార్మికగుణం అంటి పెట్టుకొనే ఉన్నది.

నారాయణయ్య గారికి తరచు బదిలీలు రావటంవల్ల పిల్లల చదువులు కుంటుపడ్డాయి. కృష్ణమూర్తి పుస్తకాలు ముందు వేసుకొని కూర్చోవటం కన్న ఆకాశంలోని మబ్బులవంక, చెట్లవంక చూస్తూనో లేదా నేలమీద కూర్చున్నప్పుడు మొక్కలవంక, క్రిమికీటకాదులవంక చూస్తూనో ఎక్కువ సేపు గడిపేవారు. ప్రకృతి పరిశీలన మొదటినుంచి వారిలో ఎక్కువగా ఉండేదని తెలుస్తున్నది.

నారాయణయ్య తిరిగి కడపకు బదిలీ అయ్యారు. అప్పటికి కృష్ణమూర్తికి ఎనిమిదో ఏడు. ఆ సంవత్సరమే కృష్ణమూర్తి అక్కగారు చనిపోయారు. అప్పటికి ఆమె వయసు ఇరవై సంవత్సరాలు. ఆమెకు ప్రాపంచిక సుఖాల కన్న వేదాంతం మీదే ఎక్కువ మక్కువ. ఆమె మరణానంతరమే కృష్ణమూర్తిలో అతీంద్రియ జ్ఞానలక్షణాలు పొడ చూపాయి. చనిపోయిన అక్కగారు తల్లికి తరచుగా కనిపించేవారు. పెరటి తోటలో ఒక నిర్ణీత స్థలంలో ఇద్దరూ మాట్లాడు కొనేవారు. ఒక్కొక్క సారి తల్లి కృష్ణమూర్తిని కూడా అచ్చటికి తీసుకువెళ్లి అక్కనుచూచావట్రా అని అడిగేవారు. మొదట్లో నవ్వుకొన్నా క్రమంగా అక్కగారిని చూడగలిగారు. మొదట కొంత భయం వేసినా క్రమంగా అలవాటయిపోయింది. తమ తల్లిగారు దివ్యశక్తులను కాంచగలిగేవారని కృష్ణమూర్తి చెప్పుకొన్నారు.

అక్కగారు చనిపోయిన రెండు సంవత్సరాలలో కృష్ణమూర్తికి పదిన్నర సంవత్సరాల వయసప్పుడు తల్లిగారు కూడా దివంగతులైనారు. నారాయణయ్య కుటుంబానికి ఇది పెద్ద దెబ్బ. అప్పటికింకా వారు కడపలోనే ఉన్నారు. ఉద్యోగ విరమణ దగ్గర పడుతున్న రోజులు. గృహనిర్వహణ బాధ్యత, పిల్లల ఆలనాపాలనా చూచుకొనే గృహలక్ష్మి కన్నుమూయటంతో నారాయణయ్యకు కష్టాలు ఆరంభమయ్యాయి.

కృష్ణమూర్తి తరచుగా తమకు తల్లి కనిపించేవారని చెప్పుకొన్నారు. ఒక సారి మేడమెట్లు ఎక్కుతుంటే ముట్టుకోవాలని ప్రయత్నించారట. కాని ఆమె చివరిమెట్టు వరకూ ఎక్కి అదృశ్యమయ్యారట. బడికి వెళ్లేటప్పుడు, బయట తిరగటానికి వెళ్లేటప్పుడు ఆమె తనను అనుసరిస్తుం డేవారని చెప్పుకొన్నారు. గాజులమోత వినిపించేదట. భయంతో తిరిగి చూస్తే తల్లిగారి ముఖమూ, కట్టుచీర ఛాయగా కనిపించేవట. నారాయ ణయ్య శ్రీమతికి కర్మ జరిపే రోజులలోని ఒక నాటి సంఘటనను తెలియజేసిన వృత్తాంతం కూడా ఆవిషయాన్ని ధృవపరిచేదిగా ఉంది. భార్య మరణానంతరం నారాయణయ్య పిల్లలతో మదనపల్లికి చేరుకొన్నారు. ఉద్యోగ విరమణ చేసేంతవరకూ మదనపల్లిలోనే ఉంటూ పిల్లల చదువు సంధ్యలను చూచుకొంటుండేవారు. కృష్ణమూర్తి నిత్యానందల చదువు మదనపల్లి హైస్కూలులోనే సాగింది.

నారాయణయ్య జిల్లా మేజిస్ట్రేటుగా తమ ఏబది రెండవ సంవత్స రంలో ఉద్యోగ విరమణ చేశారు. ప్రభుత్వం ఇచ్చేభృతి (పెంషను) చాలీ చాలకుండా ఉండేది. పైగా చదువులకు ఎదిగి వస్తున్న పిల్లలు. వెనుకా ముందూ కూడబెట్టుకున్న ఆస్తిపాస్తులు ఏమీలేవు. దివ్యజ్ఞాన సమాజసేవ చేసుకుంటూ పిల్లలను చదివించుకోవచ్చునని సమాజ అధ్యక్షురాలు ఆనీబెసెంటుకు విన్నవించుకొన్నారు. తహశీల్దారుగా, జిల్లా మేజిస్ట్రేటుగా పనిచేసిన నారాయణయ్యకు దివ్యజ్ఞాన సమాజంలో పనులు నిర్వహించటం అంత కష్టమేమీకాదు. తన నలుగురు కొడుకులూ తాను ఉండటానికి వసతి లభించితేచాలు. అంతకుమించిన కోర్కెలు లేవు. వృద్ధాప్యంలో తానూ ఏదో వ్యాపకం పెట్టుకొంటే కొంతకాలక్షేపం.

అప్పటికి పెద్ద కుమారుడు శ్రీశివరాం వయసు పదిహేను సంవత్సరాలు. కృష్ణమూర్తికి పదిరెండు సంవత్సరాలు, నిత్యానందకు తొమ్మిది, చివరికుమారుడు సదానందకు అయిదు సంవత్సరాల వయసు. అందరికన్న చిన్నవాడు సధానంద మేదకుడుగా ఉండటం వల్ల కాస్త అంటి పెట్టుకొని ఉండాలి.

దివ్యజ్ఞాన సమాజం అంతర్జాతీయ కేంద్రకార్యాలయం మదరాసు అడయారులో ఉన్నది. ఆప్రాంతాల అప్పట్లో తమకు పాఠశాలలు లేవనే

కారణంగా నారాయణయ్య పెట్టుకొన్న విజ్ఞాపన పత్రాన్ని తిరస్కరించారు. పునః పరిశీలనకు విన్నవించు కొన్నా లాభం లేకపోయింది. కడకు ఒక సంవత్సరంగడచాక అనుమతి లభించినది. సమాజ కార్యదర్శికి పని పెరగటం వల్ల సహాయానికి అనుభవజ్ఞుడు కావలసి రావటంతో నారాయణ య్యకు అవకాశం లభించింది.

నారాయణయ్య దివ్యజ్ఞాన సమాజం వారి అనుమతిని అందుకొని నలుగురు కొడుకులతో బాటు మేనల్లుడిని కూడా తెచ్చుకొని అడయారులో విడిదిచేశారు. పిల్లలు చదువుకు చాలా దూరం నడచివెళ్లేవారు. పెద్దవాడు శివరాం వైద్యవిద్యచదువుకు ప్రెసిడెన్సీ కళాశాలలో చేరారు. కృష్ణమూర్తి, నిత్యానంద, మేనల్లుడు మైలాపూరులోని పెణ్ణాత్తూరు సుబ్రమణ్యాం ఉన్నత పాఠశాలలో చేరారు. ఇప్పటికీ ఆ పాఠశాల ఉన్నత ప్రమాణాలకు ప్రసిద్ధి చెందినది. చివరివాడు సదానంద అర్భకుడు కావటం వల్ల తనతోనే ఉండేవాడు. నారాయణయ్య చెల్లెలు, భర్తతో పోరుపెట్టుకొని అన్నగారిని ఆశ్రయించింది. ఆమె ఇంటిపనులు, వంటసాయం చేస్తుండేది. గృహవసతికి సమాజ ప్రాంగణంలో గాక దానికి దగ్గరగా శిధిలావస్థలో ఉన్న ఇల్లు మాత్రమే లభించింది. ఇంటి వాతావరణంతో బాటు పిల్లల అనారోగ్యం కూడా బాధాకరంగా ఉండేది. కృష్ణమూర్తికి ఉన్న అనారోగ్యంతో బాటు సరియైన సంస్కారం లేక తలనిండాపేలుతో బాధపడుతుండేవారు. అనారోగ్య కారణంగా శుష్కించిన శరీరంతోనే పాఠశాలకు వెళ్లి వస్తుండే వారు. చదువు సరిగా సాగేదికాదు. ఎప్పుడూ పరధ్యానం. పాఠాలు వచ్చేవిగావు. గోడకుర్చీలు వేయటం నిత్యవ్యవహారమై పోయింది.

కృష్ణమూర్తి జీవితంలో ఈ మదరాసు అడయారు నివాసం ఒక పెద్ద మలుపు.

దివ్యజ్ఞాన సమాజం 1875 సంవత్సరంలో న్యూయార్కు నగరాన స్థాపిత మయింది. సమాజ స్థాపకులు రష్యాదేశస్థురాలు మేడం హెచ్.పి. బ్లవట్స్కీ, అమెరికా దేశస్థుడు హెచ్.ఎస్. ఆల్కాట్. 1879లో సమాజ ప్రధాన కార్యస్థానాన్ని బొంబాయి నగరానికి, ఆపైన 1882లో మదరాసు నగరానికి సమీపంలోని అడయార్‌కు తరలించారు.

మతవిశ్వాసాల ప్రమేయం లేకుండా, సామరస్యం, సదవగాహన, సత్సంగాలను పెంపొందించి సత్యశోధనకు, ఆశోధన ఫలితాలను సభ్యుల సదవగాహనకు గాను కృషి చేయటం- సమాజం ప్రధాన లక్ష్యం.

జాతి, మత, కుల, లింగ, వర్ణ వివక్షత లేని విశ్వమానవ సౌభ్రాత్రాల ప్రధాన కేంద్ర నిర్మాణం- మత, తత్త్వ, విజ్ఞాన శాస్త్రాల తూలనాత్మక అధ్యయనం- అవ్యక్త ప్రకృతి సూత్రాల, అంతర్గత మానవశక్తుల పరిశోధన- సమాజం ముఖ్యోద్దేశాలు.

అధ్యయన పరత్వం, సహనశీలం, ఉన్నతాదర్శం, నిరంతరకృషి, ఉత్సాహం- సమాజ సభ్యులకు కావలసిన అర్హతలు. ఈ అర్హతలున్న వారు ప్రపంచములో ఏ దేశానికి చెందిన వారైనా- దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులుగా చేరవచ్చు.

ప్రధానకార్యాలయం అడయారులో ఒక వైపు బంగాళఖాతం, మరొకవైపు నదీతీరాలను ఆనుకొని ఉన్న విశాల భూభాగం. సమాజ ప్రాంగణం ఋషి వాటికను తలపిస్తుంటుంది. విశాల భవనాలు, ప్రార్థనామందిరాలు, దేవాలయాలు, చెట్లు, తీగలు, పొదలతో ప్రాంగణ వాతావరణం మనోరంజకంగా హృదయాహ్లాదకరంగా ఉంటుంది. పురాతన వృక్షాలు చేతులు చాపి ఆగంతుకులను దీవిస్తున్నట్లుగా శాఖలను అన్ని వైపులకు విస్తరించుకొని ఉంటాయి.

ఆనీబెసెంట్ దివ్యజ్ఞాన సమాజానికి 1907లో అధ్యక్షురాలుగా ఎన్నికయ్యారు. సమాజం పాదుకోటానికి స్థాపకులు కృషిచేస్తే, ఆ తరువాత కాలంలో వేళ్లూని విస్తరించటానికి ఆనీబెసెంట్ ఎంతో కృషి చేశారు.

జ్ఞానులు, మహాపురుషులు, జగద్రక్షకులు భౌతిక శరీరాలను వీడినా, సూక్ష్మశరీరులై ఈ లోకాన్ని సదా రక్షించుతుంటారని, ధర్మచ్యుతి కలిగినప్పుడు, లోక కళ్యాణార్థమై మానవులను వివేకవంతులను జేసి ధర్మం పునరుద్ధరించి విశ్వ శ్రేయస్సును నెలకొల్పటానికి వారు తిరిగి మానవ శరీరాలను ఆశ్రయించుతుంటారని, దివ్యజ్ఞాన సామాజికుల విశ్వాసం. అట్టి మహాపురుషుడు, జగద్రక్షకుడు త్వరలోనే మానవ శరీరంలో ప్రవేశించి లోకోద్ధరణకు పూనుకొనే రోజు ఆసన్నమవుతున్నదనే ప్రచారం కూడా

ప్రబలంగా ఉన్నరోజులవి. ఆశుభ ఘడియలకు నిరీక్షించటమే కాక, ఆ జగద్రక్షకుని ఆవాహనకు అనుకూలమైన పవిత్ర మానవ దేహాన్ని వెదకటం కూడా ఆరంభించారు.

దివ్యజ్ఞాన సమాజంవారు పవిత్రంగా పరిగణించే పరమగురువులు మోర్యా, కూత్‌హూమిలు టిబెట్ (త్రివిష్టపం) వాసులు. వారింకా మానవ దేహాలతో హిమాలయ పర్వత శ్రేణులలో తపశ్చర్యలో ఉంటారని, యోగదృష్టితోనే వారి దర్శన మవుతుందని- దివ్యజ్ఞాన సమాజం వారి విశ్వాసం. ఈ పరమగురువుల సాన్నిధ్యం దివ్యజ్ఞాన సమాజ స్థాపకులు మాడమ్ బ్లవట్స్కీ, కల్నల్-ఆల్కాట్‌లకు లభించినదని, వారు పరమగురువుల బోధలు స్వీకరించారని కూడా చెప్పుకొంటారు. అలాగే ఆనీబెసెంట్‌కు పరమగురువు మోర్యా, ఆమెకు కుడి భుజంగా ఉండిన చార్లెస్ వెబ్‌స్టర్ లెడ్‌బీటర్‌కు పరమగురువు కూత్‌హూమి బోధలు చేశారని కూడా చెప్పుకొంటారు.

పరమయోగి, మహాజ్ఞాని మైత్రేయుడు కూడా పరమగురువులు మోర్యా, కూత్‌హూమిలకు అనతి దూరంలోనే ఒక ఆశ్రమంలో ఉంటున్నట్లు త్వరలో మైత్రేయుడే మానవలోకంలో అవతరించనున్నట్లు ప్రచారమయింది. మైత్రేయుడిని యుగపురుషుడుగా అభివర్ణిస్తుంటారు. గతంలో మైత్రేయుడు శ్రీకృష్ణుడుగా బోధిసత్త్వుడుగా ప్రాగ్ భూఖండం పైన, ఆతరువాత ఏసుప్రభువుగా పశ్చిమ భూఖండంపైన అవతరించినట్లు ఈ మారు పశ్చిమ ఖండంలోనే అవతరించనున్నట్లు ప్రచారం చేశారు.

మైత్రేయునికి అనువైన మానవ శరీరానికై ఆనీబెసెంట్, లెడ్‌బీటర్‌లు వెదక సాగారు. అమెరికా దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యదర్శి, చికాగో నివాసి డాక్టర్ వెల్లర్ వాన్ హూక్ కుమారుడు, పదమూడు సంవత్సరాల వయసుగల బాలుడు, సుస్వరద్రూపి, సూక్ష్మగ్రాహి అయిన హ్యూబర్ట్‌ను యోగ్యుడుగా ఎంచుకున్నారు. అతి బలవంతం మీద తల్లిదండ్రులకు నచ్చజెప్పి ఒప్పించి ఆకుర్రవాడిని భారత దేశానికి ప్రత్యేక శిక్షణకుగాను పంపే ఏర్పాట్లుకూడా పూర్తి చేశారు.

ఆనేపథ్యంలో-

ఒకనాడు-

కృష్ణమూర్తి సోదరులతో కలసి సముద్రతీరంలో మిత్రులతో ఆడుకొంటున్న సాయంవేళ- లెడ్ బీటర్ కృష్ణమూర్తిని చూడటం తటస్థించింది. లెడ్ బీటర్ దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలోనే ఒక ప్రత్యేక సౌధంలో ఉంటున్నా కృష్ణమూర్తిని చూడటం అదే ప్రథమం. కృష్ణమూర్తిలోనూ సోదరుడు నిత్యానందలోనూ లెడ్ బీటర్‌కు తేజస్సు కనిపించింది. ప్రత్యేకించి, కృష్ణమూర్తిలోని అనాసక్తి, నిశ్చలత, ఎక్కడో ఏమో వెదకే చూపులు, నిర్లిప్తత- లెడ్ బీటర్‌ను ఆకర్షించాయి. ఎంతకాలంగానో నిరీక్షిస్తున్న యుగపురుషుడు మైత్రేయునికి యోగ్యమైన మానవ శరీరం కృష్ణమూర్తి మాత్రమేనని, నిర్ధారించుకొన్నారు. కృష్ణమూర్తి ఒక నాటికి జ్ఞానబోధకుడుగా, మేటి వక్తగా వెలుగొందుతాడని భవితవ్యం పలికారు. కృష్ణమూర్తి వివరాలు సేకరించారు. నారాయణయ్యతో సంప్రదించారు. అప్పుడు ఆనీబెసెంట్ దేశంలో లేరు.

లెడ్ బీటర్ విచిత్రమైన వ్యక్తి. ఎంత తెలివైనవాడో అంతటి వివాదాస్పదుడు. మంత్రతంత్రాలలో దిట్ట. ఆనీ బెసెంట్ పుట్టిన 1847 సంవత్సరంలోనే లెడ్ బీటర్ కూడా పుట్టారు. దివ్యజ్ఞాన సమాజంలో ఆమెకన్న అయిదు సంవత్సరాల ముందుగా చేరారు. విచిత్రమేమంటే ఆనీబెసెంట్ దివంగతురాలైన ఆరు నెలలలోపునే- అంటే ఆనీబెసెంట్ 1933 సెప్టెంబరు 20న దివంగతురాలైతే 1934 మార్చి 1న - లెడ్ బీటర్‌కూడా దివంగతులైనారు. ఇంటికి దూరమై 1878 నుంచి మత ప్రచారం, మత సేవలలో ప్రవేశించారు. చిన్నప్పటినుంచి గుప్త విద్యలో అభినివేశం. మేడమ్ బ్లవట్స్కీ అనుగ్రహంతో 1883లో దివ్యజ్ఞాన సమాజంలో సభ్యుడుగా చేరి దేశాలు తిరుగుతూ అడయారు చేరి కల్నల్ ఆల్కాట్‌ను ఆశ్రయించారు. ఎన్నో అభియోగాలు రావటంతో కల్నల్ ఆల్కాట్ పిలిచి మందలించారు. ఆనీబెసెంట్ సమాజం అధ్యక్షురాలైన తరువాత ఆమె మంచితనం వల్ల ఆమెకు బాగా చేరువైనారు. లెడ్ బీటర్ శక్తి సామర్థ్యాలు అమోఘమని చెప్పుతుంటారు. వారిలో దివ్యశక్తులున్నట్లు కూడా ప్రతీతి. జీవుల గతచరిత్ర, భవిష్యత్తులను తెలుసుకొనే సామర్థ్యం కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. ఆనీ బెసెంట్ తనకున్న శక్తిని 'హోంరూలు' ఉద్యమానికి వెచ్చించటంవల్ల మాంత్రిక, తాంత్రిక విషయాలలో ఆమె లెడ్ బీటర్‌పై ఎక్కువగా ఆధారపడినట్లు కూడా తెలుస్తున్నది.

ఒకనాడు కృష్ణమూర్తి శిరస్సుపైన చేయిఉంచి భూతభవిష్యత్తులను తెలిపారు. నారాయణయ్య, లెడ్ బీటర్ సహాయకులు వివరాలను వ్రాసు కొన్నారు. వివరాలను విన్నవారికి ఆశ్చర్యమయింది.

నారాయణయ్యకు కృష్ణమూర్తి బ్రతుకు మీద ఆశ లేదు. ఎప్పుడూ ఏదో ఒక రోగంతో తీసుకొంటూ ఈసురోమని ప్రపంచంతో సంబంధం లేకుండా ఉండే కృష్ణమూర్తి బడిలోకూడా మందకొడిగా ఉండేవారు. పాఠాలు వచ్చేవికావు, బెత్తపుదెబ్బలు, గోడకుర్చీలు సర్వసాధారణం. తరగతి గదిలోకన్న బయటపంచ చావిడిలోనే ఎక్కువకాలం గడచేది. ఒక్కొక్క రోజు కృష్ణమూర్తి బయటనే ఉండిపోయిన విషయం మరచి, బడికితాళాలు వేసుకుపోయేవాళ్లు. ఏ రాత్రిపూటో వెతుక్కుంటూ వచ్చి- కృష్ణమూర్తి అప్పటికీ అలాగే నిలుచునో, గోడకుర్చీలోనో ఉండటం చూచి ఆశ్చర్యపడి ఇంటికి తీసుకు వెళ్లుతుండేవారు. బక్క శరీరం- ప్రక్క ఎముకలు పొడుచుక వచ్చి ఉండేవి. శిరస్సు ముందుభాగం క్షవరంచేసి, మిగతా భాగం దుబ్బుగా, పొడవుగా శిరోజాలు వ్రేలాడు తుండేవి. అప్పట్లో కృష్ణమూర్తికి పాఠాలు చెప్పిన అయ్యవారు (గురువుగారు) తరువాత కాలంలో కృష్ణమూర్తి ఉపన్యాసాలువిని, ఇంతటి గొప్పవాడిని ఆరోజులలో ఎలా కొట్టగలిగానో అనివాపోయారు. అయ్యవారు కళ్లనీళ్ళు పెట్టుకోవటం చూచిన కృష్ణమూర్తి ఎప్పటిలాగే నిర్లిప్తంగా ఉండిపోయారు.

లెడ్ బీటర్- నారాయణయ్య ఇంటి పరిసరాలు, పారిశుద్ధ్యలోపం, వివరాలు తెలుసుకొని దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలోనే పిల్లలతో సౌకర్యంగా ఉండే ఏర్పాటు చేయించారు. సుదీర్ఘచర్చల అనంతరం కృష్ణమూర్తిని, సోదరుడు నిత్యానందను - ఆనీబెసెంట్‌కు దత్తత ఇచ్చేటట్లు నారాయణ య్యను ఒప్పించారు. విదేశసంచారంలో ఉన్న ఆనీ బెసెంట్‌కు లేఖల ద్వారా ఏర్పాట్ల వివరాలు తెలిపారు. ఆ రోజులలోనే నిత్యానందకు పదకొండవ ఏట, అంటే కొంచెం ఆలస్యంగానే ఉపనయనం జరిపించారు.

కృష్ణమూర్తి చదువు పోషణాది బాధ్యతలను లెడ్ బీటర్ తమ వ్యక్తిగత పర్యవేక్షణలో నిర్వహిస్తుండేవారు. నారాయణయ్య, వారి మిగతాపి ల్లలు, కుటుంబ నిర్వహణకు గూడా మంచి ఏర్పాట్లు చేశారు.

ఆ నాడు లెడ్ బీటర్ గనుక తమను గమనించకుంటే భవిష్యత్తు ఎలాగుండేదన్న ప్రశ్నకు- కృష్ణమూర్తి బాల్యంలోనే చనిపోయి ఉండేవాడని- కృష్ణమూర్తి జవాబిచ్చినట్లు తెలుస్తున్నది.

కృష్ణమూర్తి, నిత్యానందల పోషణ శిక్షణలలో ఎంతో మార్పు వచ్చింది. లెడ్ బీటర్ - ఒకనాడు కృష్ణమూర్తిని బడిలో చిదుక బాదటంవిని, గాయాలు చూచి వెంటనే బడిచదువు మాన్పించారు. స్నానపానాదులు, ఆహార విహారాలు, వేషభాషలు, చదువుసంధ్యలు- సమస్తమూ లెడ్ బీటర్ అదుపు ఆజ్ఞలలో ఉండేవి. ఒక్కొక్క మారు ఆ శిక్షణ దుర్భరంగా ఉండేది. పాఠాలు వింటూ కృష్ణమూర్తి కిటికీలోనుంచి ఏటో చూస్తూ పరధ్యానంగా ఉండిపోయేవారు. లెడ్ బీటర్‌కు కోపం ముంచుకొచ్చేది. ఆ కోపంతో మూతి మీద కొట్టేవారట. ఒక్కొక్కసారి నోరు తెరుచుకొని ఉండేవారు. దెబ్బలు తగిలిం తరువాత ఆ అలవాటు కూడా తప్పింది.

బడిచదువు మాన్పించిన తరువాత కృష్ణమూర్తి, నిత్యానందలకు దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలోనే విద్య బోధించారు. లెడ్ బీటర్, వారి సహాయకులు పాఠాలు చెప్పటమే గాక మరొక అయ్యవారిని కూడా కుదిర్చారు. ముఖ్యంగా ఆంగ్లంలో అనర్గళంగా మాట్లాడేటట్లు చేయాలని, ఆనీబెసెంట్ విదేశాలనుంచి తిరిగి వచ్చేలోపున కృష్ణమూర్తి ఆమెతో ఆంగ్లంలో చక్కగా సంభాషించ గలిగేటట్లు చేయాలని వారి ఆరాటం. విద్యా బోధనతో బాటు యోగవిద్య కూడా ప్రారంభించారు. యోగం ద్వారా పరమగురువు కూత్‌హూమిని దర్శించి ఉపదేశం పొందటానికే ఆ ప్రయత్నం. కృష్ణమూర్తి యోగసాధన సంతృప్తికరంగా ఉంటున్నట్లు లెడ్ బీటర్ ఆనీబెసెంట్‌కు జాబుల ద్వారా తెలిపారు.

పరమగురువు దర్శనంతో బాటు ఉపదేశం కూడా పొంది ఆ ఉద్బోధనలను At the feet of the Master (పరమగురు చరణసన్నిధి) అనే చిన్న గ్రంథంగా కూర్చారు. గ్రంథం కూర్చటంలో కృష్ణమూర్తికి- తాము విన్నసూక్తులను మనసులోనికి తెచ్చుకొని అక్షర రూపం పొదగటంలో కొంత ఇబ్బంది కలిగినట్లు, వాటిని లెడ్ బీటర్ పరిష్కరించినట్లు చెప్పుతుంటారు. అసలాగ్రంథం కృష్ణమూర్తి వ్రాయలేదు;

లెడ్ బీటరే వ్రాసి కృష్ణమూర్తి రచనగా ప్రచారం చేశారనే వాదనకూడా ప్రచారంలో ఉన్నది. కృష్ణమూర్తి ఆ వివాదంలోకి అప్పుడుగాని, ఆ తరువాత గాని దిగకుండా- అవునని గాని, కాదని గాని చెప్పక మిన్నకుండేవారు. 'ఆల్కియోన్' కృతిగా ఆ చిన్నగ్రంథం 1910లో మొదటిసారిగా ముద్రితమైనది. ఇప్పటికి 27 భాషలలోనికి అనూదితమై, 40 ముద్రణలు పొందినది. At the feet of the Master (పరమగురు చరణ సన్నిధి) కృష్ణమూర్తి తొలిరచన.

ఆనీబెసెంట్ 1909 నవంబరు 27న విదేశ ప్రయాణాలు ముగించుకొని మదరాసు చేరుకొన్నారు. మదరాసు ''సెంట్రల్ స్టేషన్''లో కృష్ణమూర్తి, నిత్యానందలు గులాబి పూలమాలలతో స్వాగతం పలికారు. కృష్ణమూర్తిని, నిత్యానందనలను చూచి ఆనీబెసెంట్ సంభ్రమం చెందారు. లెడ్ బీటర్ నిర్వహించిన కార్యం పట్ల సంతృప్తి తెలిపారు. కృష్ణమూర్తి, నిత్యానందలు ఆనీబెసెంట్‌కు చేరువయ్యారు. క్రొత్తదనం పోయి చనువు ఏర్పడింది. యోగాభ్యాసం, శుచి, శుభ్రతలు ఎక్కువయ్యాయి. బయటవాళ్లతో తిరగరాదని ఆంక్షలు పెట్టారు. క్రమంగా మిత్రులకు, ఆ పైన తండ్రికి, సోదరులకు దూరమయ్యారు. నారాయణయ్యతో గూడా ఎక్కువగా మాట్లాడనిచ్చేవారుకారు. కన్నతండ్రిబాధ పడుతుండేవారు. అంతలోనే వాళ్లు నెమ్మదిగా ఉన్న పరిస్థితులను జూచి ఓదార్పు చెందేవారు.

ఆనీబెసెంట్ దివ్యజ్ఞాన సమాజ సమావేశాలలో పాల్గొనేందుకు వారణాసికి ప్రయాణమయ్యారు. ఆమె అడయారులో లేని రోజులలో కృష్ణమూర్తి, నిత్యానందల సంరక్షణ లెడ్ బీటర్ పర్యవేక్షణలో జరగాలని నారాయణయ్య ఇంటిలో గాక, పిల్లలు తమ శయన మందిరంలోనే ఉండాలని- ఆదేశించారు, ఆనీబెసెంట్. వారణాసికి వెళ్లిన తరువాత శిక్షణ తీవ్రతరమయింది. ఉదయంవేళల సైకిలు సవారి మైళ్ల పర్యంతం చేయించేవారు. అలుపు, అలసటలు పోగొట్టటమేగాక, పిల్లలలో జంకుగొంకులు పోయి, ధైర్యంగా, వేగంగా దూసుకు పోవటమే ఈ సైకిలు సవారి ఉద్దేశం. సైకిలు సవారి మాత్రమే గాక టెన్నిస్ ఆట క్రమంతప్పకుండా ఆడాలి. సముద్రంలో ఈదటం వారి దిన చర్య. భోజన భాజనాదులు నారాయణయ్య ఇంటిలో గాక, దివ్యజ్ఞాన సమాజం ప్రత్యేకాహూతులకు

గాను నిర్వహించే భోజనశాలలోనే ఏర్పాటు చేశారు. కృష్ణమూర్తిని, నిత్యానందలను తమ ఇంటికి ఎక్కువగా వెళ్లనిచ్చేవారు కారు. అంతగా అవసరమైతే నిత్యానందను మాత్రం వదలేవారు. కృష్ణమూర్తి మాత్రం పరాధీనుడైనారు. శరీరం మాత్రం ఆరోగ్యం పుంజుకొని కండ బట్టటం మొదలు పెట్టింది.

కృష్ణమూర్తికి జగద్గురువు మైత్రేయుని ఉపదేశం, ఆవాహనలకోసం రంగం సిద్ధం చేశారు. పరమ గరువు కూత్‌హూమి అనుజ్ఞ పొందినట్లు సుముహూర్త నిర్ణయమే తరువాయి అన్నట్లు ప్రయత్నాలు పూర్తయ్యాయి. యోగవిద్య అనుసంధానం తీవ్రతరం చేశారు.

ఆ శుభముహూర్తం 1910 సంవత్సరం, జనవరి నెల 11వ తేదిగా నిర్ణయించారు. ఆ ముహూర్త వేళలో నక్షత్రాలు, గ్రహాల స్థితి అద్భుతంగా ఉంటుందని దైవజ్ఞులు నిశ్చయించారు. 1910 జనవరి నెల 10వ తేది సాయంత్రంనుంచి 12వ తేది ఉదయం వరకు అంటే 36 గంటల ఏకాంతవాసంలో ఆనీబెసెంట్ శయనమందిరంలో జగద్గురువు మైత్రేయుని ఉపదేశం లెడ్ బీటర్ సారథ్యంలో నిర్వహించారు. ఎవరినీ ఆ చాయలకు

ముందుగా పరమగురువులు మోర్య, కూత్‌హూమిల దర్శనం చేసుకొని, జగద్గురువు మైత్రేయుని ఆశ్రమానికి వెళ్లినట్లు, అక్కడ మైత్రేయుని చుట్టూ అర్ధవలయాకృతిలో మహాపురుషులు, యోగులు నిలుచుని ఉన్నట్లు, పరమగురువులు తనను మైత్రేయుని సాన్నిధ్యానికి నడిపించుకు వెళ్లినట్లు మైత్రేయుడు తనను కొన్ని ప్రశ్నలడిగి, జవాబులు విని సంతృప్తి చెంది తమకూటములోనికి ఆహ్వానించినట్లు, జ్ఞానసముపార్జ నకు కీలకం చెప్పినట్లు, అక్కడ చేరిన పరమగురువులు, మహామహులు ఒక్కొక్కరే శీర్ష స్పర్శ చేసి దీవించినట్లు, బోధన జరుగుతున్నంత సేపు మైత్రేయుని శిరస్సు పైనుండి ఒక నక్షత్రం ధవళ కాంతులు వెదజల్లినట్లు- కృష్ణమూర్తి చెప్పుకొన్నారు.

ఆనీబెసెంట్ వారణాసి నుంచి వచ్చినతరువాత, కృష్ణమూర్తి పట్ల శ్రద్ధా సక్తులు మరింత పెరిగాయి. కృష్ణమూర్తి కన్న ముందుగా జగద్గురు

స్థానానికి ఎన్నుకొన్న హ్యూబర్ట్ వాన్ హూక్ అనే కుర్రాడిని పూర్తిగా విస్మరించారు. కృష్ణమూర్తికి మైత్రేయుడు ఉపదేశం చేయటంలో లెడ్ బీటర్ నిర్వహించిన పాత్రను మెచ్చుకొని ఆపైకార్య నిర్వహణకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. లెడ్ బీటర్‌కు ఎదురు చెప్పేవాళ్లు లేక పోవటంతో గడసరితనం పెరిగింది.

కృష్ణమూర్తిని తండ్రినుంచి పూర్తిగా విడదీయాలని లెడ్ బీటర్ ఆరాటం- కన్నమమకారాన్ని ఒదులుకోలేక నారాయణయ్య పెనుగులాట- వారి మధ్య కలతలు పెరిగాయి. పరిస్థితులను గమనించిన ఆనీబెసెంట్ అందుకు పరిష్కారమార్గం కృష్ణమూర్తిని, నిత్యానందలను చట్టపరంగా దత్తత స్వీకారం చేసుకోవటమేనని నిశ్చయించుకొని పత్రాలు వ్రాయించి వాటిని అమలు పరచటానికి కావలసిన చట్టపరమైన తంతు పూర్తి చేయించారు. వీలయినంతవరకూ కుర్రవాళ్లు తనకు దగ్గరగా ఉండేటట్లు వాళ్ల బసను కూడా తమ బసకు దగ్గరగా ఏర్పాటు చేశారు. లెడ్ బీటర్ బస వాళ్లకు కొంచెం దూరంగా ఉండేది.

లెడ్ బీటర్ శక్తిసామర్థ్యాలతోబాటు వారిని గురించిన కథలు కూడా కొన్ని ప్రచారంలో ఉండేవి. స్వరతి, స్వజాతి సంపర్కాలకు యుక్తవయసు లోని కుర్రకారును ప్రోత్సహించటమే గాక తాము కూడా పాల్గొంటారనే అపప్రథ ఉండేది. నారాయణయ్యకు- లెడ్ బీటర్ సహచర్యంలో ఈ పాడు అలవాట్లు పిల్లలకు ఎక్కడ అబ్బుతాయో- అనే భయం కూడా ఉండేది. ఈ అనుమానాలు, కలతలకు తోడు ఆనీబెసెంట్ నౌకరొకడు కృష్ణమూర్తిని దిగంబరంగాను, లెడ్ బీటర్‌ను అర్ధ నగ్నంగాను స్నానాల గదిలో ఉండటం చూచాడు. ఇంకేముందన్న ప్రచారం ప్రబలింది. శరీరంలోని ప్రతిభాగం పరిశుద్ధంగా ఉండాలని వారికి దిగంబర స్నానం నేర్పుతున్నానని లెడ్ బీటర్ వాదం. ఆనీబెసెంట్ వీలయినంత వరకు కృష్ణమూర్తిని, నిత్యానందను తమ దగ్గరే అట్టే పెట్టుకొనేవారు.

ఆ సంవత్సరంలోనే ఆనీబెసెంట్ తిరిగి వారణాసికి వెళ్లినప్పుడు తమ వెంట కృష్ణమూర్తిని, నిత్యానందను తీసుకువెళ్లారు. వారణాసిలో ఉన్న రోజులలో కృష్ణమూర్తికి శ్రీ జార్జి అరుండేల్‌తో పరిచయమయింది.

వారి మధ్య స్నేహాభిమానాలు కూడా పెరిగాయి. జార్జి అరుండేల్ అక్కడ సెంట్రల్ హిందూ కాలేజిలో 'ప్రిన్సిపాల్'గా ఉండేవారు. కృష్ణమూర్తికి ఆంగ్ల భాష బోధనేకాకుండా ఉచ్చారణ దోషాలు కూడా సవరిస్తుండేవారు.

జార్జి అరుండేల్ ఆమరుచటి సంవత్సరమే కృష్ణమూర్తికి, మైత్రేయుడు ఉపదేశం చేసిన మొదటి వార్షికోత్సవం రోజున వారణాసిలో 'ఉదయభానుని సంస్థ' **(Order of the Rising Sun)**ను ఏర్పాటు చేశారు. కొద్దినెలలలోనే దానిని 'తారక సంస్థగా' **(Order of the Star in the East)** పేరు మార్చారు. కృష్ణమూర్తి పీఠాధిపతిగా ఆనీబెసెంట్, లెడ్ బీటర్, జార్జి అరుండేల్ వంటి ప్రముఖులు కార్యనిర్వాహక సభ్యులుగా ప్రారంభమైన ఈ సంస్థ, కృష్ణమూర్తిని జగద్గురువుగా నిలిపి, ప్రపంచమంతటా శిష్యులను ప్రోగు చేసి, కృష్ణమూర్తి బోధలను ప్రచారం చేయటానికిగాను ఏర్పాటయింది. దివ్యజ్ఞాన సమాజానికి దీటుగా తారకసంస్థ ప్రాచుర్యం వహించటంతో దివ్యజ్ఞాన సమాజంలోని సభ్యుల సంఖ్య తరిగింది. క్రమంగా కోలుకొని తిరిగి తారక సంస్థను కృష్ణమూర్తి రద్దు చేయటంతో దివ్యజ్ఞాన సమాజం పుంజుకొంది.

కృష్ణమూర్తి, నిత్యానందలు దూర ప్రయాణాలను వారణాసితో ప్రారంభించి బ్రహ్మదేశం (బర్మా), ఆపైన ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా వంటి దేశాలను సందర్శించారు. దివ్యజ్ఞాన సమాజంలోని ప్రముఖులనే గాక, ఆయాదేశాలలోని వివిధ రంగాలకు చెందిన ప్రముఖులను కూడా కలుసుకొన్నారు. ఆనీబెసెంట్ ఉపన్యసించిన వేదిక నుంచే కృష్ణమూర్తి కూడా ఉపన్యసించేవారు. మొదట్లో కొంత ఇబ్బందిగా ఉన్నా క్రమంగా నిలదొక్కుకొని చక్కగా ఉపన్యసించగల ప్రజ్ఞను పొందారు. ఆ సంవత్సరాంతాన వారణాసిలో దివ్యజ్ఞానసమాజ సమావేశం జరిపారు. కార్యక్రమాలలో భాగంగా తారక సంస్థ సభ్యులు ఒక్కొక్కరుగా వేదిక పైకివచ్చి కృష్ణమూర్తికి ప్రణమిల్లి ఆమోద పత్రాలను స్వీకరించారు. ఆ సమయంలో కృష్ణమూర్తినుంచి దివ్యతేజస్సు వెలువడి సభాప్రాంగణమంతా వ్యాపించిందని అది జగద్గురువు మైత్రేయుని ప్రభావమేనని చెప్పుకొన్నారు.

నారాయణయ్యకు పుత్రుల ఎడబాటు దుర్భరంగా తోచింది. కృష్ణమూర్తి, నిత్యానందలు సుఖంగా ఉన్నప్పటికి వాళ్లు తనతో లేని లోపం కొట్టవచ్చినట్లు కనిపించింది. పైగా అయినవాళ్ల మాటలు సహించటం కష్టంగా తోచాయి. తన పిల్లలను తనకు తిరిగి ఒప్పగించమని ఆనీబెసెంట్‌ను వేడుకొన్నారు. ఉపయోగం లేక పోయింది. మిత్రులు, శ్రేయోభిలాషుల ప్రోద్బలంతో న్యాయస్థానానికి వెళ్లారు. కొన్ని సంవత్సరాలు నారాయణయ్యకు ఆనీబెసెంటుకు మధ్య వ్యవహారాలు నడచాయి. 'హిందూ' వంటి పత్రికలు నారాయణయ్యను సమర్థించుతూ వార్తలను ప్రముఖంగా ప్రచురించాయి. కొన్ని మత సంస్థలు దివ్యజ్ఞాన సమాజం-అందునా ఆనీబెసెంటుపై ద్వేషం కొద్ది నారాయణయ్యను ప్రోత్సహించినట్లు తెలుస్తున్నది. మదరాసు ఉన్నత న్యాయస్థానం వారు నారాయణయ్యకు అనుకూలంగా తీర్పు ఇచ్చారు. ఏది ఏమైనా పిల్లలను ఒదలనని ఆనీబెసెంట్ లండన్ నగరంలోని న్యాయ నిర్ణయ సభ (Privy Council)కు వ్యవహారాన్ని విన్నవించుకొన్నారు. ఈ వ్యాజ్యాలు 1914 మే నెల 5వ తేది వరకు సాగాయి. ఆనీబెసెంటుకు అనుకూలంగా తీర్పు వచ్చింది. అప్పటికే కుర్రవాళ్లు పెద్దవాళ్లు (మేజర్లు) అయ్యారు. వాళ్లు కూడా ఆనీబెసెంట్‌తోనే ఉండేటట్లు వాగ్మూలం ఇచ్చారు. ఆ తగవులకు అంతటితో తెరపడింది.

వ్యాజ్యాలు నడుస్తున్న కాలంలో పిల్లలను భారతదేశంలోనే ఉంచితే తండ్రి సోదరుల వ్యామోహంలో పడిపోతారని, ఆనీబెసెంట్ కృష్ణమూర్తిని, నిత్యానందను చదువులమిషతో ఇంగ్లాండుకు పంపారు. ఆక్స్ఫర్డు పాఠశాలలు దేవదూతలకు, జగద్గురువులకు చదువు చెప్పలేవని వీరి దరకాస్తులను తిరస్కరించాయి. పాఠశాలల లోగాక ఇంటివద్దనే చదువుకొనే ఏర్పాట్లు చేశారు. మొదటినుంచి కృష్ణమూర్తికి చదువు మీద ధ్యాస తక్కువ. ప్రవేశ పరీక్షలలోనే నెగ్గలేక పోయారు. నిత్యానంద మాత్రం అతికష్టం మీద కృతార్థులైనారు. న్యాయశాస్త్ర కళాశాలలో చేరారు. కృష్ణమూర్తి మాత్రం చదువు జోలికి పోకుండా యంత్రాలనో, మోటారు వాహనాలనో విప్పుతూ తిరిగి వాటిని అమరుస్తూ కాలయాపన చేస్తుండేవారు. ఆరోజులలో కృష్ణమూర్తికి మోటారు వాహనాలను వేగంగా నడపటం ఒక సరదాగా ఉండేది. ప్రకృతి పరిశీలన, అదీకాకుంటే పుస్తక పఠనంతో

కాలంగడుపుతుండేవారు. కీట్సు, షెల్లీ కావ్యాలు, షేక్స్పియర్ నాటకాలు, పవిత్ర గ్రంథం- పాత నిబంధనలు **(Bible-Old Testament)** లోని కొన్ని భాగాలు, పి.జి.వుడ్ హౌస్, స్టీఫెన్ లీకాక్ ప్రహసనాలు ఎక్కువగా చదివేవారు.

ఇంగ్లాండులో ఉన్నప్పుడే కృష్ణమూర్తికి గొప్ప ఇంటి వాళ్ళ పరిచయాలు లభించాయి. కాని ఏకాంతాన్ని ఎక్కువగా కోరుకునేవారు. లండన్‌లో చదువు ఎలాగూ అబ్బటం లేదు గనుక పారిస్‌కు పంపితే ఫ్రెంచి భాషన్నా అలవడుతుందేమోనని ఆనీబెసెంట్ కృష్ణమూర్తిని పారిస్ నగరానికి పంపే ఏర్పాటు చేశారు. ఎలాగైనా వాళ్లను భారతదేశానికి, ముఖ్యంగా తండ్రికి దూరంగా ఉంచటమే ఆమె ఉద్దేశం.

కృష్ణమూర్తి చదువుకోసం ఇంగ్లాండు వచ్చినప్పటినుంచి మనసులో మథన ప్రారంభమైనట్లు తోస్తున్నది. ఒక విధమైన వైమనస్యం వ్యక్తపరచే వారు. తననే ఎందుకు జగద్గురు స్థానానాకి ఎంచుకోవాలి? క్రమశిక్షణ కట్టుబాట్లు తనపై ఎందుకు విధించాలి? తన వ్యక్తి వికాసానికి మరొకరు రూపుదిద్దటమేమిటి? తనపై ఎందుకీ ఆంక్షలు, వత్తిడులు? తనకెందుకీ ఆడంబరాలు? ఏమిటీ పంజరపు బ్రతుకు?- వంటి ప్రశ్నలు తలెత్తేవి. ఒక్కొక్కసారి ఉపన్యాసాలలో ప్రవక్తలా ఉపదేశాలు, అభయాలు గాక- మీకు మీరుగా బాధ్యత వహించాలి; మరొకరు మీ భవిష్యత్తును నిర్దేశించుతారను కోవటం భ్రమ అంటూ మాట్లాడేవారు. ఆ సందర్భాలలో ఆనీబెసెంట్ కలవర పడేవారు. కొందరు కృష్ణమూర్తిని ఏదో దుష్టశక్తి ఆవహించిందను కొనేవారు. తన భావాలను వివరించ బూనినా, వాటిని శ్రేయోభిలాషులు పట్టించుకొనే వారు కారు. కృష్ణమూర్తిలో వారు జగద్గురువునే చూడదలచారు.

లెడ్ బీటర్ కృష్ణమూర్తిలో వస్తున్న మార్పును కనిపెట్టి జగద్గురు స్థానానికి మరికొందరు అభ్యర్థులను వెతకటం ప్రారంభించారు. శ్రీమాన్ వి.కె. దేశికాచార్య కుమారుడు డి. రాజగోపాలాచార్య అనే కుర్రాడిలో ప్రత్యేక లక్షణాలను చూచి, ఇతడే జగద్గురువు స్థానానికి యోగ్యుడని, చేరదీసి శిక్షణ నివ్వటం ప్రారంభించారు. తరువాత చదువులకని

ఇంగ్లాండుకు పంపారు. ఇంగ్లాండులో రాజగోపాల్ కృష్ణమూర్తిని కలుసుకొన్నారు. వారు ఎంతో ఆప్యాయంగా, సోదరుల్లా మెలిగారు. క్రమంగా రాజగోపాల్ కృష్ణమూర్తికి బాగా చేరువయ్యారు- ఆ సోదరులతో బాటు తానూ ఒకడుగా కలసిపోయారు. రాజగోపాల్ కృష్ణమూర్తి జీవితంలో ప్రముఖ పాత్ర వహించారు. నిత్యానంద మరణానంతరం, కృష్ణమూర్తి రాజగోపాల్‌లో తమ తమ్ముని చూచుకొనేవారు. నిత్యానంద మరణానంతరం- నిత్యానంద ప్రేమించి వివాహం చేసుకుందామనుకున్న కుమారి రోసలెండ్ పై రాజగోపాల్ మనసు పెట్టుకొన్న విషయం తెలిసి, వారిద్దరికీ వివాహం జరిపించటమే గాక, వాళ్ల పోషణ భారం కూడా తామే వహించారు.

జగద్గురు స్థానాన్ని ఆశించిన వారిలో జార్జి అరుండేల్, శ్రీమతి రుక్మిణి అరుండేల్, [శ్రీ జార్జి అరుండేల్‌ను వివాహం చేసుకోటానికి పూర్వం ఆమెను జగజ్జననిగా పరిచయం చేయ బూనారు] శ్రీ జినరాజదాస వంటి ప్రముఖుల పేర్లు వినబడుతున్నాయి. వీరేగాక, ఇంకెందరో ఆనీబెసెంట్‌పై వత్తిడి తెచ్చినట్లు తెలుస్తున్నది. కృష్ణమూర్తిని నిర్ణయించటానికి ముందు, ఆతరువాత గూడా తమ పిల్లల యోగ్యతలను, ప్రత్యేకతలను తెలుపుతూ దేశంనలుమూలల నుంచి ఎన్నో అభ్యర్థనలను ఆనీబెసెంట్‌కు పంపు కొన్నారు. ఉత్తర ప్రదేశ్‌లో మంచి పలుకుబడి కలిగి ఆనీబెసెంట్‌కు సన్నిహితంగా మెలగిన ఒకరు తమ కుమారుని స్వీకరించవలసిందిగా వృధాప్రయాస పడ్డారు. ఆంధ్ర దేశం నుంచి ఒకటి రెండు పేర్లు కూడా వినవచ్చాయి.

నిత్యానందకు లండన్‌లో చదువుకొనే రోజులలోనే క్షయవ్యాధి లక్షణాలు సోకాయి. వైద్యానికి నిత్యానందను కూడా పారిస్‌కు పంపారు. అంతటితో నిత్యానంద చదువు కూడా నిలచి పోయింది. వ్యాధి తగ్గినా పూర్తిగా తొలగి పోలేదు. అది నిత్యానందను చాలా కాలం బాధించి కడకు ప్రాణాలనే బలిగొన్నది.

పారిస్ వెళ్లిన కృష్ణమూర్తి కొన్నాళ్లు అక్కడనే ఉండి ఫ్రెంచి భాషను అభ్యసించారు. ఆతరువాత వివిధ ప్రాంతాలలో దివ్యజ్ఞాన సమాజ సమావేశాలలోను, తారక సంస్థ సమావేశాలలోను పాల్గొంటూ ఉపన్యాసాలు

ఇస్తూ అందరినీ ఆకర్షించేవారు. నిత్యానంద ఆరోగ్యం బాగా దెబ్బతిన టంతో విశ్రాంతి కోసం అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఒకటైన కాలిఫోర్ని యాలోని శాన్‌ఫ్రాన్సిస్కో నగరానికి 360 మైళ్ల దూరాన ఉన్న 'ఓహై' చేరుకొన్నారు. ఓహై సముద్ర మట్టానికి 1500 అడుగుల ఎత్తున ఉన్న పర్వత ప్రాంతం. చాలా ఆరోగ్యకరమైన ప్రదేశం. ప్రశాంత వాతావరణం. పరిసరాలు వివిధ ఫలవృక్షాలతో ప్రకృతి లావణ్యంతో పులకరిస్తుంటాయి.

కృష్ణమూర్తి నిత్యానందలు ఉండటానికి ఒక కుటీరం ఏర్పాటయింది. అమెరికా దివ్యజ్ఞాన సమాజం ప్రధాన కార్యదర్శి, శ్రీ ఏ.పి. వారింగ్టన్ వాళ్లకూడా వెళ్లారు. వారందరికీ సాయంగా కుమారి రోసలెండ్ విలియమ్స్ అనే అమెరికా అమ్మాయి కూడా వెళ్లారు. కుటీరానికి 'ఆర్యవిహార' అనిపేరు పెట్టారు. ఈ ఆర్యవిహార, దానిని చుట్టుకొని ఉన్న ప్రాంతాన్ని ఆతరువాత కొందరు ఉదారుల విరాళాలతో 1926 నవంబరు నెలలో ఆనీబెసెంట్ కృష్ణమూర్తి నిత్యానందలకు గాను క్రయం చేశారు. అదే కృష్ణమూర్తికి ఆతరువాత కాలంలో ప్రధాన స్థావరమయింది.

ఓహై చేరిన కొద్ది రోజులకు కృష్ణమూర్తి విచిత్రమైన అనుభూతిని పొందారు.

మెడవెనుక భాగంలో ఒక కణితి లేచింది. క్రమంగా బాధ ఎక్కువయింది.

ఆమరురోజు ఉదయానికి మూలుగులు- ప్రక్కలో దొర్లటం- ఎవరో ఆవేశించినట్లు వణుకు- జలదరింపులు- ఇలా ఎంతో బాధను అనుభవించారు. కుమారి రోసలెండ్ ఉపశమనానికి దగ్గరకు వెళ్ళి పట్టుకుంటే కొంత సేపు ఊరట చెంది, ఆ వెంటనే ఒళ్లుకాలి పోతున్నదంటూ ఆమెను దూరంగా గెంటివేశేవారు. ఆహారం ముట్టలేదు. ఒక రోజంతా అలాగే గడచింది.

మరురోజు శనివారం కూడా అదే పరిస్థితి. కనిపించని వ్యక్తులెవరితోనో ధారగా మాట్లాడటం- శరీరం కంపించిపోవటం- ఏవో కొద్దిక్షణాలు మాత్రం స్మారకంలోకి రావటం- ఏకొద్ది శబ్దాన్నయినా సహించలేకపోవటం- రోజంతా అలాసాగింది.

ఆరోజు ఆదివారం, ఆగస్టు 20, 1922.

బాధలు పరాకాష్టకు చేరుకొన్నాయి.

సాయం సమయం- చీకటి పడింది.

కృష్ణమూర్తి తప్ప అందరూ భోజనాలు ముగించుకొన్నారు.

కృష్ణమూర్తిని ఏదో శక్తి ఆవహించినట్లయింది. పెద్దగా ఏడవటం మొదలు పెట్టారు. ఎవరినీ దగ్గరకు రానీయ లేదు. తామున్నగదిని విడచి అందరినీ బయటకు వెళ్లమన్నారు. వాళ్లంతా వసారాలోకి చేరుకు న్నారు. కొద్దిసేపటికి కృష్ణమూర్తి కూడా బయటకు వచ్చారు. కొంచెం ఎత్తయిన మెత్తని ఆసనంపై కూర్చున్నారు. అర్థం కాని గొణుగుడు మొదలెట్టారు. వారింగ్టన్ సలహా మేరకు ఇంటి ముందున్న మిరియపు చెట్టు ఛాయకు వెళ్లికూర్చున్నారు. ఏదో మంత్రోచ్చారణ. చూస్తున్న వాళ్ల మనస్సులలో బోధివృక్షచ్ఛాయలో కూర్చున్న గౌతమబుద్ధుడు మెదలాడు.

అంతలో-

ఎవరో ఆవేశించినట్లు, ఏదో మహత్తరశక్తి ప్రవేశించినట్లు తోచింది. చూస్తున్న వాళ్ళకు మైత్రేయుడే కృష్ణమూర్తిని ఆవహించినట్లు తోచింది.

నిత్యానంద సాగిల పడ్డారు.

కుమారి రోసలెండ్ అరగంట తరువాత మూర్ఛపోయింది.

అలా కృష్ణమూర్తి ఆరోజు రాత్రి ఆమరురోజు కూడా సమాధిలో ఉండిపోయారు.

ఎవరో ముగ్గురు మూర్తులు కృష్ణమూర్తి భౌతికదేహాన్ని చెట్టుక్రిందనే వదలి, ఆత్మను మాత్రం పైకిలేవనెత్తుకు వెళ్లినట్లు తోచింది.

కృష్ణమూర్తి వ్రాసుకొన్న అనుభవం కూడా ఆవిషయాలను ధృవపరు స్తున్నాయి-

తూరుపు దిక్కుగా మిరియపు చెట్టు లేతఆకుల నీడన కూర్చుని ఉండగా- ఎదురుగా తన శరీరం కనిపించింది- శిరస్సు పైన ఒక నక్షత్రం స్పష్టంగా వెలుగొందుతున్నది. బుద్ధ భగవానుని కదలికతో బాటు, జగద్గురువు మైత్రేయుడు, పరమగురువు కూత్‌హూమిల దర్శన మయింది- ఎంతో ఆనందం, ప్రశాంతి, నిశ్చలత వంటి అనుభూతులు కలిగాయి- అంటూ ఆనందాన్ని, అతిలోక సౌందర్యాన్ని ఆస్వాదించినట్లు, తాము భగవానుని వశమైనట్లు- చెప్పుకొన్నారు. అంతే గాక- తామెవరో తెలుసుకున్నట్లు ఇతరులకు గూడా ఆత్మ సాక్షాత్కారానికి సాయపడటానికి సంసిద్ధులైనట్లు కూడా చెప్పుకున్నారు.

లెడ్ బీటరు ఆ అనుభవాలకు అంత ప్రాముఖ్యం ఇచ్చినట్లు కనబడదు. 'అర్హత' ఇంకా సిద్ధించలేదనే అభిప్రాయం చాలాకాలం వరకు వెలిబుచ్చుతుండేవారు.

ఇటువంటి అనుభవాలు వారిని మరికొంత కాలం అంటిపెట్టుకొన్నాయి.

అది 1924 ఫిబ్రవరి నెల.

ఈసారి శక్తి వెన్నెముక నుండి మెడవెనుక భాగంవరకూ చేరుకొన్నది. అక్కడ రెండుగా చీలి ఒకటి కుడివైపుకు, మరొకటి ఎడమవైపుకు పయనించి భ్రూమధ్యంలో సంయోగం చెంది ప్రకాశించినట్లు, ఆ వెలుగులో మైత్రేయుడు, పరమగురువు కూత్‌హూమిలు సాక్షాత్కరించినట్లు చెప్పుకొన్నారు.

యోగశాస్త్రం ప్రకారం ఇది కుండలిని శక్తి- షట్చక్రాలలోని ఆజ్ఞాచక్రం చేరుకోవటం. తద్వారా ఆత్మసాక్షాత్కారం (స్వస్వరూపజ్ఞానం), మానసిక శక్తుల విజృంభణ వంటి శక్తులు సిద్ధిస్తాయి. ఆ అనుభవం తరువాత కృష్ణమూర్తి చేసిన ప్రసంగాలు ఈ విశేషాంశాలను ధృవపరచాయి. అంతేగాక అటువంటి అనుభవాలు ఆతరువాత కాలంలో గూడా అప్పుడప్పుడు పొందారు.

తారక సంస్థ అధినేతగా 1920 ప్రాంతాలనుంచి కృష్ణమూర్తికి స్థిరచరాస్తులు సమకూరాయి. బారన్ ఫిలిప్ వాన్ పల్లన్డ్ హోలెండులోని

''ఒమ్మన్'' వద్దనున్న 'ఈర్డి' ప్రాసాదంతో బాటు చుట్టుతా ఉన్న 5000 ఎకరాల భూమిని బహూకరించారు. అదే ఆతరువాత కాలంలో కృష్ణమూర్తికి ప్రధాన కార్యాలయమయింది. అమెరికా లోని ఒక ఉదారురాలు 'ఓహై'లోని కుటీరంతో బాటు, 13 ఎకరాల తోట కొనిపెట్టారు. 1925 ప్రాంతాలలో జన్మస్థలమైన మదనపల్లి సమీపంలో ఒక విశ్వవిద్యాలయాన్ని ఏర్పరచాలనే ఉద్దేశంతో మిత్రులు, ఉదారుల సాయంతో 300 ఎకరాల స్థలం కొన్నారు. అక్కడే ఋషీ వాలి పాఠశాలను నెలకొల్పారు.

ఇవిగాక ప్రపంచంలో ఏమూలాలకు వెళ్లాల్సినా ఉన్నత తరగతిలో ప్రయాణించటానికి, విడిది చేయటానికి కావలసినన్ని సదుపాయాలు- ఆనీబెసెంట్, అమెరికా ఉదారురాలు ఏర్పరచిన రాబడి సొమ్ము- కాక ఎందరో ఉదారుల విరాళాలు- అన్నీకలసి కృష్ణమూర్తిని ఎంతో ఐశ్వర్యవంతుడిని చేసాయి. తారక సంస్థను రద్దుచేసి దాతలకు వారిచ్చిన దానాలను తిరిగి ఇచ్చివేసినప్పుడు చాలామందికి ఆ నిర్ణయం నమ్మశక్యం కాలేదు. కొందరు బాధ పడ్డారు.

కృష్ణమూర్తికి వ్యక్తిగతంగాను తారక సంస్థపై చేసుకొన్న నిర్ణయాలకు, ఆశయాలకు, గురువులపై కుదుర్చుకున్న నమ్మకాలకు- సోదరుడు నిత్యానంద మరణంతో విఘాతం కలిగింది.

ఆనీబెసెంట్- కృష్ణమూర్తిని వెంట బెట్టుకొని, మరికొందరు ప్రముఖ దివ్యజ్ఞాన సమాజ సభ్యులతో ఇంగ్లాండు నుండి మదరాసుకు ఓడలో ప్రయాణిస్తున్నారు. నిత్యానంద ఓహై లోనే ఉండి పోయారు. క్షయవ్యాధి బాగా ముదరటంతో ప్రయాణం చేసే పరిస్థితులలో లేరు. ఆనీబెసెంట్, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు కృష్ణమూర్తిని ఎలాగైనా ఒప్పించి, జగద్గురువుగా ప్రకటించాలనే సంకల్పంతో ఉన్నారు. కృష్ణమూర్తికి ఆ తతంగాలేమీ నచ్చలేదు. కృష్ణమూర్తిని జగద్గురువుగాను, మరి పన్నెండు మంది ప్రముఖులను ముఖ్య శిష్యులుగాను ప్రకటించి తారక సంస్థను పటిష్టం చేయాలనేది వారి సంకల్పం. ఆ పదిరెండుమంది పట్టికలో ఆనీబెసెంట్, లెడ్ బీటర్, జినరాజదాస, జార్జి అరుండేల్, రుక్మిణి అరుండేల్ వంటి ప్రముఖులను చేర్చారు. ఈ ప్రతిపాదనను ప్రయాణానికి ముందుగానే

ఒమ్మన్ సమావేశంలో లేవనెత్తారు. కృష్ణమూర్తి- ఆనీబెసెంట్ ఒక్కరి సభ్యత్వానికి మాత్రం అంగీకారం తెలుపుతాననటంతో మిగిలిన ప్రముఖులకు ఆశాభంగ మయింది.

నిత్యానందతోడు లేకుండా కృష్ణమూర్తి భారత దేశానికి ప్రయాణం చేయటానికి ఇచ్చగించ లేదు. సోదరుని కాచుకొని ఓహై లోనే ఉండాలనుకొన్నారు. జార్జి అరుండేల్- పరమ గురువులు సందేశం పంపినట్లు, నిత్యానంద ఆరోగ్యం విషయంలో ఏమాత్రం అనుమానించ వద్దనీ, ఆ విషయం తాము చూచుకొంటామని సందేశంలో తెలిపినట్లుగా- చెప్పారు. కృష్ణమూర్తి అయిష్టంగానే ప్రయాణమయ్యారు.

ప్రయాణ మధ్యంలో- **1925** నవంబరు **14**న - ఉదయం కొద్ది గంటలకు ముందు ఓహైలో నిత్యానంద మరణించినట్లుగా తంతి ద్వారా వచ్చిన వర్తమానాన్ని ఆనీబెసెంట్ కృష్ణమూర్తికి అందించారు.

ఆ దుర్వార్త కృష్ణమూర్తిని ఒక్క సారిగా కుదిపింది. మనసు చిందర వందర అయింది. అప్పటివరకూ ఏర్పరచుకొన్న జీవిత వేదాంతం కూడా ఛిన్నాభిన్నమయింది.

ఆక్రితంరోజు నిత్యానంద- తంతి ద్వారా ఆరోగ్యం విషమించినట్లు తెలిపారు. బయలుదేరబోయే ముందు ప్రయాణానికి పరమగురువుల అనుమతి, తమ్ముని ఆరోగ్యానికి భరోసా లభించటం వల్ల ఏ ఉపద్రవమూ రాదనే ధీమాతో ఉన్నారు. కాని జరిగింది మరొకటి.

రాత్రిం బవళ్లూ ఏకధారగా ఏడ్చారు.

ఆ విషాదంనుంచి కోలుకోవటానికి పది రోజులు పట్టింది.

ఆ తరువాత-

తాము, తమసోదరుడు నిత్యానంద కలసి కన్నకలలు చెరిగిపోయాయని, భౌతికంగా విడిపోయినా ఎప్పటికీ ఒకటిగానే ఉంటామనీ చెప్పుకొన్నారు. ప్రస్తుతం నిత్యానంద తనలోనే ఉండటం వల్ల- ఉత్సాహం, విశ్వాసం, ప్రేమ వృద్ధి చెందాయని కూడా చెప్పుకొన్నారు.

భారత దేశం చేరుకొన్నాక- దివ్యజ్ఞాన సమాజం అడయారులో ఏర్పాటు చేసిన- మైత్రేయుడు కృష్ణమూర్తికి ఉపదేశం చేసిన 14వ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తూ- ప్రథమ పురుషలో సాగుతున్న ప్రసంగాన్ని ఉత్తమ పురుషలోనికి మార్చారు-

-ఎవరుకోరుకుంటారో, ఎవరు నిరీక్షిస్తుంటారో, వారికోసమే వారు వస్తారు- అన్నమాటలోనుంచి- ఎవరికి సానుభూతి కావాలో, ఎవరికి సుఖశాంతులు కావాలో, ఎవరు విముక్తికై ఎదురు చూస్తుంటారో, సుఖశాంతులు ఎల్లెడలా వెల్లి విరియాలని ఎవరైతే తపనపడుతుంటారో- వారికోసం, నేనున్నాను- అంటూ ప్రసంగించారు.

ఆనీబెసెంట్ కృష్ణమూర్తిలో మైత్రేయుడు ప్రవేశించినట్లు ప్రకటించారు.

ఆ మరుచటి సంవత్సరం హాలెండులోని ఈర్డి సమావేశంలో గూడా అటువంటి ప్రసంగమే చేశారు. కాకుంటే ప్రవచనాల్లా గాక ప్రసంగం కవితలా సాగింది. మనసు, మేధ-వంటి విషయాలను ప్రస్తావించారు, ఆ తరువాత ప్రసంగాలలో కూడా వైవిధ్యం కనిపించింది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, విముక్తి, మార్పుల అవసరాన్ని నొక్కి వక్కాణించారు.

దివ్యజ్ఞాన సమాజం వారు, తారక సంస్థవారు కృష్ణమూర్తి ప్రసంగాలలోని వైవిధ్యానికి కలవర పడ్డారు. ఆనీబెసెంట్‌కు పరిస్థితి అయోమయమయింది. అప్పటికే ఆమె ఆరోగ్యం క్షీణించింది.

1929 సంవత్సరం, ఆగస్టు నెల, 3వ రోజు-

ఆనాడు కృష్ణమూర్తి- ఆనీబెసెంట్, మరి మూడువేల మంది తారక సంస్థ సభ్యుల సమక్షాన తారక సంస్థను రద్దుపరుస్తూ చేసిన ప్రసంగం అత్యంత ప్రముఖమైనది.

-సత్యానికి మార్గాలు లేవు. ఏమతం ద్వారాగాని, ఏ శాఖ ద్వారాగాని, సత్యాన్ని చేరలేం- అంటూ-

- ఎవరికి వారే జ్ఞానాభివృద్ధికి, ఆత్మోన్నతికి, పవిత్ర జీవనానికి, కల్మష రహిత ఆత్మ వికాసానికి ప్రయత్నించమని చెప్పినా, ఏ కొద్దిమంది మాత్రమో తప్పించి ఎవరూ ఎట్టి ప్రయత్నమూ చేయనప్పుడు- అందుకుగా నొక సంస్థ అవసరం లేదన్నారు.

-శతాబ్దాలుగా బిరుదులు, పదాడంబరాలకు అలవాటు పడి, తమకూ కొన్ని తగిలించ చూస్తున్నారే గాని, అవి భ్రమలని తెలుసుకోలేక పోతున్నారు.

-అన్ని నమ్మకాలనుంచి విశ్వాసాలనుంచి విముక్తి పొందటమే నిజమైన స్వేచ్ఛను పొందేందుకు కావలసిన ప్రాథమికావసరం-

-అంటూ ఉద్బోధించారు. జీవితాంతం అదేమాటపై నిలచారు.

రెండు దశాబ్దాలుగా తమ చుట్టూ నిర్మించిన ఉద్యమాన్ని, సంస్థను రద్దు చేశారు. అందుకు ఎంతో ధైర్యం, నిబ్బరం, ధృఢనిశ్చయం కావాలి. వాటిని సంతరించుకోగలిగారు.

ఆనీబెసెంట్, మరి ఇతర ప్రముఖులు, సభ్యులు నిరుత్తరులయ్యారు.

సంస్థకు చెందిన ఆస్తిపాస్తులను దాతలకు తిరిగి ఇచ్చివేశారు.

ఆనీబెసెంట్ అనారోగ్యంతో 1933 సెప్టెంబరు 20న అడయారులో దివంగతులయ్యారు. లెడ్ బీటర్ ఆమె మరణశయ్య ప్రక్కనే ఉన్నారు.

లెడ్ బీటర్ కూడా మరొక ఆరు నెలలలోపునే 1934 మార్చి 1న పెర్త్ పట్టణంలో దివంగతులైనారు. లెడ్ బీటర్ అడయారును 1914లోనే వదలి ఆస్ట్రేలియాలోని సిడ్నీలో దివ్యజ్ఞాన సమాజ నిర్వహణ కార్యక్రమాలు చూస్తూ స్థానికంగా ఉన్న ఒక క్రీస్తు దేవాలయంలో మతాచార్యుడుగా ఉన్నారు. లెడ్ బీటర్ మరణ వార్తవిని సిడ్నీలో ఉపన్యాసాలిస్తున్న కృష్ణమూర్తి పెర్త్ నుంచి సిడ్నీకి తీసుకువచ్చిన లెడ్ బీటర్ మృత దేహానికి జరిపిన అంత్యక్రియలలో పాల్గొన్నారు.

కృష్ణమూర్తి తనను వినగోరే వారిని ఉద్దేశించుతూ ఒమ్మెన్, ఓహై, భారతదేశం, ఇంకా పలుప్రాంతాలలో ప్రసంగించారు. ప్రపంచం నలుమూలల

నుంచి వచ్చిన ఆహ్వానాలను అందుకొని వివిధ దేశాలలో, వివిధ జాతుల ప్రజలను ఉద్దేశించి- సంపూర్ణ స్వేచ్ఛ, ఆనందానుభూతి, విశ్వప్రేమ వంటి విషయాలపై ప్రసంగించారు.

తమ చుట్టూ నిర్మాణమైన గూటిని ఛేదించుకొని విశాల జగత్తులో తామూ ఒకడుగా, తానే ప్రపంచంగా నిలచారు.

అంతర్గతంగా సాగుతుండిన మథన నుంచి, బంగారు సంకెళ్లనుంచి విముక్తి చెందారు.

అప్పటివరకూ మొగ్గగా ఉండిన కృష్ణమూర్తి జీవితం- వికాసం చెందింది.

# విక్రమణం

కృష్ణమూర్తి నిరంతర సత్యాన్వేషి, పంచారపు బ్రతుకునుంచి విముక్తులైన తరువాత సత్యాన్వేషణ మరింత తీవ్రమయింది.

కృష్ణమూర్తి తాముగా తెలుసుకొని, బోధించిన జీవిత తత్త్వం- ఆత్మ త్యాగం.

జీవుడు జీవితంతో ఐక్యం పొందటం ద్వారా 'వ్యక్తి' భావన నశించుతుంది.

కట్టుబాట్లు, నియమ నిబంధనలు, విశ్వాసాలు- మానవుని కుదించి వేశాయి. వాటినుంచి విముక్తుడైన క్షణం మానవుడు మహోన్నతుడవుతాడు. అందుకు ముందుగా తనను తాను తెలుసుకోవాలి. అలాగే ఇతరులతోటి సంబంధాన్ని కూడా అవగతం చేసుకోవాలి.

'నేను' అన్న భావన నశించినప్పుడు యథార్థం గోచరమవుతుంది.

ప్రేమ ఒక్కటే శాశ్వతం- అదే మానవ సమాజాన్ని ఒక్కటిగా సంఘటిత పరుస్తుంది.

మానవ జీవిత స్థితిగతులను, జీవన సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించి, తెలుసుకొన్న విషయాలను ప్రపంచానికి ఎఱుకపరచారు. అందులో బలవంతం లేదు. మనసులో గ్రహించి వివేచన చేసినప్పుడు సత్యం విదిత మవుతుంది.

జగద్రక్షకుడుగా తమను ప్రపంచానికి ఎఱుక పరచటానికి నిర్వహించిన తతంగం, దివ్యజ్ఞాన సమాజం పెద్దల తాపత్రయం- కృష్ణమూర్తికి తీవ్ర మనస్తాపం కలిగించినట్లు విశదమవుతున్నది. అదుపు, ఆజ్ఞ, ఆరడులతో విసిగి స్వేచ్ఛకోసం పరితపించారు. గురు శిష్య వ్యవస్థను కాదని తారక సంస్థను రద్దుపరచిన మరుక్షణం నుంచి ఆ స్వేచ్ఛలోని ఆనందాన్ని పొందగలిగారు.

కృష్ణమూర్తి సత్యాన్వేషణ స్వస్వరూప జ్ఞానంతో ఆరంభమై, విశ్వంభరా వ్యాపితమయింది. అప్రయోజకుడని అయినవారి అనాదరణ, చదువురాని మొద్దని చదువు చెప్పిన విద్యాగురువుల నిరాదరణ, ఎంతోకాలం అంటిపెట్టుకొని వేధిస్తుండిన అనారోగ్యం, ఆపైన- శిక్షణ పేరున అత్యాచారాలు, కృష్ణమూర్తిగా కాక జగద్గురు పీఠాన్ని అధిష్ఠించే అవతార పురుషుడుగా రూపుదిద్దుకోటానికి మాత్రమే వ్యక్తిత్వాన్ని పెంచుకోటానికి వచ్చిన వత్తిడులు- అన్నీ సహించారు. ఎట్టి పరిస్థితులలోనూ పరుషంగా మాట్లాడలేదు.

ఆనీబెసెంట్ మరణానంతరం కూడా కొంతకాలంపాటు దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలోనే విడిది చేస్తుండేవారు. ఆయా సందర్భాలలో ఎలాగైనా వారిని ఒప్పించే, నొప్పించో జగద్గురువుగా ప్రతిష్ఠించాలని సమాజ పెద్దలు ప్రయత్నించారు. కడకు విసిగి ప్రాంగణం విడచి వెళ్లమని ఆదేశించారు. పెట్టె బేడా బయటకు విసరివేశారు. అయినాసరే వాళ్ల వత్తిళ్లకు లొంగక ఏవిధమైన ప్రతిఘటనకాని, పరుషవాక్ ప్రయోగంకాని చేయక- నిర్వికారంగా ప్రాంగణం విడచి వెళ్లారు. అప్పుడు దురుసుగా ప్రవర్తించిన 'వ్యక్తి' అవసాన దశలో ఉండగా వారి అనుమతితోనే వారింటికి వెళ్లి, వారి యోగక్షేమాలు విచారించారు.

కృష్ణమూర్తికి వెనుకటి సంఘటనలు- ముఖ్యంగా చిన్ననాటి సంఘటనలు గుర్తుండేవి కావు. అలాగే ఆ రోజులలో చదివిన గ్రంథ

విశేషాలు కూడా మరచిపోయారంటారు. ఆ కారణంగా మేరీ లూట్యెన్స్ కృష్ణమూర్తి జీవిత చరిత్రను వ్రాయటంలో ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చినట్లుగా వ్రాసుకొన్నారు. వారి కుటుంబ సభ్యులు, సన్నిహితులు, జాబులు, పాత పత్రికల ద్వారా మేరీ లూట్యెన్స్ ఎన్నో విశేషాలను సేకరించ గలిగినట్లు కూడా చెప్పుకొన్నారు. ఆ తరువాత ఆ విశేషాలను కృష్ణమూర్తితో ప్రస్తావించినప్పుడు వారా విషయాలను అంతగా పట్టించుకోలేదని కూడా చెప్పుకొన్నారు.

కృష్ణమూర్తికి గ్రంథపఠనాసక్తి తక్కువ. చదివిన విషయాలు కూడా స్మృతిపథం నుంచి తొలగిపోయాయి. అయితే ఎన్నో సంస్కృత శ్లోకాలు కంఠతావచ్చు. స్తోత్రాలు- అందునా దక్షిణామూర్తి స్తోత్రం అత్యంత ప్రీతి పాత్రం. ఆ స్తోత్ర పఠనలో ఉచ్చారణలు, విరామాలు- క్రమం తప్పకుండా ఉండేవని విన్నవారు అనే మాట.

కృష్ణమూర్తి ఎక్కువగా చదివి, ఆకళింపు చేసుకొన్నది- జీవితమనే గ్రంథం మాత్రమే. తాను, తనచుట్టూ ఉన్న సమాజమే గాక ప్రపంచమంతా ఎన్నోసార్లు పర్యటించి, వివిధ దేశాలు, వివిధ మతాలు, వివిధ జాతుల వారి జీవన గతులు, సమస్యలను పరిశీలించి- ప్రపంచంలోని ఏ ప్రాంతం వారైనా మౌలికంగా ఒకే మూసలో నుంచి వచ్చినవారేనని- స్వానుభవంతో తెలుసుకొన్నారు. కాకుంటే- రూప విశేషాలలోను, వేషభాషలలోను ఏ కొద్ది మార్పులు మాత్రమే ఉంటాయి. అవి ప్రాంతాలననుసరించి, వాతావరణాలననుసరించి ఉంటాయి.

సత్యాన్వేషణ కోసం పడిన ఆరాటం, కృషి- తమ Poems and Parables అన్న కవితల, గాథల సంకలనంలో వివరించారు. ఇవి 1923 నుంచి 1931 వరకు గల మధ్యకాలంలో సాగిన రచనలు. From Darkness to Light అన్న పేరుతో ఈ సంకలనం మొదటిసారిగా 1980లో ముద్రితమయింది. ఈ రచనలు జగద్గురు పాత్రకు తమను ఎంచుకొని సుశిక్షుతుని చేస్తున్న కాలంలో సాగిన రచనలు కావటమే గాక, కృష్ణమూర్తిలోని కవితావేశం, ప్రేమ, కరుణ, సౌందర్యం, విజ్ఞానాలను ప్రతిబింబించటంవల్ల ఎంతో ప్రాముఖ్యం వహించినవి. సంకలనంలోని శీర్షికలు- The Path (పథం), The Search (అన్వేషణ), The Immortal Friend (అమర

మిత్రుడు), The Song of Life, (జీవిత/జీవన గీతం)- అన్నవి కవితా ఖండికలు. ఇవిగాక Prose Poems (వచన కవితలు), Parables (గాథలు) కూడా ఉన్నాయి.

తారక సంస్థను రద్దు చేసేనాటికి కృష్ణమూర్తి తమ భవిష్యత్తును గురించి ఒక నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తున్నది. అందరూ ఆశించినట్లు జగద్గురువుగా కాక అందుకు భిన్నమైన రీతిలో- మానవులు తమ కడగండ్లు బాపుకొనేందుకు- ముందుగా వారిని వివేకవంతులను జేసి, సమస్యల వలయం నుంచి తప్పించుకొనే మార్గం తెలుసుకొనేందుకు వారిని చైతన్యవంతులను చేయటానికే నిర్ణయించు కొన్నట్లు; అశాశ్వతమైన భౌతిక వాంఛల నుండి, శాశ్వతమైన సుఖశాంతులవైపు మానవాళిని మళ్లించటం- వారి ధ్యేయమని విశదమవుతున్నది. వారి ప్రసంగాలు పరిష్కార మార్గాలు నిర్దేశించవు. ముఖాముఖి చర్చలద్వారానే సమస్యలను విశ్లేషించి, కార్యకారణా లను ఎవరికి వారే తెలుసుకొనేట్లు చేశారు. అనుభవాలననుసరించి- సమస్యల తీవ్రతలో స్థాయీ భేదం ఉంటుంది. ఎవరి అనుభవాలు వారివికాగా, ఎదుర్కొంటున్న సమస్యలలో గూడా వైవిధ్యం ఉంటుంది. అన్ని రకాల సమస్యలకు ఒక్కటే పరిష్కార మార్గం హితవుకాదు. మౌలిక సమస్యలకుగల మూల కారణాలను, సూత్రప్రాయంగా పరిష్కార మార్గాలను సూచించారు.

కృష్ణమూర్తి శ్రోతలతో అధికారపూర్వకంగా కాక- ఎవరైతే తమ ప్రసంగాలపట్ల ఆసక్తి కనబరచి, తమ అనుభవాల ద్వారా విముక్తి బడయ గోరుతారో వారికి మాత్రమే తాము ఉపయోగిస్తామని చెప్పుకొన్నారు. తాము చెప్పిన వాటితో ఏకీభవించవచ్చు లేదా భేదించవచ్చు- అందరమూ కలసి ప్రయత్నించుదాం; మన ఆలోచనలను కలబోసుకొందాం; నెమ్మ దిగా... చాలా లోతుగా ఆలోచించి వాస్తవాలను తెలుసుకొందాం- అంటూ ప్రసంగించేవారు. ప్రసంగ మధ్యంలో మీరు నాతోనే పయనిస్తున్నారా; తొందర పడవద్దు; నెమ్మదిగా అడుగులు వేయండి- అనేవారు. ఆలోచనా రహితమైన తొందరపాటు నిర్ణయాలను ప్రశ్నలను తిప్పి కొట్టేవారు. కాని శ్రోతలతోటి సంభాషణల్లో 'అయ్యా' (Sir) అంటూ సంబోధిస్తూ- సాధారణ ఉపన్యాసాలలోని 'వక్త-శ్రోత'ల సంబంధంలా ఏకపక్షంగా కాక, ఎంతో సౌమ్యంగా శ్రోతలతో సంభాషిస్తూ, వారిలో ఆలోచనలను రేకెత్తిస్తూ, పునర్విమర్శ చేసుకోటానికి అవకాశమిస్తూ- ప్రసంగించేవారు.

దివ్యజ్ఞాన సమాజం, తారక సంస్థల బంధాల నుంచి విముక్తులయ్యేనా టికి కృష్ణమూర్తి వయసు 34 సంవత్సరాలు. సుందరరూపము, చామన ఛాయ, విశాల నేత్రాలతో అయిదున్నర అడుగుల ఎత్తున ఉండే కృష్ణమూర్తి నిటారుగా, సన్నగా, కోలముఖంతో చూపరులను విశేషంగా ఆకర్షించేవారు. మృదు భాషణం, సౌజన్యం, నిర్లిప్తత, రాగరాహిత్యం, ప్రేమ, కరుణ వారి సహజాలంకారాలు. ఆత్మ విశ్వాసం, మనః స్థైర్యం, గుండె ధైర్యం వారి రక్షణ కవచాలు. ఆంగ్లంలోనే ప్రసంగించేవారు. మాతృభాష తెలుగు అయినా ఏనాడో మరచిపోయారు. ఫ్రెంచి భాష ధారాళంగా మాట్లాడేవారు. ప్రపంచ వ్యాప్తంగా పర్యటించి ప్రసంగించటానికి ఆంగ్లభాషా పాండిత్యం వారికి ఎంతో ఉపకరించింది. ఒకసారి ఆచార్య వినోబాజీ కృష్ణమూర్తిని కలుసుకొని - మాటల సందర్భంలో మీ మాతృభాష ఏమిటి? అని అడిగారు. అందుకు కృష్ణమూర్తి తమ ప్రాంతీయ భాష తెలుగు అని చెప్పుకొన్నారు. అందులోనే ప్రసంగించవచ్చుగదా అన్న సూచనకు- ప్రపంచమంతటా ఆంగ్లంలో ప్రసంగించగలిగినప్పుడు ఒక ప్రాంతీయ భాషకే పరిమితమవటం ఇష్టంలేనట్లు చెప్పారు. అయితే ఒక్కొక్కసారి కలతనిదురలో (సుప్తచేతనలో) తెలుగులో మాట్లాడేవారని తెలుస్తున్నది.

కృష్ణమూర్తి తమ జీవిత కాలంలో రెండు ప్రపంచయుద్ధాలను చూచారు. మొదటి ప్రపంచయుద్ధంనాటికి ఇరువది సంవత్సరాల వయసు- రెండవ ప్రపంచయుద్ధం నాటికి ఏబది సంవత్సరాల వయసు. ప్రపంచయుద్ధాల పేరున జరిగిన మారణహోమం కృష్ణమూర్తిని ఎంతగానో ద్రవింపజేసింది. స్వార్థరాజకీయ ప్రయోజనాల కోసం మానవులను బలి పశువులను చేయటాన్ని ఖండించారు. ఈ యుద్ధాలు అసలు సమస్యలను పరిష్కరించక పోగా దేశాల మధ్య, జాతుల మధ్య వైషమ్యాలను పెంచాయన్నారు. నా దైవం, నా దేశం, నా ఇల్లు, నా కుటుంబం- అనే భావన ఉన్నంతకాలం వైషమ్యాలు తప్పనిసరి అవుతున్నాయని, ఇరుకు గదులనుంచి విశాల ప్రపంచంలోనికి అడుగిడి, ప్రేమ, కరుణల ద్వారా మానవ సమాజం వర్థిల్లాలని హితవు చెప్పారు. యుద్ధకాలంలో ఎక్కువగా ప్రయాణించలేదు. యుద్ధం ముగిసిన తరువాత విజయోత్సవ వేడుకలకు దూరంగా ఉండిపోయారు. తమపై ప్రయోగించిన విమర్శనాస్త్రాలను తిప్పి కొట్టారు.

1929లో తారక సంస్థను రద్దుపరచిన మరు సంవత్సరంలోనే అంటే 1930లో దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి గూడా రాజీనామా చేశారు. ఏ సంస్థకు, ఏ సమాజానికి చెందని వ్యక్తిగా, స్వతంత్రుడుగా, నిరంతర సత్యాన్వేషిగా, విశ్వమానవుడుగా ప్రపంచమంతటా విస్తృతంగా పర్యటించి, తమ జీవితపరంగాను, ప్రపంచపరంగాను సాగిన సత్యశోధన ఫలితాలను మానవాళికి ఎఱుకపరచారు. మానవులు ఎదుర్కొంటున్న వివిధ సమస్యల పట్ల సమ్యగవగాహన ఏర్పరచుకోటానికి, అప్రమత్తతతో సమస్యలను అతిగమించటానికి కృషి చేశారు. దైనందిన సమస్యల నుంచి అంతర్జాతీయ సమస్యల వరకూ వారి ప్రసంగాలలో చోటు చేసుకొన్నాయి. వ్యక్తిగత సమస్యల పరిష్కారాలకు గూడా కొందరు పెద్దలు వారిని ఆశ్రయించేవారు. అటువంటి సమస్యలపైని చర్చలపట్ల అంత సుముఖత చూపేవారుకారు. అలాగని వారిని నిరుత్సాహపరచక, వారి బాధలను విని ఉచితమైన రీతిని పరిష్కార మార్గాలను సూచించి పంపేవారు.

ప్రపంచ పర్యటనలలో వివిధ దేశాలలోని ప్రముఖులతో పరిచయం కలిగింది. ఆ ప్రముఖులలో గాయకులు, పండితులు, రాజకీయ నాయకులు, మతాధిపతులు, శాస్త్రజ్ఞులు, సాంఘిక సేవా పరాయణులు- ఇలా ఎందరో వివిధ రంగాలకు చెందిన ప్రసిద్ధులున్నారు. వారితోటి సంభాషణలు, చర్చలు సాగించారు. వివిధ అంశాలపై కృష్ణమూర్తికి ఉన్న అవగాహన వారిని అబ్బురపరచేది. వారిలో కొందరిపైన విధిగా కృష్ణమూర్తి ప్రభావం కూడా పడింది.

- భారతదేశంలో మహాత్మాగాంధి నాయకత్వాన సాగుతున్న స్వాతంత్ర్య సమర విశేషాలను తెలుసుకొంటుండేవారు. మహాత్మాగాంధీని ఎన్నో మారులు కలుసుకొన్నారు. రాజకీయాలకు దూరంగా ఉంటూనే సార్వభౌమాధికారాన్ని, వలసరాజ్య విధానాన్ని ఖండించారు. 1930 ప్రాంతాల- దేవాలయాలలో హరిజన ప్రవేశాన్ని ప్రచారం చేస్తూ ప్రజలను ఉద్దేశించి మహాత్మాగాంధి ఉపన్యసించిన సమావేశాలలో - కృష్ణమూర్తి కూడా కొన్ని సభలలో పాల్గొన్నారు. ఒక సందర్భంలో ఎదురైన ప్రశ్నకు బదులుగా- దేవుడనే వాడు దేవాలయాల్లో లేడు; ఎవరు ప్రవేశించితే మాత్రం ఏమిటి?- అన్నారు.

- శ్రీ జార్జి బెర్నార్డుషా ఆనీబెసెంటుకు అత్యంత సన్నిహితులు. కృష్ణమూర్తి 1933 ప్రాంతాల లండన్ నగరంలో ఉంటున్నప్పుడు లేడీ ఎమిలీ ల్యూట్యెన్స్ ఇచ్చిన విందులలో ఒకటి రెండుసార్లు కలుసుకొన్నారు. తాను చూచిన వాళ్లలో ఎంతో అందగాడు కృష్ణమూర్తి- అని అభివర్ణించారు, షా.

- శ్రీ ఆల్డస్ హక్స్‌లీ లాస్ ఎంజల్స్ నగరంలోని రామకృష్ణ మఠాధిపతి స్వామి ప్రభవానంద శిష్యులు. 1937 ప్రాంతాలలో మొట్టమొదటి సారిగా పరిచయమైనప్పటి నుంచి కృష్ణమూర్తికి సన్నిహితులయ్యారు. వారిద్దరూ కలసినప్పుడు ఎన్నో విషయాలు మాట్లాడుకొనేవారు. ఆధునిక మానవ నాగరకత ప్రభావంవల్ల ప్రకృతి ఒడిలో పరవశించే జీవరాసి ఎలా క్షీణిస్తున్నదీ తలచుకొని బాధ పడేవారు. కృష్ణమూర్తి వ్రాసిన The First and Last Freedom అన్న గ్రంథానికి ఆల్డస్ హక్స్‌లీ ఉపోద్ఘాతం వ్రాశారు. కృష్ణమూర్తిలో గౌతమ బుద్ధుని చూచారు. కంటి బాధకు చిట్కా వైద్యం చెప్పారు. ఆ చిట్కా వైద్యం (Dr. Bates Exercises) తోనే జీవితాంతం వరకూ కృష్ణమూర్తికి సులోచనాల అవసరం లేకపోయింది.

ప్రముఖ సాహితీ విమర్శకుడు శ్రీ లియో పాల్డ్ స్టోకోవ్‌స్కి కృష్ణమూర్తిని మొదటి సారిగా అడయారులో కలుసుకొన్నారు. ఓర్మి సమావేశాలలో కృష్ణమూర్తితో వారు జరిపిన గోష్ఠిని 1929లో International Star Bulletin లో ప్రకటించారు. వారిరువురి మధ్య గోష్ఠి- ప్రేరణ, సృజనలపై- (Inspiration and Creativeness) సాగింది. కృష్ణమూర్తి తత్త్వ వివేచన స్టోకోవ్‌స్కిని ప్రభావితం చేసినట్లు తెలుస్తున్నది.

శ్రీ అలెన్ నూడ్, శ్రీ డేవిడ్ బామ్ వంటి శాస్త్రజ్ఞులు కృష్ణమూర్తి పట్ల ఆకర్షితులయ్యారు. వారు కృష్ణమూర్తితో సలిపిన ఇష్టాగోష్ఠి గ్రంథాల రూపంలో ప్రచురితమయ్యాయి.

- దలైలామా కృష్ణమూర్తితో ఇష్టాగోష్ఠి చేశారు. కృష్ణమూర్తి తాత్త్వికదృష్టి వారిని ఎంతగానో ఆకర్షించింది.

- భారతదేశ ప్రథమ ప్రధానమంత్రి శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూకు కృష్ణమూర్తితో పరిచయం చాలాకాలంగా ఉండినది. స్వాతంత్ర్య

సమరకాలం నుంచి కలుసుకుంటుండేవారు. సమయం దొరికినప్పుడెల్లా కృష్ణమూర్తితో నెహ్రూజీ ఎన్నో విషయాలు చర్చించేవారు.

- అలాగే జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధి కూడా కృష్ణమూర్తిపట్ల ఎంతో గౌరవాభిమానాలు చూపేవారు. ఇందిరా గాంధి హత్య జరిగిన రోజున కృష్ణమూర్తికి తమ నివాసంలో విందు ఏర్పాట్లను ఆక్రితం రోజునే ఎంతో ఘనంగా తమ స్వీయ పర్యవేక్షణలో చేశారు. కాని విధి మరొకలా నిర్ణయించింది.

- జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధి కృష్ణమూర్తి ప్రసంగాలపట్ల ఎంతో ఆసక్తి కనపరచటమేగాక వాటివల్ల ప్రభావితమైనట్లు కూడా తెలుస్తున్నది.

- శ్రీ పట్వర్ధన్ సోదరులు- రావుసాహెబ్, అచ్యుత్ (ప్రముఖ సోషలిస్టు పార్టి నాయకులు) పామా పట్వర్ధన్‌లు; ప్రముఖ సంఘసేవకురాలు, వివిధ జాతీయ కళా సాంస్కృతిక సంఘాల అధ్యక్షురాలు, ప్రధాన మంత్రికి కళా సాంస్కృతిక విషయాల మాజీ సలహాదారు- పూపుల్ జయకర్; బెనెగల్ సోదరులు- శివరావ్, రామారావ్, నరసింగరావ్; దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులు శ్రీ యన్. శ్రీరాం, శ్రీ కోట్స్, శ్రీమతి రాధా బర్నియేర్

- ఇలా ఎందరో జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ప్రముఖులు కృష్ణమూర్తికి సన్నిహితులయ్యారు.

కృష్ణమూర్తి మొదటినుంచి విద్యావిధానంపట్ల ఎంతో ఆసక్తికనపరచారు. బాల్యం నుంచి సరియైన విద్యను బోధించటంద్వారా పిల్లలను వివేకవంతులను చేయటానికి అవకాశం ఉంటుందనేవారు. పోలికలు, పోటీల ప్రమేయం, జాతి వర్ణ వివక్షతల ఊసు, మనుషులను విడదీసే సంప్రదాయాలు, ఆదర్శాలు జోలికి పోకుండా పిల్లలను పెంచగలిగితే సమాజంలో శాంతి, సుఖాలు నెలకొంటాయనే వారు. అటువంటి పాఠశాలలను వివిధ ప్రాంతాలలో నెలకొల్పాలని ఆశించారు. అందుకు అనుగుణంగా వారు స్థాపించిన మొదటి పాఠశాల ఋషీవాలీ పాఠశాల.

మొదట ఋషీవాలీలో ఒక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలనుకొన్నారు. అందుకుగాను ఒక వేయి ఎకరాల భూమిని సేకరించాలని ప్రయత్నించారు. కాని మూడువందల ఎకరాల స్థలమే లభ్యమయింది. 1928లో ఒక చిన్న పాఠశాలగా ప్రారంభమై నేడది ఉన్నత ప్రమాణాల విద్యాకేంద్రంగా విలసిల్లుతున్నది.

1934లో వారణాసికి ఐదు మైళ్ల దూరాన ఉన్న రాజఘాట్‌లో గంగానది తీరాన 200 ఎకరాల స్థలంలో మరొక పాఠశాలను ప్రారంభించారు. రాజఘాట్ విద్యాకేంద్రం కూడా ఋషీవాలీ విద్యాకేంద్రంలా దేశంలోని ప్రముఖ విద్యాకేంద్రాలలో ఒకటిగా పేరు గాంచింది.

ఈ రెండు విద్యాకేంద్రాలు కేవలం విద్యాబోధనకే పరిమితం గాక ఉచిత వైద్యం, సాంఘిక సేవ వంటి కార్యక్రమాలను కూడా నిర్వహిస్తున్నాయి. ప్రశాంత వాతావరణం, నయనానందకరమైన ప్రకృతి, ఉన్నత భావాలను ఉద్దీపింపజేసే పరిసరాలు- ఈ కేంద్రాల ప్రత్యేకతలు.

ఆ తరహాలోనే 1968లో ఇంగ్లాండులోని హేంప్‌షైర్‌లో బ్రోక్‌వుడ్ పార్క్ ఎద్యుకేషనల్ సెంటర్, 1975లో ఓహైలో ఓక్ గ్రూవ్ స్కూలు, ఇవిగాక మదరాసులో ది స్కూల్, బెంగళూరులో ది వేలీ స్కూలు, బొంబాయిలో నిరుపేద బాల బాలికలకు ''బాల ఆనంద్'' అనే విద్యా సంస్థలను నెలకొల్పారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం కృష్ణమూర్తి తిరిగి విస్తృత ప్రపంచ పర్యటనకు ఉపక్రమించారు. భారతదేశంలో అక్టోబర్ నుంచి జనవరి నెల వరకు, నాలుగు నెలలు గడిపేవారు. ఢిల్లీతో ఆరంభించి, రాజఘాట్, మద్రాసు, ఋషీవాలీ, బెంగళూరు, ఆపైన బొంబాయి నగరాలలో ప్రసంగ కార్యక్రమాలుండేవి. ఓహైలో కొన్ని నెలలు విశ్రాంతి తీసుకొని ఆ తరువాత అమెరికా, ఇంగ్లాండు, స్వీడన్, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, శ్రీలంకలలో పర్యటించేవారు. సంవత్సరం పొడవునా ఎన్నో చర్చలు, ప్రసంగాలు, ప్రముఖులతో ఇష్టాగోష్ఠి కార్యక్రమాలలో పాల్గొనేవారు. చర్చనీయాంశాలు, ప్రసంగ విషయాలు ముందుగా నిర్ణయమయ్యేవి కావు. అప్పటికప్పుడు సభికుల ఇష్టానుసారం అవి నిర్ణయమయ్యేవి. జీవితాస్తమయం వరకు అలాగే

గడిపారు. తాము మాట్లాడటం నిలిపినరోజున తమకు దేహం (శరీరం)తో అవసరం లేదనేవారు.

కృష్ణమూర్తి ప్రసంగాలు మూడు దశలుగా సాగాయి.

- మొదటి దశలో తమను అనుసరించమన్నారు.

- తరువాత-మానవుని స్వభావంలోను ఆలోచన సరళిలోనూ మార్పు రావాలన్నారు.

- ఆ తరువాత- స్వబుద్ధితో సత్యాన్వేషణ చేయాలన్నారు.

1960- ప్రాంతాలనుంచి, దినచర్య వ్రాసుకోవటం ప్రారంభించారు. అందులో తమ అనుభవాలను, కనుగొన్న విశేషాలను, ఆలోచనల్లోని వికసనాన్ని పొందుపరచారు. ప్రతి ఉల్లేఖనం క్రింద, తమలో అంతర్గతంగా సాగుతున్న పరివర్తనకు సంబంధించిన విశేషాంశాలను పేర్కొన్నారు. భాష కవితలా సాగింది. మాటలతో పొదిగిన సూత్రాలు కాక, స్థిరంగా ప్రవహించే నదిలా ఎన్నో నిగూఢ వర్ణనా విశేషాలతో ప్రవహించే జీవన స్రవంతి- అది.

కృష్ణమూర్తి ప్రసంగాలు, రచనలు, వివిధ రంగాలకు చెందిన ప్రముఖులతో చర్చలు- వందల, వేల సంఖ్యలో ఉన్నాయి. వాటినన్నింటినీ గ్రంథస్థం చేయటం అసాధ్యమే అయినా, ముఖ్యమైన వాటిని కొన్ని సంపుటాలుగా కూర్చి ప్రచురించటం 1950 ప్రాంతాలలోనే ఆరంభమయింది.

అంతకుముందు వారి ప్రసంగ పాఠాలు, రచనలు పత్రికలలో వెలువడేవి.

గ్రంథరూపంలో వచ్చిన రచనలు, చర్చలు, ప్రసంగాల సంకలనాలలో మొదటిది- 1954లో వెలువడిన The First and Last Freedom- స్వేచ్ఛ, దాని అవసరం గురించి వివరణాత్మకంగా విశదపరచింది. దివ్యజ్ఞాన సమాజ పెద్దలలో ఇది సంచలనం కలిగించింది.

తరువాత 1955లో Education and Significance of Life వెలువడింది. సుగమ జీవిత సాఫల్యానికి విద్య ఎంతవరకు ఉపకరించగలదన్న విషయంతోబాటు, విద్యా సంస్థలు, విద్యాగురువులు, తల్లిదండ్రుల బాధ్యతలు వంటి విషయాలను కూడా విపులీకరించారు.

Commentaries on Living అనే జీవన వ్యాఖ్యల సంకలనం మూడు భాగాలుగా 1956, 1959, 1960 సంవత్సరాలలో వెలువడింది. కృష్ణమూర్తి భావ విపంచిని ఆలకింపగోరేవారు తప్పక చదవాల్సిన సంకలనాలివి.

Life Ahead అన్న భవిష్యత్ జీవనానికి సంబంధించిన ప్రసంగాల సంపుటి 1963లో ప్రకటితమయింది.

ప్రశ్నోత్తరాల రూపంలో సంస్కృతి విశేషాలపైని కృష్ణమూర్తి అభిప్రాయాల సంపుటి This Matter of Culture అన్న పేరుతో 1964లో వెలువడింది.

Freedom from the Known ప్రతివారూ చదవాల్సిన రచన. 1969లో మొదటిసారిగా వెలువడింది. కృష్ణమూర్తి-సాంఘిక వ్యవస్థ, మత విశ్వాసాలు, మూఢనమ్మకాలు, కట్టుబాట్లు, బాంధవ్యం, ప్రేమ, స్వేచ్ఛ, కాలం, అన్వేషణ, పరిశీలనవంటి విషయాలను ఇందులో చర్చించారు. శ్రీమతి కనకదుర్గ రామచంద్రన్ తెలుగులో 'విడుదల' అన్న పేరుతో అనువదించి, 1982లో ప్రచురించారు.

The Only Revolution అన్న గ్రంథం 1970లో ప్రచురితమ యింది. మనలో రావలసిన మార్పు- ముఖ్యంగా అంతర్గతంగా సహజోద్గ మంగా రావలసిన మార్పును గురించి చర్చించారు.

The Urgency of Change 1971లో ప్రచురితమయింది. ఉదాసీన వైఖరిమాని, మనోగతమైన తత్‌క్షణ మార్పును పొందాల్సిన అవసరాన్ని గురించి చర్చించిన విపుల గ్రంథమిది.

1971 సంవత్సరంలోనే ప్రచురితమైన మరొక ప్రసంగాల సంకలనం The Flight of the Eagle అన్న పేరుతో వచ్చింది. స్వేచ్ఛ, ధ్యానం, మార్పు, శాంతి వంటి విషయాలను ఇందులో చర్చించారు.

The Impossible Question మానవులు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలపైని ప్రసంగాల, సంభాషణల సంకలనం - 1972లో వెలువడింది.

You are the World- నీవే ప్రపంచం- అన్న పేరుతో, మరికొన్ని ప్రసంగాల సంకలనం 1973లో వచ్చింది. మానవునికి ప్రపంచానికి గల సంబంధం ఇందులో వివరించారు.

హింస, దౌర్జన్యాల గురించిన వ్యాసాల సంపుటం Beyond Violence 1973లో ప్రచురితమయింది.

1973లోనే ప్రచురితమైన The Awakening of Intelligence మానవ బంధాలు, ధ్యానం, మానసిక పరివర్తనం వంటి అంశాలపై ప్రొఫెసర్ జాకబ్ నీడిల్ మెన్, అలెన్ న్యూడ్, ప్రొఫెసర్ డేవిడ్ బామ్, స్వామి వెంకటేశానంద వంటి శాస్త్రజ్ఞులు, వేదాంతులతోటి చర్చలు, ప్రసంగాల సంకలనం.

The Beginning of Learning 1975లో ప్రచురితమయింది. అధ్యయనంఅవసరం, మెళకువల వంటి విషయాలపైని వివరణాత్మక గ్రంథం.

కృష్ణమూర్తి రచనలలో ప్రత్యేకించి చెప్పుకోదగిన Krishnamurti's Note Book 1976లో వెలువడింది. ఇది కృష్ణమూర్తి దినచర్యలు, పరివర్తనం వంటి విషయాలను చిత్రించే యాదాస్తు పుస్తకం.

Truth and Actuality 1977లో ముద్రితమయింది. సత్యం, ప్రత్యక్షగోచరాల వైవిధ్యంపై సాగిన ప్రశ్నోత్తరాల సంకలనం. ఇతర అంశాలపైని ప్రసంగాలు కూడా ఈ సంకలనంలో ఉన్నాయి.

The Wholeness of Life అన్నది పరిపూర్ణ జీవిత వికాసానికి సంబంధించిన సంభాషణల, వ్యాసాల సంకలనం- 1978లో ముద్రితమయింది.

Exploration into Insight అనే అంతరంగ అన్వేషణపై సాగిన చర్చల సంకలనం 1979లో ప్రచురితమయింది.

Meditations ధ్యానానికి సంబంధించిన విశేషాలను తెలిపే భావదీపికలు. 1979లో అచ్చు అయింది. శ్రీమతి కనకదుర్గ రామచంద్రన్- ధ్యాన వాహిని అన్న పేరుతో రెండు సంపుటాలుగా తెలుగులో స్వేచ్ఛానువాదం చేసి ప్రచురించారు.

ఇవేగాక పెంగ్విన్ వారి Krishnamurti Reader అన్న సంకలనాలు రెండు భాగాలుగా 1970, 1972, సంవత్సరాలలో మేరీ లూట్యెన్స్ సంపాదకత్వంలో వెలువడ్డాయి. మరికొన్ని సంకలనాలు కూడా పెంగ్విన్ బుక్స్ వారు ప్రచురించారు.

ఇది కేవలం 1950-1980 మధ్య కాలంలో ప్రచురితమైన కృష్ణమూర్తి గ్రంథాల లఘు పరిచయం మాత్రమే.

మేరీ లూట్యెన్స్ వ్రాసిన కృష్ణమూర్తి జీవిత చరిత్రలో మొదటి భాగం కూడా అదే కాలంలో- అంటే 1976లో వెలువడింది.

కృష్ణమూర్తి పుస్తకాలను ఎక్కువ సంఖ్యలో Harper & Row Publishers, INC వారు ప్రచురించారు.

1980 తరువాత మరిన్ని పుస్తకాలు- కృష్ణమూర్తివి, ప్రముఖులు కృష్ణమూర్తి జీవితం- తత్త్వాలపై వ్రాసినవి- వెలువడ్డాయి.

కృష్ణమూర్తి గ్రంథాల మొత్తం సంఖ్య 40పై చిలుకుననే ఉన్నట్లు తెలుస్తున్నది.

ఈ ప్రచురణలు కృష్ణమూర్తి జీవితాన్ని- తత్త్వాన్ని, ఎక్కువ మంది సవివరంగా తెలుసుకోటానికి ఉపకరించాయి. ఆపైన దృశ్య, శ్రవణ యంత్ర పరికరాలు, సాధనాలు (Audio and Video) రావటంతో కృష్ణమూర్తిని ప్రత్యక్షంగా చూచి వినలేకపోయిన వారికి, వారి ప్రసంగాలలోని భావ ప్రకటనా శైలిని, విషయ వివరణకు వారు ఎంచుకొనే పదాల విన్యాసాలను తెలుసుకోటానికి ఎంతగానో ఉపకరిస్తున్నాయి.

ఒక సందర్భంలో దృశ్యశ్రవణ సాధనాల (Audio and Video Casettes) ప్రయోజనం పరిమితమంటూ, నేరుగా విని గ్రహించలేనిది, ఈ

పరికరాలు, సాధనాల ద్వారా చూచి, విని గ్రహించేది చాలా స్వల్పమన్నారు. అవకాశం లభించని వారికి మాత్రమే ఇవి కొంత వరకూ ఉపయుక్తం కాగలవని వారి భావం.

పర్యటన కార్యక్రమాలు, గ్రంథ ప్రచురణ, ఆర్థికపరమైన వ్యవహారా లను సోదర తుల్యుడైన రాజగోపాల్ చూచుకొనేవారు. కృష్ణమూర్తి మొదటి నుంచి లౌకిక వ్యవహారాలకు దూరంగా ఉండేవారు. ప్రతి చిన్న విషయానికి సోదరుడు నిత్యానంద మీదనే ఆధారపడేవారు. నిత్యానంద మరణానంతరం రాజగోపాల్ ఆ స్థానాన్ని ఆక్రమించారు. రాజగోపాల్‌లో నిత్యానంద పోలికలుండటంవల్ల రాజగోపాల్‌లో నిత్యానందను చూచుకొనేవారు. రాజగోపాల్ చాలా చురుకైన మనిషి. తెలివి తేటలు అమోఘం. కృష్ణమూర్తి గ్రంథాలలో కొన్నింటికి సంపాదకత్వం వహించి ప్రచురించారు.

కృష్ణమూర్తి మంచితనాన్ని ఆసరాగా తీసుకొని ఒక్కొక్క సారి రాజగోపాల్ కటువుగా ప్రవర్తించేవారు. వాటిని కృష్ణమూర్తి అంతగా పట్టించు కొనేవారు కారు. కృష్ణమూర్తికి లభిస్తున్న ప్రచారం, ఒనగూడు తున్న సంపదలను చూచి కొంత ఓర్వ లేని తనంతో బాటు, తానులేకుంటే కృష్ణమూర్తి లేడనే అహంకూడా రాజగోపాల్‌లో పేరుకొంది. పేచీలు పెట్టుకొన్నారు. వాటాలుకావాలన్నారు. పూర్తి అజమాయిషీ తనదేన న్నారు. న్యాయస్థానాలకు వెళ్లారు. వ్యవహారాలు నడచాయి. కృష్ణమూర్తి న్యాయస్థానంలో వాఙ్మూలం ఇవ్వటానికి కూడా విముఖత చూపారు. ఈలోగా ప్రేమించి వివాహం చేసుకొన్న భార్య రోసలెండ్‌కు విడాకులి చ్చారు. భార్యాపుత్రికలకు దూరమయ్యారు. వాళ్ల పోషణ భారం కృష్ణమూర్తి వహించారు. రాజగోపాల్ కుమార్తె రాధ వివాహం కూడా కృష్ణమూర్తి తమ చేతుల మీదుగా జరిపించారు. ఈ వ్యవహారాలన్నీ కడకు 1973-74 ప్రాంతంలో పరిష్కారమయ్యాయి.

కృష్ణమూర్తికి ఆనీబెసెంట్ దత్తత స్వీకారం ద్వారా సంక్రమించిన ఆస్తులు- ఓహైలోని ఆర్యవిహార, దాని చుట్టూ ఉన్నతోట, ఋషీవాలీ, రాజఘాట్ మొదలైన చోట్ల స్థాపించిన విద్యాకేంద్రాలు, పాఠశాలలు, మదరాసులోని వసంతవిహార్ వంటి స్థిరచరాస్తులు మిగిలాయి. వీటన్నింటిని

కృష్ణమూర్తి ఫౌండేషన్ వారి అధీనంలోకి తెచ్చారు. 1928లో ది ఋషీవాలీ ట్రస్ట్‌గా ప్రారంభమైన ధర్మకర్తృత్వ సంస్థ 1970 నాటికి ది కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియాగా మారింది. ఇవిగాక కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా; కృష్ణమూర్తి ఫౌండేషన్ ట్రస్ట్ లిమిటెడ్, ఇంగ్లాండు; సంస్థలు ఆయాదేశాలలోని కృష్ణమూర్తి కార్యక్రమాలను, పుస్తకప్రచురణ, విద్యాసంస్థల నిర్వహణ వంటి పనులను నిర్వహిస్తున్నాయి. మదరాసు- వసంతవిహార్- ఈ సంస్థలన్నింటికి ప్రధాన కేంద్రం. ఈ సంస్థలన్నింటికీ కృష్ణమూర్తి జీవితాంతం వరకు అధ్యక్షులు.

క్రమంగా కృష్ణమూర్తి అభిమానులు ప్రపంచమంతటా ఎక్కువయ్యారు.

జటిలమైన విషయాలను కూడా సునిశిత మేధాశక్తితో సుబోధకం చేసేప్రజ్ఞ మేధావులనే విస్మయ పరచింది. విషయవివరణకు వైవిధ్యంతో కూడిన తత్త్వశాస్త్రం, వేదాంతం, జీవోత్పత్తి శాస్త్రం, తర్కశాస్త్రం, భౌతిక శాస్త్రం వంటి ఎన్నో అంశాలను ఎన్నుకొనేవారు. భాష సరళంగా ఉండేది.

సూత్రాలు, భాష్యాలు, ప్రవచనాల ప్రసక్తిలేక, జ్ఞానిగా, ఒక నేస్తంగా వారు చేసిన ప్రసంగాలు యువతరాలను ఎంతగానో ఆకర్షించాయి.

1980 మే నెల 11వ తేది నాటికి- కృష్ణమూర్తి సహస్రమాస జీవులైనారు. వేయి పున్నముల దర్శించి కృష్ణమూర్తి జీవిత పథం- విక్రాంత పర్వాన్ని కూడా అధిరోహించింది.

## విరాజమానం

విశ్వమానవుడైన కృష్ణమూర్తి చివరి ఆరు సంవత్సరాల జీవితం- ప్రపంచమంతటా పర్యటించి, తాత్త్విక సమాలోచనలతో ప్రజలను చైతన్యవంతులను చేయటంలో పూర్తిగా నిమగ్నమయింది.

వారి ప్రసంగాల పట్ల యువకులు ఎక్కువగా ఆకర్షితులయ్యారు. శాస్త్రమీమాంస, గ్రంథస్థ విషయప్రసక్తి లేకుండా సూటిగా

సమస్యలను విశ్లేషించి, సులభంగా సుందరంగా సుబోధకం చేయకలిగిన ప్రజ్ఞ శ్రోతలను విస్మయపరచేది.

వేయి వసంతాలు నిండిన కృష్ణమూర్తిలో వృద్ధాప్యపు లక్షణాలు ఛాయా మాత్రం భౌతికంగా కనిపించినా ఉత్సాహం ఏమాత్రం తరగలేదు. చివరి రోజులలో మాత్రం కొద్దిగా చేతులు వణకటం ప్రారంభమయింది. జీవిత చరమ దశలో పుట్టకురుపు వ్యాధితో బాగా నీరసించారు. ఎక్కువగా మాట్లాడ లేకపోయారు.

జీవన సంధ్యా కాలంలో కూడా ఉదయం సూర్యోదయాత్పూర్వమే లేచేవారు. నలభయి అయిదు నిమిషాల యోగాసనాల కార్యక్రమానంతరం ఒక అరగంట ప్రాణాయామం చేసేవారు. మధ్యాహ్నం ఒంటికి నూనె పట్టించుకొని వేడినీటిలో స్నానం చేసేవారు. సూర్యాస్తమయానికి ముందు గానే కాలినడక ప్రారంభించేవారు. పెద్ద పెద్ద అంగలు- శరీరం నిటారుగా ఉండేది. స్నేహితులు, సన్నిహితులు వారికూడా నడిచేవారు- కాదు, దాదాపు పరుగులు పెట్టేవారు. చాలా వేగంగా అయిదు కిలో మీటర్ల దూరం సాగేది ఆ నడక. పరిసరాల పరిశీలన, ప్రకృతిలో వినిపించే శబ్దతరంగాల శ్రవణం, భూమినుంచి వచ్చితాకే పరిమళాల ఆఘ్రాణం ఆకాలి నడకలో భాగాలు. దారికడ్డంగా పడి ఉండేరాళ్లు రప్పలను కాలికి గుచ్చు కోకుండా ఏరి దూరంగా విసరి వేసేవారు. ఆ కాలి నడక సమయంలో ఏ ఆలోచనా వారిని అంటేది కాదు. శరీరారోగ్యం, వాతావరణం బాగా లేకున్నా కాలి నడక మాత్రం మానేది లేదు. రాత్రి 10.30 గంటలకు నిద్దురపోయేవారు. మనస్సులో ఆరోజు సంఘటనల నన్నింటిని ఒకసారి నెమరు వేసుకొనేవారు. కలల ఊసే ఉండేది కాదు.

జీవితాంతం శాకాహారమే. మత్స్య మాంసాలు మత్తుపదార్థాల సేవనానికి అతీతులు. ధూమ పానానికి దూరంగా ఉండేవారు. కాఫీ, టీ వంటి పానీయాలు కూడా స్వీకరించ లేదు.

ఉదయం ఉపాహారంలో- పండ్లు, పప్పుదినుసులు, రొట్టె, వెన్న; మదరాసు విచ్చేసినప్పుడు ఇడ్లీ, దోసె వంటి దాక్షిణాత్య వంటకాలకు ఇష్ట పడేవారు. విధిగా ఒక్క చెంచాడు కాకరకాయ రసం స్వీకరించేవారు.

మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతాల అపరాహ్న భోజనం ప్రారంభమయ్యేది. ఆ భోజన కార్యక్రమం రెండుగంటల సుమారు సాగేది. చాలా నెమ్మదిగా ఒక్కొక్క మెతుకూ పట్టి చూస్తున్నట్లు ఖాద్య పదార్థాలను పరిశీలిస్తూ, ఒక్కొక్కటీ రుచి చూస్తూ, బాగా నమలిమ్రింగేవారు. చాలా కాలంగా స్వయంపాకం అలవాటయి ఉండటం వల్ల ఖాద్య విశేషాలను విశదం చేసేవారు. వేపుడు కూరలు, తీపి పదార్థాలను అరుదుగా భుజించేవారు. ఊరగాయలు, కారపు పచ్చళ్లు- అంటే ఇష్టం. వాటిని తమతో భోజనానికి కూర్చున్నవాళ్లకు కూడా వడ్డించి భుజించమని బలవంత పెట్టేవారు. వారి భోజనం మితంగా ఉండేది. రాత్రి భోజనం చాలా స్వల్పంగా ఉండేది.

శరీరం అస్వస్థతగా ఉంటే మూలిక వైద్యం కాని, ఆయుర్వేద వైద్యం కాని చేసుకొనేవారు. ప్రతిరోజు ఉదయం ఉపాహారంతో విటమినులు ఖనిజ లవణాల మాత్రలు సేవించేవారు. భోజనం చేయటానికి హితవు కానప్పుడు, పాలు పండ్ల రసం వంటివి మాత్రం తీసుకొనేవారు. లేదా పచనం చేయని పదార్థాలు తీసుకొనేవారు.

ఉదయం ఉపాహార వేళల్లో మిత్రులు సన్నిహితులతో ఇష్టాగోష్ఠి సలిపేవారు. పత్రికలు చదివే అలవాటులేదు. పత్రికలు, పుస్తకాలు, లేకుండా బ్రతకలేమా?- అనేవారు. ఉదయం ఇష్టాగోష్ఠిలో జాతీయ అంతర్జాతీయ సమస్యల విశ్లేషణ, వైజ్ఞానిక ప్రగతి, యుద్ధాలు, విద్రోహాల వంటి ఎన్నో విషయాలను క్లుప్తంగా చర్చించేవారు. ప్రశ్నించటం తెలుసుకోవాలి; ఏదో ఒక ప్రశ్నకు మనసునుంచి సమాధానం రాపట్టాలి; అప్పుడే మనసు చైతన్యంగా ఉంటుంది- అనే వారు.

మధ్యాహ్నం స్నానానికి ముందు ఒకగంట విశ్రాంతి. ఆ సమయంలో బొమ్మల పుస్తకాలు చూడటమో, అపరాధ పరిశోధన నవలలు గాని మాయాజాల వినోద నవలలు గాని చదివేవారు. మాధ్యాహ్నిక భోజన సమయంలో తిరిగి మిత్రులు అతిథులతో చర్చలు కొంత వివరంగా సాగేవి. మధ్య మధ్య చతురోక్తులు, కథలు చెప్పేవారు. భోజనానంతరం ఒకగంట విశ్రాంతి. తరువాత చూడవచ్చిన వారితో ఇష్టాగోష్ఠి సలిపేవారు. ఆ

వచ్చిన వాళ్లు తమ కష్టాలను వెళ్లబోసు కొనేవారు. ఉచితమని తోస్తే పరిష్కారమార్గాలు సూచించేవారు.

సాయంత్రం వాహ్యాళి తరువాత తిరిగి మిత్రులు అతిథులతో చర్చలు - మానవ మేధకు అందని అంశాలు కూడా ఆ చర్చల్లో చోటుచేసుకొనేవి. వంట వార్పులో, ఖాద్య పదార్థాలు పాత్రలను అమర్చటంలో, భోజన పాత్రలను శుభ్రం చేయటంలో తరచుగా సాయపడేవారు.

సమయసందర్భాలకు అనుగుణంగా ఉడుపులు ధరించేవారు. థియేటర్లకు వెళ్లి సినిమాలు చూడటం చాలా తక్కువ. ఆ చూచినవి కూడా ఎక్కువగా పాశ్చాత్య చిత్రాలే. అడపా దడపా పురావస్తు ప్రదర్శన శాలల సందర్శన. టెలివిషన్ ఎక్కువగా చూచేవారు. భారతీయ పాశ్చాత్య శాస్త్రీయ సంగీతాలపై మోజు.

కృష్ణమూర్తిని ఎప్పుడూ ఎవరో కనిపెట్టుకొని ఉండేవారు. ప్రయాణాలలో, గృహనిర్వహణలో, కార్యక్రమాల నిర్వహణలో వారి ప్రమేయం ఎక్కువగా ఉండేది. కృష్ణమూర్తి తాముగా ఆ విషయాలను అంతగా పట్టించుకొనే వారు కారు. తమ వ్యక్తిగత విషయాలను మాత్రం చూచుకొనేవారు. మొదట్లో శ్రీ మాధవాచారి కృష్ణమూర్తి వ్యవహారాలను చూచేవారు. వంటశాల నిర్వహణ మొదలు ప్రసంగాల ప్రతులను తయారు చేసే పర్యంతం మాధవాచారి పర్యవేక్షణ ఉండేది. మాధవాచారిని కృష్ణమూర్తి 'మామా' అని ఆప్యాయంగా పిలచేవారు. క్రమంగా మాధవాచారి అందరికీ 'మామ' అయ్యారు. ఆ తరువాత మరికొందరు- శ్రీమతి మేరీ జింబాలిస్ట్ ప్రవేశించేంతవరకూ ఆ పనులు చూచుకొనే వారు.

మేరీ జింబాలిస్ట్- బెన్‌హుర్ వంటి ప్రసిద్ధ చలనచిత్రాల నిర్మాత శ్రీ శామ్ జింబాలిస్ట్ సతీమణి. భర్తమరణించటంతో వియోగంలో ఉన్న మేరీ జింబాలిస్ట్ 1944 ప్రాంతాల కృష్ణమూర్తి ప్రసంగాలు విని ప్రభావితుల య్యారు. తరచుగా ప్రసంగాలు వింటూ క్రమంగా కృష్ణమూర్తికి సన్నిహితుల య్యారు. 1947 నుంచి కార్యదర్శిగా కృష్ణమూర్తి జీవితాంతం వరకూ కనిపెట్టుకొన్నారు. కృష్ణమూర్తిని చూట్టానికి తరచుగా ఎందరో మిత్రులు, సన్నిహితులు, అభిమానులు వస్తుండేవారు. ఏ దేశంలో ఉన్నా ఎక్కడ

ఉన్నా వీరి రాకడ పరిపాటి. అతిథి మర్యాదలు నెరవేర్చటంతో బాటు, కృష్ణమూర్తి కార్యక్రమాలు, ప్రయాణాల నిర్ణయం, పుస్తక ప్రచురణ, ఆర్థిక వ్యవహారాలవంటి పనులు కూడా మేరీ జింబాలిస్ట్ చాలా నేర్పుగా నిర్వహించేవారు. ఎంతో శ్రీమంతురాలయినా కృష్ణమూర్తి పట్ల అభిమానం కొద్దీ వారికి సాయంగా ఉండేవారు.

సంస్థాగత విధానాలంటే కృష్ణమూర్తికి నమ్మకం లేదు. మొదటినుంచి సంస్థల నిర్మాణాన్ని వ్యతిరేకించారు. తమకోసం, తమ చుట్టూ నిర్మితమైన తారక సంస్థను రద్దు పరచారు. సత్య శోధనకు నిర్దిష్టమైన మార్గాలంటూ లేవని, అది వ్యక్తి పరంగానో లేదా చైతన్యవంతులైన ఏకొద్ది మంది సత్సంకల్పం, దీక్ష దక్షతల మూలంగానో సాధ్యమవుతుందని ప్రకటించారు. సంస్థల నిర్మాణం వల్ల ఒరిగేది బహుస్వల్పం కాగా వాటి ద్వారా వ్యక్తిపూజ, ఆరాధన, ఆడంబరం, పదవుల కోసం తగవులు అనివార్యమవుతున్నాయనేవారు.

భావితరాలనైనా చైతన్యవంతులను గావించేందుకు విద్యావిధానం సక్రమంగా రూపొందించాలనేవారు. సక్రమ విద్యావిధానమంటే మనం కోరుకుంటున్నట్లు, మనకోసం భావితరాన్ని మలచటంగాక, పిల్లల మనోరథాలను గుర్తించి వారికి ఏయే విషయాలలో ఆసక్తి ఉందో గ్రహించి వారిని అందులో నిష్ణాతులను చేయటమేగాక, జీవితం- జీవన విధానం పట్ల సమగ్ర అవగాహనకు అవకాశం కలిపించటమని కృష్ణమూర్తి అభిప్రాయం. వారు స్థాపించిన పాఠశాలల లక్ష్యంకూడా అదే. ఆ పాఠశాలల నిర్వహణపట్ల ఎంతో ఆసక్తి చూపేవారు. భాస్వంతమైన విద్యార్థుల భవిష్యత్తుతో- అటు తల్లిదండ్రులు, ఇటు విద్యాగురువులు, విద్యా సంస్థలు చెలగాట మాడటాన్ని నిరసించేవారు. విద్యా సంస్థల నిర్వహణ పట్ల చూపించిన శ్రద్ధ కృష్ణమూర్తి తమ అధీనంలోని ఇతర సంస్థల పట్ల చూపించలేదు.

సత్యశోధనకు, తాత్త్విక సమాలోచనలకు ఒక అధ్యయన కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని సన్నిహితులు కోరారు. అందుకు ఎన్నో సలహాలు, సంప్రదింపులు, ప్రణాళికలవంటి తతంగం పూర్తి చేసి రంగం సిద్ధంచేసారు.

కృష్ణమూర్తి బోధల అధ్యయనం ప్రచారం వారి మనసులలో మెదులుతుండినవి. అలాగాక, ఎవరికి వారే సత్యాన్వేషణకు ఉద్యుక్తులు కావాలని కృష్ణమూర్తి అభిలాష. తమ అభిప్రాయాల ప్రచారం, వాటిపై భాష్యాలు, వ్యాఖ్యానాలు చేయటానికి ఇచ్ఛగించలేదు. సంస్థల నిర్మాణం, అధ్యయన కేంద్ర ప్రయోజనాల గురించి కృష్ణమూర్తి ఎన్నో సందర్భాలలో తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

- అధ్యయన పరత్వంలో ప్రతి క్షణమూ సచేతనంగా ఉండాలి; ఎవరికి వారే గురువు, శిష్యుడు కావాలి; ఏ ఒక్కడు మాత్రమే ప్రకాశించడమో ఫలసిద్ధిపొందటమో గాక అందరూ ప్రయోజనం పొందాలి. అందరిలోనూ మంచితనం ప్రభవించాలి.

- ఛాందస భావాలు, సంప్రదాయాల పైని విశ్వాసాలు తొలగిపోవాలి; జాతి, మత, వర్గ వర్ణవివక్షతలు నమసి పోవాలి; అందుకు మనఃపూర్తిగా సంసిద్ధులు కానివారు దూరంగా ఉండిపోవటమే మంచిది.

- మధ్యస్థపు మతి మంతుల కూటమివల్ల ప్రయోజనం శూన్యం; ఆచరణలో ఆలోచనలలో ఉన్నత పథాన్ని చేరగలగాలి.

- ప్రేమ, కరుణ ఉన్నచోట వివేకం కూడా వచ్చి చేరుతుంది; నిబద్ధ బుద్ధి, కుంచిత మనస్సు ఉన్నచోట కరుణ కరువవుతుంది.

- ప్రవచనాలకు తగినట్లు ప్రవర్తించితే పవిత్రత చేకూరుతుంది.

- ఇలా ఎన్నో అభిప్రాయాలను వ్యక్తంచేశారు. అటువంటి మహోన్నత ఆదర్శాలతో సంస్థలు పనిచేయ గలుగుతాయా అన్నది వేరు ప్రశ్న. అందుకే ఆశయాలు, ఆదర్శాలు మరుగునపడి సంస్థలు మాత్రం జీవచ్ఛవాలుగా మిగిలి పోతున్నాయి. పనులలో పసలేకున్నా పదవుల కోసం ప్రాకులాడటం చూస్తున్నాం. కనుకనే కృష్ణమూర్తి సంస్థల నిర్మాణంపై ఆసక్తి చూపలేదు.

ప్రసంగ సమయాలలో ఊహించని సవాళ్లను ఎదుర్కొన వలసివచ్చేది. కృష్ణమూర్తి ఏమాత్రం జంకులేక వాటికి ప్రతి సమాధానాలిచ్చేవారు.

- దివ్యజ్ఞాన సమాజం నుండి విడిపోయిన క్రొత్తలో కొందరు సమాజ సానుభూతి పరులు, వింత ప్రశ్నలు వేశేవారు. కృష్ణమూర్తి జవాబులు కూడా అందుకు తగినట్లుగానే ఉండేవి.

- శ్రీలంక పర్యటనలో ఒక సారి- శ్రీలంక పార్లమెంటు ప్రతిపక్ష సభ్యులు, ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు డా. ఎన్.ఎమ్.పెరీరాతో వాగ్వాదంలోకి దిగాల్సివచ్చింది. 'టొటలిటేరియన్' వ్యవస్థలో- ప్రతి వ్యక్తీ నిర్ణయాలకు విధిగా బుద్ధుడై వుండాలని, అలా లొంగని పక్షంలో ఆ వ్యక్తి రాజకీయ ఖైదీగా జీవితాన్ని కొనసాగించాల్సి వస్తుందని, అప్పటికీ మార్పురాక ప్రతి ఘటనకు పురికొల్పితే ఆ వ్యక్తిని అంత మొందించాల్సి వుంటుందనీ- డా. పెరిరా వాదించారు.

అయితే ఆ వ్యక్తిని నేనే- అంటూ కృష్ణమూర్తి ఏ మాత్రం జంకు లేకుండా ప్రకటించుకొన్నారు. మౌలికంగా రావలసిన మార్పు అంతరంగం లోనే కాని బాహ్యంగా ఎన్ని మార్పులు తీసుకువచ్చినా ప్రయోజనం లేదంటూ- వ్యక్తి స్వేచ్ఛ, సమాజం, బాంధవ్యం వంటి విషయాలను చర్చించారు. ప్రసంగానంతరం డా. పెరీరా వేదిక పైకి వెళ్లి కృష్ణమూర్తిని ఆలింగనం చేసుకున్నారు.

- ఆస్ట్రేలియా పర్యటనలో, ఒకనాడు, ప్రసంగ మధ్యంలో, పూటుగా మద్యం సేవించిన ఒక శ్రోత కృష్ణమూర్తి భావాలను సవాలు చేస్తూ వేదిక పైకి నడచాడు. సభికులు, సభా నిర్వాహకులు కలవర పడ్డారు. కృష్ణమూర్తి ఆ శ్రోతను వేదికపైకి ఆహ్వానించి, ఆశీనులు కమ్మని తమ ప్రసంగాన్ని కొనసాగించారు. ప్రసంగానంతరం, ఆ శ్రోత ఎంతో బాధపడుతూ, భారంగా తల దించుకు వెళ్లిపోయాడు.

- అలాగే మరికొన్ని సంఘటనలు కృష్ణమూర్తి జీవితకాలంలో ఎదుర్కొన్నారు. ఏ మాత్రం తొణకకుండా ధైర్యంతో నిలచి విశ్లేషణ ద్వారా ప్రత్యర్థులను శాంత పరచేవారు.

కృష్ణమూర్తి మహిమలు, అద్భుతాల ప్రదర్శనకు అంత ప్రాముఖ్యం ఇవ్వలేదు. శారీరక రుగ్మతలను బాపి స్వస్థత పరచే శక్తి ఉన్నా బహిర్గతం చేయలేదు.

-ఆనందమయి మా చాలా శక్తి సంపన్నురాలుగా ఉత్తర భారతంలో ప్రతీతి. కృష్ణమూర్తి, ఆనందమయి మా లను ఒకే వేదికపై చూడాలని సన్నిహితులు, అభిమానులలో కొందరికి ఆరాటం. కృష్ణమూర్తి అటువంటి ప్రతి పాదనలను త్రోసి పుచ్చేవారు. ఢిల్లీలో కొందరు మిత్రులు పట్టుబట్టి ఆనందమయి మా విడిదిచేసిఉన్న ఒక తోటకు కృష్ణమూర్తిని తీసుకువెళ్లారు. సభకు విచ్చేసినవారు ఇద్దరికీ పాదాభివందనాలు చేశారు. కృష్ణమూర్తికి ఇది సంకట ప్రాయమయింది. ఆనందమయి మా- కృష్ణమూర్తిని- తమరు గురువులకే గురువు; ఆ వ్యవస్థను ఎందుకు కాదంటారని- ప్రశ్నించారు.

గురువు అంటే గ్రుడ్డివాడు దారివెదుక్కోటానికి ఉపయోగించే చేతి కర్రలాంటి వాడని భావం ప్రబలటం వల్ల- అన్నది, కృష్ణమూర్తి జవాబు.

వేల మంది మీ ప్రసంగాలు వింటానికి వస్తారు. వారికి బోధలు చేయటం వల్ల మీరు కూడా గురువులే- అన్నారు అనందమయి మా.

ఆమె చేతిని పట్టుకొని ప్రతి జవాబివ్వక మిన్నకున్నారు.

- కాలిఫోర్నియా నుంచి ఢిల్లీకి విమానంలో ప్రయాణిస్తున్న సమయంలో- అదే విమానంలో మహర్షి మహేష్ యోగి కూడా ప్రయాణం చేస్తున్నారు. మహర్షి తమ కార్యదర్శి ద్వారా పూల గుచ్ఛాన్ని పంపుతూ, తాము కృష్ణమూర్తితో ముచ్చటించటానికి అనుమతి కోరారు. కృష్ణమూర్తికి గురువుల వ్యవస్థ, సంప్రదాయాలపై సదభిప్రాయం లేని సంగతి తెలిసిందే. అయిష్టంగానే ఒప్పుకొన్నారు. మహర్షి- కృష్ణమూర్తిని కలుపుకొని ధర్మ ప్రచారం, గురు పీఠం వంటి ప్రతిపాదనలు చేశారు. కృష్ణమూర్తి వీలయినంత మర్యాదగా సంభాషణలను కొనసాగ నివ్వలేదు.

- ఆస్ట్రేలియా సిడ్నీ నగరం మ్యూజిక్ హాలులో కృష్ణమూర్తి ప్రసంగాల అనంతరం జనం మధ్యనుంచి సహాయకులతో నడచి వెళ్లి కారులో కూర్చునేవారు. జనానికి కృష్ణమూర్తి కనిపించేవారు కారు. సహాయకులు జనం మధ్యనుంచి దారి చేయటం మాత్రం కనిపించేది.

- అడయారులో శ్రీమతి రాధా బర్నియేర్ బంధువులలో ఒకరికి చిన్నప్పుడే అంధత్వం దాపురించింది. కృష్ణమూర్తి మదరాసు విచ్చేసిన ప్పుడు రోజూ అడయారు సముద్ర తీరంలో వాహ్యాళికి వెళ్లేవారు. కృష్ణమూర్తికి ఆ బంధువును పరిచయం చేశారు రాధా బర్నియేర్. రోజూ కొంత సేపు ఆ కళ్లను స్పృశించేవారు. క్రమంగా అంధత్వం తగ్గినట్లు, చూపు మెరుగైనట్లు తెలుస్తున్నది.

- అలాగే అప్పుడప్పుడు రోగులను స్వస్థత పరచినట్లు తెలుస్తున్నది. శారీరకమైన బాధల నివారణకన్న, మానసిక చికిత్స ప్రధానమనేవారు. అందుకే శారీరక రుగ్మతలను బాపేందుకు ఇష్టపడలేదు.

కృష్ణమూర్తి ఐక్యరాజ్యసమితి డాగ్ హేమర్ షెల్డ్ గ్రంథాలయ సమావేశ మందిరంలో 1984 మే నెల 16వ తేదీన ప్రసంగించారు. ప్రసంగాంశం- శాంతి. ఈ ప్రసంగం అత్యంత ప్రధానమైనదిగా పేర్కొంటారు.

- ఐక్యరాజ్య సమితితో కలుపుకొని ఎన్నో సంస్థలు ప్రపంచశాంతికి కృషి సలుపుతున్నా, ఎన్నో కారణాలుగా ప్రపంచంలో శాంతి నెలకొనటం లేదు..... జాతులు, తెగలు, మతాలు, వర్గాలు, వంశాలు, కులాలు- ఇలా ఎన్నో విధాలుగా మానవుల మధ్య విభేదాలు, వైషమ్యాలు చూస్తున్నాం. లక్షల సంవత్సరాలుగా ఎందుకు మానవులు శాంతియుతంగా జీవించలేక పోతున్నారు? ..... ఈ భయాందోళనలకు బాధ్యులం మనమేనని తెలుసుకోవాలి. హింస, పగ, ద్వేషం, విద్రోహం, యుద్ధం- వీటన్నింటికీ కారణం మనమే..... ఎక్కడో, ఏదేశంలోనో కాదు, మనహృదయాలలో, మన మనసులలోనే యుద్ధం సాగుతోంది. ఈ సమాజానికి కారకులం మనమే. మనమే ఈ సమాజం..... ప్రతి ఒక్కరిలోను మూల స్వభావంలో మార్పురానంత వరకూ యుద్ధాలు తప్పనిసరి అవుతాయి..... విశ్వాసాలు, నమ్మకాలు, ఆదర్శాలు, భద్రతవంటి భావాలు మనిషిని బంధీకృతుడిని చేశాయి..... బాంధవ్యాలలో వైరుధ్యంచోటు చేసుకుంది..... మతాలు, సాంఘిక నియమాలు, సంస్కృతి- ఇలా ప్రతి అంశమూ మానవులను లోబరచుకొన్నాయి..... భౌతిక, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో ఎంతో

అభివృద్ధిని సాధించగలిగామను కొంటున్నాం; కాని, అంతరంగంలో మాత్రం మనమింకా అల్పులమేనన్న విషయం గ్రహించాలి..... అంతరంగంలో శాంతి కొరవడినప్పుడు బాహ్య ప్రపంచంలో శాంతి నెలకొల్పటం సాధ్యంకాదన్న విషయాన్ని తెలుసుకోవాలి..... మన స్వభావాలలో మౌలికమైన మార్పురా నిదే, పృధివీతలంపైన శాంతిని స్థాపించలేం..... ఎన్నో విప్లవాలు, మార్పులు చూస్తున్నాం; కాని, ఈ మనో విప్లవం - మార్పును గురించిన శ్రద్ధ లేదు..... అట్టి మార్పును సంతరించుకోనంతవరకూ, స్వార్థం, క్రౌర్యం వంటి స్వభావాలు మనల్ని అంటి పెట్టుకొనే ఉంటాయి; తద్వారా శాంతికి స్థానం లేకుండా పోతుంది-

- అంటూ మానవ స్వభావంలో రావలసిన తత్ క్షణ మార్పును, దాని అవసరాన్ని వక్కాణించారు.

కృష్ణమూర్తి 1985 నవంబరు నెలలో బౌద్ధపండితులతో చర్చలు చేశారు. ఈ పండితులతోటి పరిచయం అంతకు పది, పదిహేను సంవత్సరాల క్రితంనుంచి ఉన్నది. ఆ పండితులలో ప్రముఖులు పండిత జగన్నాథ ఉపాధ్యాయ - కాలచక్ర తంత్ర అన్న మహాయాన బౌద్ధ గ్రంథానికి భాష్యకారులు. రిన్‌పోచ్ సాండగ్ అనే పండితులు సారనాథ్‌లోని టిబెట్ పీఠానికి చెందినవారు. వీరిరువురితో బాటు- ప్రొఫెసర్ కృష్ణనాథ్, శ్రీరామ్ శంకర్ త్రిపాఠి అనే మరిద్దరు స్థానిక విద్యాసంస్థలకు చెందిన పండితులు కూడా చర్చలలో పాల్గొన్నారు. కృష్ణమూర్తి - చర్చలలో పాల్గొన్న పండితులను రెండు ప్రశ్నలడిగారు.

ప్రపంచంలో- ఈ భూఖండంలో- అంటే భారత దేశంలో శాశ్వతమైనది, పవిత్రమైనది- అంటూ ఏదైనా ఉన్నదా?

అటువంటిది ఉన్నట్లయితే ఈ భూఖండం ఎందుకు కలుషితమయింది?

సుదీర్ఘ చర్చల అనంతరం తామే ప్రశ్నలకు జవాబులు కూడా ఇచ్చారు.

- చర్చలు ముగియటానికి ముందు కృష్ణమూర్తిని- మీరే ప్రశ్నలు లేవదీశారు. 'ఇది' ఏమిటి? 'ఇది' భారత దేశంలో ఉన్నదా? అని అడిగారు. 'ఇదే' అదా?- అని అడిగారు.

కృష్ణమూర్తి చాలా సేపు మౌనంగా ఉండిపోయారు. 'హా' (అవును) అన్నమాట వినిపించింది. ఇదేమంత కష్టమైనది కాదు. చాలా సులభమైనదే- అంటూ కృష్ణమూర్తి సంభాషణ పొడిగించారు.

స్వార్థం- ఇతరులనుంచి (బాహ్యప్రపంచాన్నించి) వేరు చేసే కవాటం వంటిది.

కృష్ణమూర్తి మరొక ప్రశ్న అడిగారు. -ఎక్కడ స్వార్థం అంతరించి, తదన్యమైనది ఆవిర్భవిస్తుంది? ఈ ప్రశ్నకు జవాబివ్వలేదు. అది శేషప్రశ్నగానే మిగిలి పోయింది. ఈ ప్రశ్నోత్తరాలు కృష్ణమూర్తి ఆత్మగతమైనవి.

రాజఘాట్‌కు 1985 నవంబరు నెలలో వచ్చినప్పటినుంచి కృష్ణ మూర్తి మాటలు, చేతల ధోరణి- వీడ్కోలు చెప్పతున్నట్లుగా తోచింది.

రాజఘాట్‌నుంచి ఋషీవాలీ వెళ్లారు. ఆతరువాత మదరాసు చేరుకొన్నారు.

ఋషీవాలీలో ప్రశ్నోత్తరాల సరళిలో ప్రసంగం క్లుప్తంగా సాగింది.

మదరాసులో డిసెంబరు 28 తేది కార్యక్రమం చాలా నీరసంగా సాగింది. బాగా అలసిపోయారు. శరీరోష్ణోగ్రత పెరిగింది. జ్వరం ఆరంభమయింది.

1986 జనవరి 1వ తేదీన- చావు; పుట్టుక- లపై సాగిన ప్రసంగం అర్ధాంతరంగా ముగిసింది. తిరిగి జనవరి 4 తేదీన ప్రసంగం ఏర్పాటయింది. అదేవారి చివరి ప్రసంగం.

ఆరోగ్యం బాగా క్షీణించింది. బాగా నీరసించారు. మాటలలో వెనుకటి తీవ్రత లేదు. స్పష్టతలోపించింది.

కృష్ణమూర్తి సంస్థల భావి కార్యక్రమాల గురించిన ప్రశ్నలు వచ్చాయి. కార్యనిర్వాహక సభ్యులలో ఏకాభిప్రాయం కుదరలేదు.

ప్రవక్తల మరణానంతరం మత సంస్థలు ఆవిర్భవిస్తాయి; ప్రవచనాల ప్రాధాన్యం తరిగి పోతుంది- అన్న విషయం వారికి తెలుసు. ఎట్టి పరిస్థితులలోను- సంస్థలు గాని, ఆ సంస్థల అధీనంలోని మరేయితర సంస్థలుగాని సభ్యులు కాని కృష్ణమూర్తి బోధలపై అధికారం ప్రకటించటానికి గాని, మార్పులు చేయటానికి గాని, వీలు లేదు- ఇది కృష్ణమూర్తి నిశ్చితాభిప్రాయం.

సంస్థల కార్యనిర్వాహక సభ్యుల సమావేశం ఏర్పరచారు. అధ్యక్షులైన కృష్ణమూర్తి సభ్యులనుద్దేశించి చివరి సారిగా మాట్లాడారు. ప్రసంగం చాలా క్లుప్తంగా ముగిసింది. ఆ మరురోజునే కృష్ణమూర్తి ప్రయాణం. బొంబాయి కార్యక్రమాలు రద్దు అయ్యాయి. నేరుగా అమెరికా వెళ్లటానికి ఏర్పాటు చేశారు.

కృష్ణమూర్తి గదిలోపల విశ్రాంతి తీసుకొంటున్నారు. గది వెలుపల స్నేహితులు, సన్నిహితులు, అభిమానులు ఆందోళనలో ఉన్నారు. వారిని ఉద్దేశించుతూ గౌతమ బుద్ధుని అంతిమ ఘడియలను వర్ణించి చెపుతున్నారు, పండిత జగన్నాథ ఉపాధ్యాయ-

- కుశినార పొలిమేరలో రెండు సాల వృక్షాల నడుమ బుద్ధ భగవానులు చివరి ఘడియలు సమీపించే సరికి ఆకాశంవంక చూస్తూ మహాపరి నిర్వాణ మొందారు- అంటూ ముగించి-

అక్కడకూడిన సంస్థల సభ్యులలో ఒకరిని పిలచి, కృష్ణమూర్తితో- మృత్యువును ఆహ్వానించ వద్దని చెప్పమన్నారు.

- ప్రపంచంలో ఇంకా చెప్పలేనంత బాధ పేరుకు పోయింది; వారికి మీ సహాయం కావాలి; మీరు అవతరించిన పని ఇంకా పూర్తికాలేదు- అని కృష్ణమూర్తికి ముమ్మార్లు విన్నవించమన్నారు.

అతి కష్టం మీద ఆమె కృష్ణమూర్తికి పండిత జగన్నాథ ఉపాధ్యాయ చెప్పమన్న మాటలు విన్నవించుకున్నారు.

అందుకు కృష్ణమూర్తి- తాను మృత్యువును ఆహ్వానించటం లేదని; కాని ఎంత కాలం దుర్బల శరీరం నిలుస్తుందంటూ-

- ఇప్పటికే ఆరు కిలోల బరువు తరిగింది. మరికొంత బరువు తరిగితే ఏమవుతుందో తెలుసా? ఆపైన నడవటం కూడా సాధ్యంకాదు. ప్రసంగాలు నిలచిపోతాయి. శరీరం శుష్కించి నశించి పోతుంది. అప్పుడు ఈ శరీరం ప్రయోజనం శూన్యం అవుతుంది- అని వారించారు.

రాజఘాట్‌లో ఉన్నప్పుడు చివరి సారిగా దివ్యజ్ఞాన సమాజానికి వెళ్లారు. ఆనీబెసెంట్ గదిలో కొద్ది నిమిషాలు గడిపారు. ఆనీబెసెంట్, నిత్యానందలను ఎక్కువగా అభిమానించారు. ఆనీబెసెంట్ పట్ల గౌరవాభిమానాలు; నిత్యానంద పట్ల ఎంతో భాతృ ప్రేమ.

మదరాసులో గడిపిన చివరి రోజున అడయారు సముద్ర తీరానికి వెళ్లారు. వాహ్యాళి అనంతరం- నాలుగు దిక్కుల వైపుకు తిరిగి ప్రదక్షణ నమస్కారం చేశారు. అదే మదరాసుకు, అడయారు పరిసరాలకు కడపటి వీడ్కోలు.

మరురోజు నేరుగా అమెరికా ప్రయాణం. అమెరికా చేరిన తరువాత వైద్య పరీక్షలో అస్వస్థతకు కారణం పుట్టకురుపు అని తేలింది. ఎక్కువ రోజులు గడవటం కష్టం. వైద్యులు, సన్నిహితులు వారిని అంటి పెట్టుకొని ఉన్నారు.

తాము మొట్టమొదటి సారిగా స్వస్వరూప జ్ఞానం పొందిన తావు - మిరియపు చెట్టు పాదాన్ని (మొదలును) సందర్శిస్తూ విశ్రమించారు. 1986 ఫిబ్రవరి 16వ తేది అర్ధరాత్రి సమయంలో గాఢ నిద్రలోనే అంతిమ శ్వాస విడచారు.

కృష్ణమూర్తికి మత సంప్రదాయాలపై నమ్మకం లేదు. వారి అభీష్టం మేరకు శరీరానికి స్నానం చేయించి తెల్లని ఖద్దరు శిల్కుగుడ్డను కప్పారు.

'ఓహై' సమీపంలోని 'వెంటురా' లో దహన సంస్కారం చేశారు. చితిపై పేర్చిన కట్టెలతో బాటు కృష్ణమూర్తి బొంది కూడా 1986 ఫిబ్రవరి నెల 17వ తేదీన ఉదయం వేళలో అగ్నికి ఆహుతి అయింది.

కృష్ణమూర్తి అశరీరులైనారు.

ప్రార్థనలు, కర్మకాండ వంటి వేమీ లేవు; ఆడంబరాలు, ఆర్భాటాలూ లేవు.

అస్థికలు తెచ్చిన రోజున ఓహైలో వానజల్లులు పడ్డాయి.

అస్థికలు రాజఘాట్ వద్ద గంగలో నిమజ్జనం చేశారు.

వీలునామా వ్రాయలేదు. పుట్టినప్పుడు గాని, ఆ తరువాత గాని, ఏ ఆస్తి పాస్తులూ లేని తమకు వీలునామా వ్రాసే అవసరం లేదన్న పరిత్యాగి కృష్ణమూర్తి.

వారు పరిపూర్ణులు -
వారి జీవితమే సందేశం.

# సత్యాన్వేషణ

అన్వేషణ మానవ సహజ లక్షణం. ఆకలిదప్పులను తీర్చుకొనే ప్రయత్నంతో ఆరంభమైన అన్వేషణ సుఖ సంతోషాలను పొందేందుకు, ఆపైన ఏదో వెలితి గోచరించి జీవిత లక్ష్యాల ఆరాతీసే ఆరాటం ప్రబలేంత వరకూ కొనసాగుతూనే ఉన్నది.

తృప్తి చెందని మానవుడు కోర్కెలు పెంచుకొని, అవి ఈడేరక- ఈడేరినా ఊరట చెందక- ఈలోగా మరికొన్ని ఆశలు చిగురించటంతో అంతరంగంలో సంఘర్షణ పెరిగి, అసంతృప్తితో కాలం వెళ్లబుచ్చుతున్నాడు.

విషయ వాంఛలు తీరేందుకు, వాటిని పదిలపరచుకొని పెంపొందించు కొనేందుకు పడే తాపత్రయంలో తన స్థితినితానుమరచి, భవిష్యత్తు భద్రతలు ప్రధానమై- భయ విద్వేషాలను తానుగా కొని తెచ్చుకొంటున్నాడేగాని, తద్వారా సుఖ సంతోషాలను పొందలేక (సమకూర్చుకోలేక) పోతున్నాడు.

సుఖ సంతోషాలు కరువైన మానవుడు నిస్పృహతో- పదార్థానికి ప్రయోజనం పరిమితమనే విషయం తెలుసుకోలేక- తెలుసుకొన్నా, ఆ లోటును భర్తీ చేసుకోలేని స్థితిలో ఊరటకోసం మత్తు పదార్థాలకో, మరొక అంశానికో అలవాటుపడి వాటికి కూడా బానిస అవుతున్నాడు.

కోర్కెలు పెంచుకొంటున్న మానవుడు ఒక సమస్యనుంచి మరొక సమస్యలో తగులుకొని, సమస్యల వలయంలో చిక్కుకుంటున్నాడేకాని, సాఫల్యం మాట అటుంచి సమస్యల బారినుంచి బయటపడలేకపోతున్నాడు.

ఆశ, మోహాలు మనిషిని పశువును చేస్తున్నాయి. అవి తీరేందుకు అవలంబించిన హింస దౌష్ట్యాల ద్వారా తన ప్రవృత్తిలో వచ్చిన మార్పును గుర్తించి నివృత్తి చేసుకోలేకపోతున్నాడు. ఈ ప్రవృత్తి తనను, ఇతరులను కూడా ఇబ్బంది పెడుతుందన్న విచక్షణ కూడా కోల్పోతున్నాడు.

విషయ వాంఛలు తీరక, తీరినా తనివి (మోజు) తీరక- లేదా వీటన్నింటికి అతీతమైన మరొక దానికోసం అన్వేషణ సాగించాడు. దానికి అధి భౌతికమని, అతిలోకమని, దైవమని, పరమావధి అని, అనంతమని, సత్యమని ఎన్నో పేర్లు పెట్టుకొని సాగించుతున్న అన్వేషణ ఫలితం ఒక శేషప్రశ్నగానే మిగిలింది. ఆ కోరు కొంటున్నది. ఎండమావిగా సాక్షాత్కరిస్తున్నదే కాని, దాన్ని అందుకోలేకపోతున్నాడు. అదను చూచి ఈప్సితార్థం తీర్చేవారు బయలుదేరారు. క్రమంగా మానవుడు తనకు అనుకూలమైన విశ్వాసాన్ని కుదుర్చుకొని, దాన్ని అంటిపెట్టుకొని ఉన్నాడు. ఎవరి నమ్మకాలు, విశ్వాసాలు, అభిమతాలు వారివికాగా ప్రచారాల ద్వారా అవి ప్రగాఢమై, కలహాలకు కారణమైనాయి. విశ్వాసాలను ప్రబోధించే సంస్థలు కూడా పెరిగాయి. మానవ సమాజం మాత్రం చీలికలు పేలికలు అయింది.

ఏదో ఒక విశ్వాసానికి కట్టుబడి తత్సంబంధమైన ప్రవర్తన నియమావళికి లోబడి ఉండటంవల్ల స్వయం ప్రతిపత్తిని కోల్పోయిన మానవుడు యాంత్రిక జీవనం గడుపుతున్నాడు. అట్టి జీవితం ఎవరో నిర్దేశించిందే కాని, తన ఆలోచనలతోగాని, నిర్ణయాలతోగాని సంబంధంలేనిది. వేల సంవత్సరాలుగా ఈ సంప్రదాయాలు పాతుకుపోయి మానవుని స్వేచ్ఛను హరించాయి. ఎదురు ప్రశ్నలేక తానున్న స్థితే సుఖ ప్రదమనే భ్రాంతిలో సర్దుకు పోతున్నాడు. ఆ బ్రతుకులో భవిష్యత్తు భద్రతల వంటి సౌకర్యాలు కుదుర్చుకొంటున్నాడు. ఈ ఊహాజనిత భవిష్యత్తు భద్రతలు వాస్తవ విరుద్ధమైనవి. సంప్రదాయాలు ఆచారాల అర్థం, అవసరం మరుగునపడి వివేచనలేక, అనుసరణే ప్రధానమవటంవల్ల ఈ కుదుర్చుకొన్న నమ్మకాలు- మూఢ నమ్మకాలుగా పరిణమించాయి. కాలానుగుణమైన మార్పు అనుకొంటున్నది పై మెరుగేకాని మూలంలో ఏవిధమైన మార్పూ రాలేదు.

విజ్ఞాన శాస్త్రం ఎంతో పెరిగిందనుకొంటున్న ఈనాటికీ మానవ మేధలో ఏవిధమైన మార్పూ రాలేదు. శతాబ్దాల తరబడి సంప్రదాయాలు, ఆచారాలు, వ్యవహారాలు- అంటూ మనసుకు బాగా మప్పి ఉండటంవల్ల, వేరు ఆలోచన, ప్రయత్నం చేయలేక మానవుడు ఆ ఉచ్చులోనుంచి తప్పించుకోలేకపోతున్నాడు.

మనం సమకూర్చుకొన్న విజ్ఞానం మన ఆలోచనల ద్వారానే సంక్రమించింది. ఆలోచనలు చేసే మనసు ఏనాడో స్వేచ్ఛను కోల్పోయింది. అనుభవాలు, జ్ఞాపకాలు, నియమాలు, నిబంధనలు, విశ్వాసాలు అంటిపెట్టుకొని ఉన్నంతకాలం మనసుకు విమోచనం ఉండదు. ఆ మూసలో బంధీకృతుడైన మానవుడు, అదే సుఖమనీ అదే సత్యమనీ నమ్ముతున్నాడు. జీవితమంటే ఇదే- వేరే పరమార్థం లేదు- అనే భావనలో మునిగి ఉన్నాడు.

సత్యానికి మార్గాలు లేవు- ఏ మతం ద్వారాకాని, మతశాఖ ద్వారాకాని, పథం ద్వారాకాని సత్యాన్ని చేరలేం- సత్యానికి అవధులు లేవు; అదుపు లేదు- దాన్ని చేరటానికి బాటలు నిర్మించలేం-అంటూ కృష్ణమూర్తి సత్యాన్వేషణకు, మతాలు విశ్వాసాలు సంస్థలు నిరుపయోగమని 1929లో తన కోసం ఏర్పాటైన తారక సంస్థను రద్దుపరుస్తూ చేసిన ప్రకటనలోనే ఖండితంగా తేల్చి చెప్పారు. కడవరకూ అదే మాటపై నిలచారు.

గతాన్ని పూర్తిగా విసర్జించినప్పుడే మనసు స్వేచ్ఛగా పనిచేయగలుగుతుంది. అందుకు కావలసింది జిజ్ఞాస. కోరిక బలీయమైనప్పుడు శక్తిదానంతట అదే పెరుగుతుంది. అలాగే జిజ్ఞాస, అవసరమైన శక్తిని సమకూర్చుకొంటుంది.

గతంనుంచి విడివడిన మనసు భావరహితంగా, శూన్యంగా, నిశ్చలంగా, స్వేచ్ఛగా ఉంటుంది. డమరుకంలోనుంచి ప్రణవనాదం ప్రభవించినట్లుగా, ఆ శూన్యంనుంచి సత్యవాక్ తరంగాలు పుట్టుకొస్తాయి. శూన్యంగా ఉంచటమంటే అందులోనికి ఏమీ చొర నివ్వకుండా ఉంచటమే. అదే భావరహిత స్థితి. అటువంటి మనసు ద్వారానే భద్రతను, స్తిమితాన్ని పొందవచ్చు. ఆ మనఃస్థితిలో భౌతిక జీవనానికి కావలసిన అవసరాలు తీరటమెలాగనే సందేహం కలుగవచ్చు. ఆ అవసరాలు తీరకుండా మనుగడ సాగించటం కూడా దుర్లభం. కాని అటువంటి భావరహిత మనఃస్థితిని అపేక్షిస్తూ ''ప్రాపంచిక విషయాలకు దూరం కావాలి; ఇదంతా కేవలం మాయ'' అనే ప్రచారం సాగుతున్నది.

భౌతికమైన సుఖాపేక్ష భద్రతల కన్నా మానసికమైన భద్రత, సుఖశాంతులు అవసరం. వాస్తవానికి అవి నేడు మనలో లుప్తమైనాయి. జీవితమంతా పోరాటాలమయం. ఆర్థిక, సాంఘిక, మతపరమైన పోరు సర్వత్రా సాగుతూనే ఉన్నది. అంతరంగంలో మానసికమైన సంపూర్ణ భద్రతను పొంది ఉన్నప్పుడు వాస్తవ ప్రపంచంలోని చేతన, ప్రవర్తన- నిశితంగా, వివేకంతో ఉంటాయి. నేను, నాది, ఫలానావాడిని- అనుకోవ టంలో భద్రతకన్నా అపాయమే ఎక్కువ. అంతాతానే అనుకోవటంలో సంపూర్ణ భద్రతకు అవకాశం ఉంటుంది. అటువంటి మనఃస్థితి సత్ప్రవర్త నకు వీలుకల్పిస్తుంది. అప్పుడు భయానికి తావుండదు. ద్వంద్వ ప్రవృతి లేకుండా మనసుకుదురుగా ఉన్నప్పుడు సత్యం విదితమవుతుంది.

'నేను' అనేది స్వాభిమానానికి సంబంధించిన ఒక భావోద్రేకం. ఆలోచనపరంగా అది మనసుకు సంబంధించినది. అభిమానం ఉద్రేకానికి సంబంధించినది. మనసును ఉద్రేకాన్ని సమతుల్యంగా ఉంచ గలిగినప్పుడు సత్యం విదితమవుతుంది. మనసుకు ఉద్రేకానికి మధ్య జరిగే సంఘర్షణ అర్థం కానప్పుడు భయం ముంచుకొస్తుంది. ఈ సంఘర్షణ నుంచి తప్పించుకొని ఉపశమనం పొందేందుకు దైవమని, దూతలని, సంరక్షకులని- అవాస్తవిక విషయాలను ఏర్పరచు కొంటున్నారు.

మనసుకు- ఉద్రేకానికి మధ్య సంఘర్షణ లేకుండేందుకు ప్రేమ కావాలి. మనకున్న ప్రేమానురాగాలు వ్యక్తిగతమైన ఇష్టాయిష్టాలకు సంబంధిం చినవి. స్వచ్ఛమైన ప్రేమను పొందటానికి మారుగా పూజలు, పునస్కా రాలు, ఆరాధనలు, అర్చనలు, క్రతువుల వంటి కర్మకాండలను ఆశ్రయిస్తున్నారు.

సత్యం మన ముందుకు రాదు. దాన్ని మనమే చేరుకోవాలి. సంస్థాగత విధానాలు, విశ్వాసాలు, స్వేచ్ఛకు ప్రతి బంధకాలు. స్వేచ్ఛను కోల్పోయిన మనసు ద్వారా సత్యాన్ని గ్రహించలేం. మనసు- హృదయం మాలిన్య రహితమై సహజంగా స్పష్టంగా ఉన్నప్పుడే ప్రేమ ఉదయిస్తుంది. అప్పుడే సత్యం గోచరిస్తుంది.

సత్యాన్ని చేరటానికి ఎవరికి వారే ప్రయత్నించాలి, సంస్థాగత విధానాలు నిష్ప్రయోజనాలు- అన్నది కృష్ణమూర్తి నిశ్చితాభిప్రాయం. ●

# 4

# చిత్తవృత్తి

మానవుల చిత్తవృత్తి బహు విచిత్రమయింది. ఈ చిత్తవృత్తిని గురించిన తర్క వితర్కాలు బహుధా మనం వింటూనేవున్నాం. వేదాంత గ్రంథాలు, యోగశాస్త్రాలు, పురాణేతి హాసాలు, ప్రవక్తల ప్రవచనాలు, ఆధునిక శాస్త్రజ్ఞుల విశ్లేషణలు చిత్తవృత్తి వైచిత్రిని చిత్రాతిచిత్రంగా చిత్రించుతున్నాయి.

చిత్తమంటే మనసు. మానవుడు బుద్ధి జీవి. మనసులో కల్మషం చేరటంతో మానవుల బ్రతుకులు కూడా కల్మషపూరిత మయ్యాయి. మనప్రవర్తనలకు మూలం మన మనసులు. సాంకేతికపరంగా ప్రపంచం ఎంతో అభివృద్ధిని సాధించినా మానవుని మౌలికమైన ఆలోచనా విధానంలో ఏ మార్పూరాలేదు. మానవజాతి సమస్తం ఒకే విధమయిన ఆలోచనా పథంలో పయనిస్తున్నదన్నది వాస్తవం. శక్తి సామర్థ్యాలు, విజ్ఞానానుభవాలు, దేశాచార విశేషాలనన్నుసరించి స్థాయీ భేదం తప్పించి మనోదృక్పథాలలో మౌలికంగా ఏ కోశానా లవలేశం కూడా మార్పు రాలేదు. ఈ ఉచ్చులో మనం చిక్కుకు పోయామన్న వాస్తవాన్ని గ్రహించి విముక్తి చెందాలి-అంటారు కృష్ణమూర్తి.

మానవ జీవితం యాంత్రికంగా మారింది. ముందుగా రూపొందించు కొన్న ఒక కార్యక్రమానుసారం మానవులు ప్రవర్తించటం వల్ల- జీవన, భౌతిక, మానసిక, వివేకపరంగా మానవులు ఏదో ఒక ప్రవర్తన నియమావళికి బద్ధులైనారు. 'కంప్యూటర్లు' కూడా విజ్ఞాన శాస్త్రవేత్తలు ముందుగా నిర్ణయించిన కార్యక్రమానుసారం పని చేస్తున్నాయి. క్రమంగా మానవుడు ఆలోచనకు దూరమై కంప్యూటర్లపై ఆధార పడుతున్నాడు. విజ్ఞాన శాస్త్రం శీఘ్రగతిలో వృద్ధి చెందుతున్న ఈ తరుణంలో బుద్ధి చురుకుతనం కోల్పోయి, మానవుడు తన పనినే తాను చేసుకోలేనిస్థాయికి దిగిపోతు న్నాడు. త్వరలో మర మనుషులు **(Robbots)** రంగంలోకి దిగనున్నారు. అప్పుడు మనిషికి అవసరానికి మించిన విశ్రాంతి, తద్వారా బుద్ధి మాంద్యం సంక్రమించనున్నాయి. కాని యంత్రాలు ఎంత సమర్థంగా, సుళువుగా,

త్వరగా పనులు చేయగలిగినా 'సృజన' స్థాయికి చేరుకోలేవు. కొన్ని అంశాలలో మాత్రం అవి మానవ మేధను తలదన్నే స్థాయికి చేరుకోగలవు.

ఒక విధంగా మానవమేధ- అంటే మెదడు కూడా కంప్యూటరు వంటిదే. మనసువేరు; మెదడు వేరు- అన్న విషయం గుర్తుంచుకోవాలి. మెదడు- అనుభవాల, జ్ఞాపకాల, విజ్ఞానసముదాయాల కోశం. దానికున్న భావ పరిధి కూడా పరిమితం. కంప్యూటరులో ఎన్నో విశేషాంశాలు నిక్షిప్తం చేసినా అవి మానవ మేధకు మాత్రమే పరిమితమయి ఉండటం వల్ల దాని సామర్థ్యం కూడా పరిమితమే. కాకుంటే మానవశక్తి సామర్థ్యాలకతీతంగా ఎంతో వేగంగా, చురుకుగా అవి పనిచేయగలుగుతున్నాయి. మానవ నిర్మిత యంత్రానికి క్రమంగా మానవుడే బానిస అవుతున్నాడనే విషయాన్ని గ్రహించాలి.

మానవ శరీర అవయవ నిర్మాణంలో మెదడు తలమానికం. భౌతికంగా కనిపించే స్థూలశరీరంలో నాడీమండలం ముఖ్యమయింది. ఈ నాడీ మండలం శరీరంలోని అవయవాల చలనానికి, విధినిర్వహణలకు బాధ్యతవహిస్తాయి. ఈ నాడులు చిన్న, పెద్ద కలుపుకొని మొత్తం 72,000 నుంచి 3,50,000 వరకూ శరీరంలో వివిధ ప్రాంతాలలో ఉంటాయని శాస్త్రవేత్తల అంచనా. నాడులు దారపు పోగుల్లా ఉండే నాళాలు. మెదడునుంచి 12 జతలు, వెన్నుపాము నుంచి 31 జతల నాడులు బయలుదేరి జ్ఞానేంద్రియాలకు, కండరాలకు, గ్రంథులకు విస్తరిస్తాయి.

జ్ఞానేంద్రియాలనుంచి, మెదడుకు వార్తలను పంపేవి బోధక నాడులు. మెదడు నుంచి కండరాలకు గ్రంథులకు వార్తలను, సందేశాలను తీసుకుపోయేవి ప్రవర్తక నాడులు. నాడుల ద్వారా జీవశక్తి, ప్రాణశక్తి ప్రవహిస్తుంటాయి. ఈ నాడులకు శరీరంలో కొన్ని కూడలు లున్నాయి. వాటినే మండలాలు అంటారు. ప్రతి నాడీమండలం కొన్ని నాడుల సంగమ కేంద్రం.

నాడీ మండలాలలో ప్రధానమైనవి- మెదడు, వెన్నుపాము, కాక ఈ రెండింటితో ప్రత్యక్ష పరోక్షసంబంధం కలిగిన ఇతర మండలాలు.

మెదడును శాస్త్రవేత్తలు మూడు ప్రధాన భాగాలుగా గుర్తించారు. అవి- పెద్దమెదడు, చిన్నమెదడు, మజ్జ.

పెద్ద మెదడు కపాలం (పుర్రె) ముందు భాగంలోను, చిన్నమెదడు వెనుక భాగంలోను, మజ్జ ఈ రెండింటికి మధ్య దిగువ భాగాన ఉంటుంది. ఈ మజ్జనుంచే వెన్నుపాము ప్రారంభమవుతుంది.

పెద్ద మెదడు ఆలోచన, సంకల్పం, జ్ఞాపకశక్తి, తెలివితేటలకు స్థావరం. శ్రవణ, దృశ్య, వాక్ కేంద్రాలు పెద్ద మెదడులో ఉంటాయి. ఇది జ్ఞానేంద్రియాలనుంచి వచ్చిన వార్తలను గ్రహించి కాళ్లు, చేతులు, ఇతర కర్మేంద్రియాలకు ఆజ్ఞలను జారీ చేస్తుంటుంది. స్పృహలో ఉండి చేసేపనులు ఈ పెద్ద మెదడు ఆజ్ఞానుసారం జరుగుతుంటాయి. పెద్ద మెదడుకు దెబ్బ తగిలినప్పుడు స్పృహ తప్పుతుంది.

చిన్న మెదడు కండరాల నన్నింటినీ సమన్వయపరచి శరీరంలోని వివిధ అవయవాల చేత పని చేయిస్తుంది. చిన్న మెదడుకు దెబ్బ తగిలితే కండరాలు సక్రమంగా పనిచేయవు. ఈ చిన్న మెదడులోనే సుషుప్తి స్వప్న కాలాలలో మనసు విశ్రాంతి తీసుకుంటుంది.

మజ్జ మెదడుతో సంప్రదించే అవసరం లేనికార్యాలను సర్వకాల సర్వావస్థలలోను నిర్వహిస్తుంటుంది. మజ్జకు దెబ్బ తగిలినప్పుడు గుండె, ఊపిరితిత్తులు పనిచేయటం ఆగి, మృత్యువును చేరు కొంటారు.

మానవ శరీరంలో అయిదు జ్ఞానేంద్రియాలున్నాయి. అవి- ముక్కు కేంద్రంగా ఘ్రాణేంద్రియం, నాలుక కేంద్రంగా రసనేంద్రియం, కళ్లుకేంద్రంగా చక్షురింద్రియం, చర్మంద్వారా త్వగింద్రియం, చెవులు కేంద్రంగా శ్రోత్రేంద్రియం. వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ- అనేవి కర్మేంద్రియాలు.

జ్ఞానేంద్రియాలు, మెదడు- పరస్పర అవగాహన సహకారాలతో పని చేస్తుంటాయి. జ్ఞానేంద్రియాలతోనే మెదడు ముఖ్యమైన కార్యాలను నిర్వహిస్తుంటుంది. జీవరాసులలో మానవుడు తన బుద్ధి విశేషం వల్ల ఉన్నత స్థానాన్ని అధిరోహించాడు.

శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం- నాలుకలో 3000 రస గ్రంథులు న్నట్లు, అవన్నీ మెదడుతో నాడుల ద్వారా కలసి ఉన్నట్లు తెలుస్తున్నది. చెవులకు 1,00,000 రకాల శబ్ద తరంగాలను మెదడుకు తెలిపే శక్తి ప్రతి కన్నూ 13,00,00,000 రకాల కాంతి పుంజాలను గ్రహించి మెదడులో

ప్రసరించే శక్తి ఉన్నట్లు, రెండు కళ్లూ పరస్పర అవగాహనతో మెదడుకు కాంతి పుంజాలను ఒకే సారిగా కాక చిన్న సముదాయాలలో పంపగలిగే సామర్థ్యం ఉన్నట్లు తెలుస్తున్నది. చర్మానికి శరీరమంతా వివిధ కేంద్ర బిందువుల ద్వారా స్పర్శను గ్రహించే శక్తి ఉన్నట్లు, అందులో 30,000 ఉష్ణ గ్రహణ కేంద్రాలు, 2,50,000 శీతలగ్రహణ కేంద్రాలు, 5,00,000 స్పర్శకేంద్ర బిందువులు ఉన్నట్లు తెలుస్తున్నది. ముక్కు ఆఘ్రాణ శక్తి అమోఘమని, అసంఖ్యాకమైన వాసనోద్రేకాలను పసిగట్టగల సామర్థ్యం ఉన్నట్లు కూడా శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు. కన్ను, చెవి పనిచేయక పోయినా ఘ్రాణ శక్తి ద్వారా పరిసరాలను ఇట్టే పసిగట్ట వచ్చునని మనకు అనుభవం ద్వారాను, దృష్టాంతాల ద్వారాను విశదమవుతున్నది.

ఈ జ్ఞానేంద్రియాలను సంధించి పని చేసే మెదడు చాలా సమర్థమయిందే గాక, బహు సున్నితమయింది. ప్రతి సెకనుకు ఎన్నో వేల సందేశాలను, సంకేతాలను, ఇంద్రియ జ్ఞాన విశేషాలను నాడుల ద్వారా గ్రహించి శరీరంలోని వివిధ భాగాలకు నిరవధికంగా తగు సూచన లిస్తుంటుంది. అంతేగాక, దానికి అమోఘమయిన జ్ఞాపక శక్తి కూడా ఉన్నది. అనుభవాలను నమోదు చేసుకొని, జ్ఞాపకాల ద్వారా హెచ్చరికలు చేస్తుంటుంది.

చిన్న మెదడును పాత మెదడు అని, పెద్ద మెదడును క్రొత్త మెదడు అని కూడా వ్యవహరిస్తుంటారు. చిన్న మెదడులో గత అనుభవాలు, స్మృతులు నిక్షిప్తమై వుంటాయని, పెద్ద మెదడు క్రొత్త అనుభవ విశేషాలను గ్రహిస్తుంటుందని, పెద్ద మెదడునుంచి చిన్న మెదడుకు క్రొత్త అనుభవాలు వచ్చి చేరుతుంటాయని శాస్త్రకారుల అభిప్రాయం. అయితే అనుభవాలు, జ్ఞాపకాల పరంగా క్రొత్త, పాత అని మెదడును విభజించటం కష్టం. మెదడును గురించిన పూర్తి అవగాహన శాస్త్ర వేత్తల కింకా కుదర లేదు. అది పని చేస్తున్న విధానాన్ననుసరించి స్థూలమైన అభిప్రాయం మాత్రం ఏర్పరచు కోటానికి సాధ్యమవుతున్నది.

మెదడును కంప్యూటరుతో పోల్చ వచ్చునే గాని, మెదడుకున్న సామర్థ్యం మాత్రం కంప్యూటరుకు లేదనేది నిర్వివాదాంశం. మనం అందించే సమాచారాన్ని బట్టే కంప్యూటరు ద్వారా ఫలితాలు పొందవచ్చు. అసందిగ్ధ

సమాచారానికి, అందుకు తగ్గ సమాధానాలే వస్తాయి. మానవ మేధకు కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది. కంప్యూటరుతో పోలిస్తే మెదడుకున్న శక్తి ఉపకరణాలు, తదంగాలు ఎంతో విస్తృతమయినవి. ప్రపంచంలోని చాలా శక్తివంతమైన కంప్యూటరు కన్న మెదడుకున్న జ్ఞానశక్తి ఎన్నో వేల, లక్షల రెట్లు అపారం.

మెదడు మనసుకు వర్తమానాలను అందిస్తుంది. మనసు మెదడుకు ఆదేశాలను ఇస్తుంది. ఆలోచనలకు సంబంధించి, మెదడు వస్తు ప్రధానమైతే, మనసు భావప్రధాన మయింది. మెదడు మనసుకు తన చైతన్య క్రియకు ఉపకరించే ఒక సాధనం వంటిది. అసంకల్పిత ప్రతీకార చర్యలో మనసు ప్రమేయం తక్కువ. సంకల్పిత ప్రతీకార చర్యలో మనసు ప్రమేయం ఉండితీరుతుంది.

మెదడులో పేరుకొన్న అనుభవాలు, జ్ఞాపకాలు - మనసు స్వేచ్ఛగా ఆలోచించటానికి ప్రతిబంధక మవుతాయి. ఒక్కొక్క సారి మెదడు దెబ్బతిన్నా ఈ అనుభవాలు, జ్ఞాపకాలు చెక్కుచెదరక అట్టేపెట్టుకొని ఉంటాయి. మనసు నేరుగా గ్రహించి తెలుసుకోటానికి ఈ గత అనుభవాలు, జ్ఞాపకాలు అవరోధక మవుతున్నాయి- అంటారు కృష్ణమూర్తి. ఎఱుక, అప్రమత్తతల ద్వారా మనం ఈ పరిస్థితిని ఎదుర్కోవచ్చును (అతిగమించ వచ్చును) అంటారు. అందుకు మనస్సు నిర్మలంగా, నిశ్చలంగా ఉండాలి. అది ప్రయత్న పూర్వకంగా కాక, సహజంగా, స్వతస్సిద్ధంగా సిద్ధించాలంటారు. మెదడు, మనసు కలసి, అందుకు ఒకే విధంగా సమరసంతో పనిచేయగలిగినప్పుడు ఆ స్థితి సిద్ధిస్తుంది.

సిగ్మన్ ఫ్రాయిడ్ చెప్పిన మానసిక విశ్లేషణ సిద్ధాంతాలను కృష్ణమూర్తి అంగీకరించలేదు. మానసిక చికిత్సలో ఫ్రాయిడ్ ప్రతిపాదించిన అహం **(Ego)**, అతిశయం, **(Super Ego)**ల ద్వారా వ్యక్తిని మానసిక, సామాజిక స్థాయికి అనుగుణంగా సరి దిద్దే ప్రయత్నాలు జరిగాయి. అందులో మానసిక శాస్త్రజ్ఞులు కృతకృత్యులయ్యారు. ఈ ప్రయత్నం ద్వారా మనిషి తానుగా ఎదిగే స్వేచ్ఛను కోల్పోయి, మనసును గతంతోనే ముడిపడేటట్లు చేయటంతో ఆ గత అనుభవాలు, జ్ఞాపకాలు, అవాస్తవాల ఉచ్చులలో చిక్కుకొని, సదవగాహన, సదసద్వివేకాలకు దూరమై, పూర్ణ మానవుడుగా వికసించ లేడన్నదే కృష్ణమూర్తి వాదన.

మనస్తత్వ వేత్తలు ప్రతిపాదించిన మానసిక చైతన్య విభజనను కూడా కృష్ణమూర్తి అంగీకరించ లేదు. సచేతన (Consciousness) అపగత చేతన లేక అవచేతన (Unconsciousness), సుప్త చేతన (Sub Consciousness)- జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ, - అనేవిభజన సమంజసం కాదని, సచేత మనసును అపగత మనసు నుంచి విడదీయటంలో ఔచిత్యం లేదంటూ, మొత్తం చేతన ఒకే మనసుకు సంబంధించిందంటారు. మన ఆలోచనలోని విభజన భావాన్నే ఇది ఎత్తి చూపుతోందంటూ, మానసిక స్థాయిలకు వివరణ ఇచ్చారు.

మనసులోని పైపొరలు మనం ఉన్న సమాజానికి, అవలంబించిన సంస్కృతి సంస్కారాలకు, మన అవసరాలకు అనుగుణంగా శిక్షణ ఇచ్చి అభ్యసింప జేసి, అదుపు ఆజ్ఞలకు గురిచేశాం. వేల సంవత్సరాలుగా మానవ మేధను ఈ హింసకు గురిచేశాం. కాగా లోపలి పొరలు అందుకు భిన్నంగా ఉంటాయనుకోలేం. అయితే లోపలి పొరలలో క్రొత్తవిషయాలు తెలుసుకోటానికి అవసరమైన సాధన సంపత్తి లభ్యమయ్యే అవకాశం ఉంటుంది. పైపొరలు స్వేచ్ఛను కోల్పోయి, యాంత్రికంగా తయారై ఎదగ లేక, ఎగర లేక, అదుపు ఆజ్ఞలకు లోనై అనుసరిస్తూ లేదా అనుకరిస్తూ, ఒకే గాటిలో నడుస్తున్నాయి. లోపలి పొరలకు ఈ స్థితి దాపురించనప్పుడు వాటిలో నూతన తేజస్సును ఆవిష్కరించటానికి అవకాశం వుంటుంది.

మెదడు ఏపుగా పెరిగిన కీకారణ్యం వంటిది. గతంలోని ఊహలు, అనుభవాలు, భావాలు, జ్ఞాపకాలు ముప్పిరిగొని ఉండటమేగాక చొరరాని నిగూఢమైన ప్రదేశాలు, తావులు కూడా అందులో ఉన్నాయి. చూచిన ప్రతి సన్నివేశం ఛాయా చిత్రంలా మెదడుకు చేరుకొంటుంది. చలన చిత్రంలోని సన్నివేశాలులా ఇవి మెదడు ద్వారా దృశ్య మానమవుతాయి. అవసరమైనప్పుడు తిరిగి పరిటెనుంచి (Reel) చుట్ట విప్పుకొని చిత్రాలు కదలి మనసుకు గోచరిస్తాయి. అంతవరకు అవి మెదడులో నిక్షిప్తాలై ఉంటాయి. కొన్ని దృశ్యాలు క్రమంగా స్మృతి పథం నుంచి తొలగిపోతాయి. పొందిన అనుభవాలు, ఉన్నవి ఉన్నట్లుగా మెదడులో జ్ఞాపకాల పొరలలో నిలువ వుంటాయి.

జాగ్రదవస్థలో, కంటితో చూచిన ప్రతి వస్తు విశేషమూ సన్నివేశాలుగా నాడుల ద్వారా మెదడుకు చేరుకొంటుంది. తల క్రిందుగా మెదడుకు చేరుకొన్న చిత్రాలు మనసు అనే తెరపై కంటికి కనుపించిన రీతిగా ప్రతిబింబిస్తాయి. అలాగే మిగిలిన జ్ఞానేంద్రియాలు తమ అనుభవాలను మెదడుకు చేరవేస్తాయి. ఈ జ్ఞానేంద్రియాల శక్తి సామర్థ్యాలననుసరించే నాడుల ద్వారా మెదడుకు చేరిన విషయాలు కూడా ఉంటాయి. ఈ జ్ఞానేంద్రియాలు కేవలం పరికరాలు మాత్రమే. చూచేది కన్ను కాదు. చూచే వస్తువు కంటి ద్వారా మెదడుకు బింబాకృతిలో చేరి, ఆపైన తెరపై ప్రతిబింబిస్తుంది. మెదడు ద్వారా మనసు విషయాన్ని గ్రహిస్తుంది. అలాగే ఇతర జ్ఞానేంద్రియాలు కూడా సేకరించిన విషయాలను మెదడుకు చేరవేస్తాయి.

జ్ఞానేంద్రియాల నుంచి చేరిన విశేషాలను మెదడు సమన్వయ పరచి విషయ గోచరం చేస్తుంది. ఈ క్రియను గ్రహణం లేక గ్రాహ్యత అని కూడా అంటారు. అంటే విషయ గ్రహణం అనేది ఉన్నది ఉన్నట్లుగా గుర్తించటమని తెలుస్తున్నది. మెదడు గ్రహించిన విషయాలు మనసు ద్వారా విశదమవుతాయి. ముఖ్యంగా జ్ఞానేంద్రియాలకు సంబంధించినంత వరకూ మెదడుకు చేరిన సమాచారాన్ని మనసే వివరిస్తూంటుంది. కర్మేంద్రియాలకు సంబంధించి మనసు నిమిత్తం పరిమితం. జ్ఞానేంద్రియాల నుంచి వచ్చిన సమాచారాన్ని మెదడు క్రమగతం చేసి మనసుకు అందించే పరివర్తన గ్రాహక క్రియలలో మెదడులో ఒక్కొక్క మారు అవరోధాలు కలుగుతుంటాయి. మనసు అద్భుతగలటం వల్లగాని, మెదడులో అంతకు ముందే చేరి నమోదయిన పూర్వ విశేషాల వల్ల కాని ఇటువంటి అవరోధాలు కలుగుతుంటాయి.

శరీరం ఎన్నో జీవకణాల సముదాయం. మెదడులో కూడా ఎన్నో జీవకణాలున్నాయి. ఈ కణాలలో జీవశక్తి చైతన్య శక్తి ప్రాణశక్తి ఉంటాయి. ఎన్నో కణాలు విచ్ఛిన్న మవటం ద్వారా శక్తి ఉద్భవిస్తుంది. వాటి స్థానంలో తిరిగి మరికొన్ని క్రొత్తకణాలు ఏర్పడుతాయి. ఇలా కణాల ఉత్పత్తి, విచ్ఛిత్తి బ్రతికినంతకాలం సర్వావస్థలలోనూ సాగుతుంటుంది. వయసు తరిగే కొద్ది జీవకణాల ఉత్పత్తి తరిగి పోతుంది. మెదడులోని జీవకణాలలో

గతస్మృతులు, అనుభవాలు నిక్షిప్తమై ఉంటాయి. ఇవి క్రొత్త విషయాలను గ్రహించేందుకు అవరోధకమవుతాయి. నియమనిబంధనలు, పాత విషయాల గుర్తింపు వంటి ప్రతిబంధకాలనుంచి విముక్తి చెంది మానవుడు స్వేచ్ఛను పొందాలంటే మెదడులో పేరుకు పోయిన ఈ పాత కణాల విచ్ఛిత్తి, వినాశం తప్పనిసరి అవుతుంది. వాటి స్థానాలలో తిరిగి క్రొత్తకణాలు ప్రవేశించాలి. అప్పుడు మెదడు గతం నుంచి విడివడి స్వచ్ఛంగా ఉంటుంది. కృష్ణమూర్తి ఈ పరివర్తన దశకు **(Mutation)** ఎంతో ప్రాధాన్యం ఇచ్చారు. అటువంటి పరివర్తన పొందిన మెదడు స్వేచ్ఛగా సత్యాన్వేషణకు అనుకూలంగా ఉంటుంది. పాత విషయాలకు, ముందుగా ఏర్పరచు కొన్న అభిప్రాయాలకు అందులో తావుండదు.

వ్యవసాయ క్షేత్రాన్ని రాళ్లూ, రప్పలు, బీడు, కలుపుమొక్కలు లేకుండా బాగా దున్ని చదును చేసినప్పుడే వేసిన విత్తనం అంకురించి, మొక్కగా పాదుకొని, మ్రానుగా ఎదుగుతుంది. నమ్మకాలు, విశ్వాసాలు, కట్టుబాట్లు, నియమాలు, నిబంధనలు, వ్యవస్థల నుంచి మనస్సును ఖాళీగా ఉంచగలిగినప్పుడే సదసద్వివేకంతో స్వేచ్ఛాయుత వాతావరణంలో సత్యా న్వేషణ చేయటానికి అనుకూలంగా ఉంటుంది. అయితే మనసులో పేరుకు పోయిన వాటిని వదలించు కోవటం ఎలాగన్న ప్రశ్నకు కృష్ణమూర్తి-ముందుగా మనసులో నెలకొన్న స్థితిని ఎఱుక పరచుకోవాలంటారు. ఆ పరిస్థితిని గమనించటం ద్వారానే మనం వాటి నుంచి విముక్తి పొందగల మనటంలోని ఔచిత్యం మనకు ప్రశ్నార్థకంగా గోచరమవుతుంది.

మనం దేనినీ ఉన్నది ఉన్నట్లుగా చూచి గ్రహించ లేక పోతున్నాం. ఆ చూచే దానిని గురించిన అభిప్రాయం మన మనసులో ముందుగా పాతుకొని ఉండటం వల్ల దాని యథార్థ స్థితిని గమనించ లేకపోతున్నాం. మనకు, మనం చూచే దానికి మధ్య మనం ఏర్పరచు కొన్న కొలమానం అడ్డుతగులుతున్నది. ఆ కొలమానం అవసరాన్ని తప్పించి మనం సూటిగా చూడగలిగినప్పుడు సత్యం గోచర మవుతుంది. ఆ స్థితిలో చూచేది; చూచేవాడు- అలాగే గ్రహించేది, గ్రహించేవాడు- మధ్య విభజన లేకుండా ఒకటేనని విశదమవుతుందంటారు. మన గ్రహణ శక్తిలోని లోపాలకు కారణం మనసు. ఆ మనసు తనకున్న నియమిత పరిధిలోనే సంచరిస్తూ,

గత అనుభవాలు, స్మృతుల ద్వారానే విషయగ్రహణ చేయటం వల్ల విభజించి చూడగలుగుతుందే కాని, సంపూర్ణంగా, ఉన్నది ఉన్నట్లుగా నేరుగా గ్రహించలేక పోతుందంటారు. ఇష్టాయిష్టాలు, విభజనలు లేకుండా గతం నుంచి విడివడి- మనసు నేరుగా గ్రహించి తెలుసుకో గలగాలి. అందుకు వివేకాన్ని మేల్కొలపాలి. సదసద్వివేకం ద్వారానే మనసు సత్యాన్ని గ్రహిస్తుంది. మనః పరిధిలో గాక, అందుకు అతీతంగా మనం కాంచ గలగాలి. అప్పుడు పూర్ణ స్వరూపం ఆవిష్కృతమవుతుంది. ఆ స్థితిలో ద్వంద్వాలోచనలకు, ద్వంద్వ ప్రవృత్తులకు తావుండదు.

ప్రశాంత చిత్తం లేక నిశ్చల మనసుకు కృష్ణమూర్తి ఎంతో ప్రాధాన్యం ఇచ్చారు. ప్రశాంత చిత్తం- సుప్త చేతనకు, అపగత చేతనకు భిన్నమయింది. అది మనసులో ఏ ఆలోచనా లేకుండా ఖాళీగా ఉంచగలిగిన స్థితి. అలాగని చేతనారహిత స్థితి కూడా కాదు- సత్యాన్ని గ్రహించే తీక్ష్ణమైన, స్వచ్ఛమైన చైతన్య స్థితి అది. జాగ్రదవస్థలో చేతన ప్రాధాన్యం వహిస్తుంది. ప్రశాంత చిత్తం మనసులోని చేతన క్రియను గమనిస్తున్నప్పటికీ దానితో సంబంధం లేకుండా ఉంటుంది. సచేతన మనసులోని ఆలోచనా స్రవంతిని తెలుసుకొం టున్నప్పటికీ వాటివిలువ, ప్రాధాన్యం, ప్రత్యేకతల వంటి ఊసు లేకుండా కేవలం వాటి గమనాన్ని మాత్రమే పరిశీలిస్తుంటుంది, ప్రశాంత చిత్తం. ఆ స్థితిలో మనసులోని ఆలోచనలను త్రోసిరాజనే ప్రసక్తి కూడా లేదు. ఒక విధంగా ఇది మనసులోని చేతన స్థాయిల హద్దులను ఛేదించే ప్రకియ. తద్వారా త్రివిధ చేతనావస్థల మధ్య ఆలోచనలు సాగి, మానసిక సమస్యలు విడిపోతాయి. అపగత చేతనలోని అంతర్జ్ఞానం, సృజనలు వికసించి అనుభవైక వేద్యమూ, బుద్ధి పూర్వకమూనైన సమస్యలు కూడా పరిష్కారమవుతాయి.

మనం ఎంతకప్పిపుచ్చినా మనసులోని సంక్షోభం, భయద్వేషాలు, భద్రతాందోళనలు ఏదో రూపంలో బహిర్గతమవుతాయి. వీటికి కారణం తెలుసుకొని వదలించుకొంటేనే కాని ప్రశాంత స్థితిని చేరుకోలేం. వీటన్నింటికీ మూలకారణం మన ఆలోచనలు. ఏ ఆలోచనా లేకుండా మనిషి ప్రశాంతంగా ఉండలేక పోతున్నాడు. ఒంటరితనం మనిషిని పిరికి వాడిని చేస్తున్నది.

మనసులోని జ్ఞాపకాలకు ప్రతిస్పందనల ద్వారా, ప్రతిచర్యల ద్వారా ఆలోచనలు ఉద్భవిస్తాయి. అనుభవాల వల్ల సంతరించుకొన్న విజ్ఞానం మెదడులో పేరుకొని జ్ఞాపకాలుగా నిక్షిప్తమై ఉంటాయి. వాటికి స్పందించి, మరికొంత జ్ఞానాన్ని సేకరించుకొంటాం. అది కూడా మెదడుకు మప్పుతాం. ఇలా- అనుభవం, జ్ఞానం, జ్ఞాపకం, ఆలోచన, చర్య- ఒకటి వెంట ఒకటి బరిలోదిగి చర్విత చరణంగా చేసిన పనే చేసుకొంటూ పోతాం. కడకు ఈ వలయం ఎక్కడ ఆగుతుంది- అనేది ప్రశ్న.

బాధకు, వ్యధకు కారణాన్ని తెలుసుకొని దాన్ని అతిగమించటం గాక ఎటుకపరచు కొంటే గాని, వాటినుంచి విముక్తి పొందలేం. ఇది మన ఆలోచనల క్రమంలో ఒక ఘట్టం. ఈ జ్ఞానం, ఈ అనుభవం, కాలానికి సంబంధించినవి. కనుక, ఈ వలయంలో కాలం కూడా వచ్చి చేరుతున్నది. ఆలోచనకు హద్దు ఉన్నది. ఆ ఆలోచన ఆధారంగా చేసే చర్య కూడా కాలానికి పరిమితమై ఉంటుంది. తద్వారా విభజన, సంఘర్షణ అనివార్యమవుతున్నాయి.

కృష్ణమూర్తి దృష్టిలో 'కాలం' అంటే కేవలం- పగలు, రాత్రి, గంటలు, నిమిషాల వంటి కాల మానానికి సంబంధించినవేగాక, మనోగత కాలం ప్రముఖమైనది. భూతకాలం నుంచి భవిష్యత్ కాలానికి చెందే పరివర్తన దశలో వర్తమానం అనేది ఒక మజిలీ. ఈ క్షణం- మరొక క్షణంలో భూతకాలంగా పరివర్తితమవుతుంది. ఈ క్షణంలో కాలం స్తంభించి పోతుంది. మనోగతమైన ఆ క్షణంలో కాలానికి తావు లేదు. సమస్య కాలానికి సంబంధించినది. ఆ కాలమే సమస్యను పొడిగిస్తుంది. కనుక సమస్యకు పరిష్కారం ఏతత్ క్షణమే కనుగొనాలి. జీవన సమస్యలకు తత్ క్షణ పరిష్కార మార్గం అనివార్య మవుతున్నది. ఆలోచనకు, ఆచరణకు గల మధ్యనున్న త్రుటివిరామ కాలమే మనోగత కాలమని కృష్ణమూర్తి ఒక క్రొత్తకాలప్రమాణాన్ని ప్రవేశ పెట్టారు.

పుట్టింది మొదలు జీవితాంతం- పోరాటాలు, వైరుధ్యాలతో మనుగడ సాగిస్తున్నాం. వాటినుంచి తప్పించు కోవాలని చేసే ప్రయత్నాలన్నీ మరికొన్ని వైరుధ్యాలకు హేతువులవుతున్నాయి. ఈ సంఘర్షణకు మూలం ఆలోచన- అన్న విషయాన్ని తెలుసుకోలేక సంకుల సమరంలో చిక్కుకు

పోతున్నాం. ఆలోచన స్వభావాన్ని తెలుసుకొని, ఆ ఉచ్చులో నుంచి బయట పడితేనే గాని మనసమస్యలు, వైరుధ్యాలు, పోరాటాలు పరిష్కారం కావు.

జ్ఞాపకాలను కృష్ణమూర్తి యథాగతమైనవి, మనోగతమైనవిగా చెప్తుతూ- యథాగత జ్ఞాపకాలు **(Factual Memories)** మన నిత్యజీవనానికి అవసరమే కాని, మనోగత జ్ఞాపకాల వల్ల సమస్యలు ఉత్పన్నమయ్యే ప్రమాదం ఉందన్నారు. యథాగత జ్ఞాపకాలు మనిషి దైనందిన జీవితాన్ని సమర్థంగా గడిపేందుకు ఎంతో అవసరం. ఆ జ్ఞాపకాలు మనిషిని వదలినప్పటికీ సుఖంగా జీవించే ఆస్కారం ఉన్నది. కాని, అవి మరీ కుదించుకు పోతే ఇతరుల సహాయాన్ని అర్థించ వలసి ఉంటుంది. అలాగాక ఎవరికి వారే స్వయంగా పనులు చేసుకొనేందుకు, నడవడికి, సాధారణ జీవిత నిర్వహణకు యథాగత జ్ఞాపకాల అవసరం ఎంతయినా ఉంటుంది. మనోగత జ్ఞాపకాలు మనల్ని అంటి పెట్టుకొని ఉండటం వల్ల జీవితం యాంత్రికంగా మారటమే గాక, క్రొత్త సమస్యలను, సవాళ్లను ఎదుర్కో- టంలో గత అనుభవాలు, జ్ఞాపకాల ద్వారానే పరిష్కరించు కోవటం వల్ల, అందులో నవ్యత, ప్రత్యేకతలు మరుగై, రొకటిపోటగా, పేలవలంగా ఉంటుంది. పైగా గతం మనిషిని కృంగదీస్తుంది. గత స్మృతులు, అనుభవాలు, జ్ఞాపకాలు- పేరుకుపోయి, వాటి అదుపు ఆజ్ఞలకు లోనైన జీవితంలో స్వేచ్ఛ కరువైపోతుంది. అందుకే కృష్ణమూర్తి మనోగత స్మృతులు, అనుభూతులు, ఆలోచనలను వదలించుకోవాలంటారు. గతంతో ముడిపడిన మనసు ఎదిగే స్థాయిని కోల్పోతుంది.

మన బాధలకు కారణం మనం అవలంబించే ద్వంద్వ ప్రవృత్తి. ఈ ద్వంద్వ ప్రవృత్తి ద్వారా మన అనుభవాలు వేరు, మనం వేరు అని ఊహించుకొంటాం. అనుభవం- అనుభవించేవాడు రెండూ ఒకటేననే సత్యాన్ని తెలుసుకోవాలి. గత స్మృతుల ద్వారానే మనం వ్యవహరిస్తున్నాం. ఆ స్మృతుల ద్వారానే మనుగడ సాగిస్తున్నాం. ఆ స్మృతుల వల్లనే 'నేను' అనే భావన కలుగుతోంది. ఈ 'నేను' కేంద్రంగా జీవితాన్ని వెళ్లదీస్తు న్నాము. ఈ 'నేను' అనే భావనే ఇతర ప్రపంచం నుంచి మనిషిని వేరు చేస్తున్నది. ఈ 'నేను' అనే గూటి నుంచి బయటపడినప్పుడు

అంతరాలు తొలగిపోతాయి. సంకుచిత ఆలోచనా పరిధి నుంచి మానవుడు విశాల ప్రపంచంలోకి అడుగు పెట్టాలి. ఎఱుక అప్రమత్తతల ద్వారా మన మనసులలో సాగే చైతన్యక్రియను గుర్తించాలి. గతం నుంచి విడివడి మానవుడు స్వేచ్ఛా వాతావరణంలో కుసుమించాలి.

- ఇదే కృష్ణమూర్తి అభిభాషణం.

కృష్ణమూర్తి చేప్పేవి చాలా సంగ్రహంగా, సంక్షేపంగా **(Abstract)** ఉంటాయే గాని, పూర్వాపరాలు, విషయ వివరణలు ఎక్కువగా ఉండవనే అభిప్రాయాన్ని కొందరు వ్యక్తం చేస్తుంటారు. లోతుగా పరిశీలించిన వారికి మాత్రమే వాటి ఔచిత్యం బోధపడుతుంది. ఏ ప్రయత్నమూ చేయక, ప్రతిదానికీ వివరణలు కోరటం విజ్ఞానాధిక్యం అవుతుందే గాని అనుభవైక వేద్యం కాదు.

ఆధునిక శాస్త్రకారులు ఇటీవల జరిపిన విజ్ఞాన శాస్త్ర పరిశోధనల ఫలితాలు కృష్ణమూర్తి వివరించిన 'పరిశీలితము - పరిశీలకుడు' ఒక్కటే నన్న విషయాన్ని ధృవపరుస్తున్నాయి. అలాగే చూచేది కన్నుగాదు; మనసు మాత్రమే చూడగలుగుతుంది- అన్న విషయాన్ని కూడా ధృవపరచాయి.

నేటి ప్రపంచం అస్తవ్యస్తంగా ఉన్నదన్నది యథార్థం. విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ, ప్రపంచం శకలాలుగా విడిపోతున్నది. మానవుల మనసులు కుదించుకుపోతున్నాయి. వైషమ్యాలు పెరుగుతున్నాయి. కాగా కల్లోలం అనివార్యమవుతున్నది. ఈ కల్లోలం మరికొన్ని కల్లోలాలకు కారణమవుతున్నదే గాని, అసలు సమస్య పరిష్కారం కావటంలేదు. ఈ కల్లోల ప్రపంచానికి కృష్ణమూర్తి హితవు మాటలు అనుసరణీయాలు.

సంకుల సమరంలో చిక్కుకున్న మానవాళికి, ముఖ్యంగా ఈ అస్తవ్యస్త ప్రపంచంలో గమ్యమూ, గమనమూ తెలుసుకోలేక జీవిత పథంలో తికమకపడుతున్న యువతరానికి, వారి భాస్వంతమైన జీవితాలను సుఖప్రదం చేసుకోటానికి కృష్ణమూర్తి బోధల అవసరం ఎంతైనా ఉన్నది.

సాధ్యాసాధ్యాల తర్కానికి వస్తే కృష్ణమూర్తి జీవితమే అందుకు నిదర్శనం. వారు తమ జీవితానుభవం ద్వారా తెలుసుకొన్న విషయాలు మన ముందుంచారు. చెప్పిన వాటిని ఆచరించారు.

●

# 5

# నీవే ప్రపంచం

పృధివి పైని మానవులంతా ఒక్కటే-

తనకు ఇతరులకు మధ్య శరీరగతమైన అంతరం తెలుసుకొన్న మానవుడు 'నేను' అనే భావనను ఏర్పరచుకొని క్రమంగా- కుటుంబం, కులం, మతం, సమాజం, జాతి, దేశం వంటి విభజనలను- కుల, గోత్ర, మత, రాజకీయ, భౌగోళికమైన ప్రాతిపదికలతో- అంచెల వారీగా ఏర్పాటు చేసుకొంటూ నేడు ప్రపంచంలో ఒంటరివాడైనాడు.

పుట్టినచోటు, పరిసరాల ప్రభావం, అనుభూతులు, అనుభవాలు, ఆలోచనలు, ఆదర్శాలు, కోర్కెలు, జ్ఞాపకాలు, భయాందోళనలు అతనిని ఈ ఆత్మగతమైన భావాన్నించి విడివడ నీయకుండా బందీకృతుడ్ని చేశాయి. తనవి, ప్రపంచానివి అంటూ తనను ఆవరించి ఉన్న విషయాలే తనకు భిన్నంగా తోచటం వల్ల, ద్వంద్వ భావనను ఏర్పరచుకొని మానవుడు సత్యాన్ని తెలుసుకోలేక పోతున్నాడు.

అనుభవం వ్యక్తిగతమైనది; యథార్థస్థితి అందుకు భిన్నమైనది. ద్వంద్వ ప్రవృత్తి సోకని భావాతీత అన్వేషణ ద్వారా సత్యాన్ని తెలుసు కోవచ్చును. అందుకు మనస్సులో పేరుకొన్న అనుభవాలు, జ్ఞాపకాలు, భావోద్రేకాలు త్యజించాలి. నిర్మలమైన మనసు ద్వారానే ఆస్థితిని చేరటానికి వీలవుతుంది. అందుకు మనస్సు, హృదయం, శరీరం, సమశ్రుతిలో ఉండాలి. అప్పుడు సమ్యక్ జ్ఞానం బోధపడుతుంది.

ప్రపంచం నేడు విపత్కర పరిస్థితిలో ఉన్నది. వ్యక్తుల పోరుతో ఆరంభమైన కలహం దేశాల మధ్య యుద్ధాలకు దారితీసింది. రెండు ప్రపంచ యుద్ధాలను చూచికూడ మనం గుణపాఠం నేర్చుకోలేక పోయాం. అంతటా అల్ల కల్లోలం, అస్తవ్యస్తం, విభేదాలు, వైషమ్యాలు, ప్రబలాయి. అందరూ శాంతికాముకులే. ఒకవైపు శాంతి ప్రవచనాలు, మరొక వైపు యుద్ధప్రయత్నాలు. కక్షలు పెంచుకొన్నంత కాలం సాధింపు చర్యలు కొనసాగుతూనే ఉంటాయి. ఆవేశాలను అంటిపెట్టుకొని ఉన్నంత కాలం శాంతికి దూరంగా ఉంటాం.

కయ్యానికి కారణాలు కొల్లలు. అవి వ్యక్తిపరమైనవి, సాంఘికపరమైనవి, ఆర్థిక పరమైనవి, రాజకీయ పరమైనవి లేదా జాతి పరమైనవి. ఇలా ఎన్నో కారణాలుగా కక్షలు పెరుగుతున్నాయి. చరిత్రకందినంత వరకూ గత అయిదు వేల సంవత్సరాలలో పదిహేను వేల యుద్ధాలు జరిగాయి. సామాన్య మానవుడే అన్ని విధాలా నష్టపోతున్నాడు. ఈ యుద్ధాలు మరికొన్ని యుద్ధాలకు కారణమైనాయి. వ్యక్తుల పోరుతో ఆరంభమైన కక్షలు- (కవ్వింపు చర్యలు)- కుల, మత, రాజకీయ, ఆదర్శాల, ముసుగులో- ప్రవృద్ధమై సమాజాల మధ్య, జాతుల మధ్య, దేశాల మధ్య వైషమ్యాన్ని రగిలించాయే గాని కలహానికి కారణాలను వెదకి పరిష్కరించలేకపోయాయి.

మనిషి పశుత్వాన్ని వారసత్వంగా పొంది, తానున్న సమాజ పరంగా దౌర్జన్యాన్ని పెంపొందించు కొన్నాడు. ఆ ప్రవృత్తి విజృంభించి, తనలోని బాహ్యాభ్యంతర వైరుధ్యాన్ని యుద్ధాల ద్వారా ప్రదర్శించుకొంటూ అది ఒక జీవన సరళిగా, జీవితంలో ఒక భాగంగా, ఒక క్రీడగా మలచుకొన్నాడు.

ఈ పరిస్థితులు మారేనా? అశాంతి, ఆవేదనలతో నిరంతరం మనుగడ సాగించ వలసిందేనా? ఈ సమస్య ఎవరిది? ఎందుకు మనకు దాపురించింది? సమూలంగా దాన్ని నిర్మూలించ లేమా? ప్రపంచ శాంతి ఎలా నెలకొంటుంది? - ఈ ప్రశ్నలన్నింటికి మనమే జవాబుదారి వహించాలి. వీటికి పరిష్కార మార్గం మనమే కనుగొనాలి. ఈ బాధ్యత మనందరిపైనా ఉన్నది.

విశ్లేషణ ద్వారానే సమస్యలు పరిష్కారంకావు. విశ్లేషించే వారి మనఃస్థితిని బట్టే విశ్లేషణ ఫలితం ఉంటుంది. అనుభవాల నుంచే వారి

ఆలోచనలు సాగటం వల్ల అందులో నవ్యతలోపించి ప్రయోజనం అంతంత మాత్రంగా ఉంటుంది. గాఢ పరిశీలన వల్ల కొంత వరకూ ఫలితాలు రాబట్టవచ్చు గాని ఏ మాత్రం పొరపాటు జరిగినా ఫలితాలు సక్రమంగా ఉండటానికి ఆస్కారం ఉండదు. విశ్లేషణ ఫలితాలు తెలుసుకోటానికి ఎంతో వ్యవధి ఉండి, ఈలోగా ఎన్నో మార్పులు సంభవించే అవకాశం ఉండటం వల్ల, ఆ ఫలితాలను ఆధారంగా తీసుకొని చేసే కృషి వల్ల అనుకొన్న ప్రయోజనాలు పొందలేక పోగా ఎదురు చూడని అవరోధాలు తటస్థమవుతాయి. అలా కాక ప్రాథమికమైన తత్‌క్షణ మార్పు రావాలి. అది ఒకరు చెప్పి ఆచరించటం గాక అంతరంగంగా ఎవరికి వారే తెలుసుకో గలగాలి.

కేవలం తానుగా మారినంత మాత్రాన ప్రపంచంలో గూడా మార్పు సంభవిస్తుందా- అనే సందేహంతో చేసే తాత్సారం, రానున్న ప్రమాదం తీవ్రతరమయ్యేందుకు అవకాశం కల్పిస్తుంది. ఒక వైపు ఇల్లు కాలిపోతుంటే మంటలు ఆర్పటానికి వచ్చిన వారిని పట్టుకొని- అయ్యా తమ కులమేమిటి? గుణమేమిటి? అంటూ ప్రశ్నిస్తూ కాలహరణం చేయలేం గదా!

ముందు తానుగా మారాలి. వ్యక్తిని బట్టి సమాజం ఉంటుంది. వ్యక్తులు నిర్మించిన సమాజం ఆ వ్యక్తుల వ్యక్తిత్వాన్ని బట్టి రూపొందుతుందే గాని, ఆ సమాజాన్ని బట్టే వ్యక్తులు మారరు. సమాజంలో వ్యక్తి అంతర్భాగం. సమాజంలో మార్పుకు బాధ్యత వ్యక్తిదే. అందుకు ముందుగా తనను తాను తెలుసుకొని ఇతరులతోడి తన సంబంధాన్ని తెలుసుకో గలగాలి.

మానవ ప్రాణికి మధ్య వ్యత్యాసం ఉన్నది. వ్యక్తి ఒక ప్రాంతానికో ఒక దేశానికో, ఒక సంస్కృతికో, ఒక మతానికో, ఒక సమాజానికో లేదా ఒక జాతికో మాత్రమే చెందిన వాడు. మానవుడు సర్వవ్యాపితుడు; అంతః కరణం, దయాగుణం, నెనరు అతని లక్షణాలు. వ్యక్తి ఒక సంకుచిత పరిధిలో ఇముడుతూ, నిరాశ నిస్పృహలతో కాలం గడిపే అల్ప సంతోషి. అటువంటి వ్యక్తుల సమాజం అందుకు తగినట్లే ఉంటుంది.

నేటి వ్యక్తి స్వేచ్ఛను కోల్పోయి ఆజ్ఞాబద్ధుడైనాడు. తన ఉనికి, తన సుఖం, తన భద్రత, తన భవిష్యత్తు గురించిన ఆందోళనలు అతనిని ముప్పిరిగొని ఎవరి ఆదేశాలనో శిరసావహిస్తుండటం వల్ల ఆలోచించే శక్తిని కోల్పోయాడు. తనవంటూ ఆలోచనలు కరువై ఏకొద్ది మందో చెప్పింది విని వారి ఆదేశాలకు తల ఒగ్గి ఉండటం వల్ల నేటి మానవుడు స్వయం ప్రతిపత్తిని కోల్పోయి చేతులు మారిన రెండవ రకం మానవుడుగా మిగిలాడు.

సమాజాన్ని శాసించి అధికారాన్ని కైవసం చేసుకొనే పన్నాగంలో భాగంగా కొందరు వ్యక్తులు కుల, మత, ఆర్థిక, రాజకీయమైన వత్తిడులు తెచ్చి తమ అదుపు ఆజ్ఞలను శిరసావహించేట్లు చేస్తుంటారు. అవసరమైతే దౌర్జన్యానికి కూడా వెనుకాడరు. భయాందోళనలతో తమ అడుగులకు మడుగులొత్తుతూ నిస్తేజంగా తమ ముందు మోకరిల్లేట్లు చేస్తారు. సామాజికులు తమ వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పణంగా పెట్టి భద్రతను, సుఖ సంతోషాలను నిలుపు కొంటారు. రాగల అనర్థాలను పట్టించుకోరు. అంగబలం, అర్థబలం, వాగ్బలం కలవారి మాట చెల్లుతుంది. సమాజ పరిస్థితులతో బాటు ప్రపంచ పరిస్థితి కూడా ఇలాగే ఉన్నది. సమాజాల సముదాయమే ప్రపంచం. కొన్ని దేశాలు సంపదతో తులతూగుతుంటే మరికొన్ని దేశాలు దారిద్ర్యంతో అలమటిస్తున్నాయి. ఈవి లేని కలిమి కలహానికి దారి తీస్తుంది. భోగలాలసత్వం అవినీతికి, అక్రమానికి ఆశ్రయమిస్తుంది. లేమితో నలిగి పోతున్న వారు నిస్సహాయులై ఆత్మ సంతృప్తితో కాలం వెళ్లమారుస్తున్నారు. కలిమిలేములు అసమానతను పెంచి, అశాంతిని రెచ్చగొడుతున్నాయి. సత్సంబంధాలు నెలకొనాలంటే అసమాన తలు తొలగిపోవాలి. దయాగుణం దర్పంతో గాక వాత్సల్యంతో పరిఢవిల్లాలి. అప్పుడే సుహృద్భావం నెలకొంటుంది.

మానవ బంధాలు వ్యక్తుల మధ్య గాక వారు ఏర్పరచుకొన్న మిథ్యాబింబాల మధ్యే నెలకొనటం వల్ల మానవుల మధ్య సత్సంబంధాలు కొరవడ్డాయి. బాహ్యాభ్యంతర వైరుధ్యంతో సతమవుతున్న మానవుడు ఇతరులతో వ్యవహరించేటప్పుడు, తన మనస్సులో వారిని గురించి అంతకుముందే ఏర్పరచుకొన్న ఊహాబింబాలతోనే వర్తించటం వల్ల అసలు

మనిషి మరుగున పడుతున్నాడు. అనుభవాల నుంచి జ్ఞాపకాల నుంచి లేదా ఎవరో చెప్పగా విని ఊహించుకొన్న బింబాలు మాత్రమే మనసున నిల్పుకొంటున్నారు గాని యథార్థ స్థితిని ఎఱుక పరచుకోలేకున్నారు. ఊహ వాస్తవానికి భిన్నమైనది. అనుభవం వ్యక్తిగతమైనది కాగా ఆ స్వీయానుభవంతో ఇతరులను గురించి ఏర్పరచుకొన్న ఊహలు కూడా వాస్తవానికి దూరంగా ఉండటం సహజం. మనిషిలోనే ద్వంద్వ ప్రవృత్తి ఏర్పడింది. లోపలి మనిషికి, బయట మనిషికి మధ్య జరిగే సంఘర్షణలో అసలు మనిషి సతమతమవుతున్నాడు. బాహ్యాభ్యంతర వైరుధ్యం వైదొలగినప్పుడు అసలు మనిషి వ్యక్తం కాగలడు.

'నేను' అనే భావన మనిషిని అంటి పెట్టుకొని ఉన్నంతకాలం వైరుధ్యం తప్పనిసరి అవుతున్నది. తను, తన కులం, తన మతం, తన దేశం, తన జాతి అనే భావన మనిషిని ఇతరుల నుంచి వేరు చేస్తుంది. విశాల ప్రపంచంలో అతని ఉనికి తన చుట్టూ ఏర్పరచుకొన్న ఒక విభాగానికే పరిమితమవుతుంది. విభజనలు బహిరంతర వైరుధ్యాన్ని సృష్టిస్తాయి. విభజనలు లేని స్థితిలో ప్రపంచం అంతా ఒక్కటిగానే సాక్షాత్కారిస్తుంది.

మనిషి తనను సుఖ సంతోషాలు ఆస్తి అంతస్తులు ఎప్పుడూ అంటి పెట్టుకొని ఉండాలను కొంటాడు. ఈ కోరిక బలీయమై ఆశ- అత్యాశగా మారి వాటిని ఎలాగైనా నిలుపుకోవాలనే తాపత్రయంతో ఎట్టి అఘాయిత్యాని కైనా సిద్ధమవుతున్నాడు. ఉన్నది చేజారి పోతుందేమోనన్న భయం ఒక వైపు, కూడ బెట్టుకొన్నది చాలదన్నట్లు మరింత ప్రోగుచేసుకోవాలనే ఆశతో కోరితెచ్చుకొన్న ఆందోళన మరొక వైపు మనిషిని పెనవేసుకొన్నాయి. భద్రత, భవిష్యత్తు ప్రతి జీవిని వెంటాడి భయాందోళనలతో కృంగ దీస్తున్నాయి. పైకి కనిపించే భయాందోళనలను గుర్తించవచ్చు కాని లోలోపల రగులుకొంటున్న భయ విహ్వలానాన్ని గుర్తించటం కష్టం. భయం ఏరూపంలో నున్నా మనిషిని పట్టి పీడిస్తుంది; అయోమయాన్ని చాంచల్యాన్ని కలుగచేస్తుంది.

భయానికి కేంద్రం మనస్సు. గత అనుభవాలు మనిషిని భవిష్యత్తును గురించిన ఆలోచనలకు ప్రోద్బలపరుస్తాయి. చేదు అనుభవాలు మనసుపై

గాఢమైన ముద్రలు వేస్తాయి. సుఖమైనా, దుఃఖమైనా జ్ఞాపకాల పొరలలో నిక్షిప్తాలై పదే పదే మనిషిని హెచ్చరిస్తుంటాయి. జ్ఞాపకాలు అనుభవాలను గుర్తు చేస్తుంటాయి. కనుక భయం - అనుభవాలు, జ్ఞాపకాల ద్వారా గతం నుంచి భవిష్యత్తుకు సాగుతుంది. నిన్న నేడు రేపు అనేకాలగతిలో ఆలోచన భయాన్ని పెంచుతుంది. భయానికి మూలం ఆలోచన. ఈ ఆలోచనే వ్యధను పెంచుతుంది. భయం- హేతువుకు, భయం- తీరిపోవటానికి మధ్యకాలంలో భయంయొక్క చైతన్య క్రియ ఉంటుంది. అంటే భయం కాలంతో ముడిపడి ఉంటుంది. అది కాలమాన క్రమానుసారంగా కాక మనోగత కాలక్రమానుసారం ప్రవర్తిల్లుతుంది. నడవడులలో, సంభాషణలలో- ఇలా దైనందిన జీవితంలోని ప్రతిక్షణమూ అప్రమత్తంగా నున్నప్పుడు బహిరంతర్గత భయకారణాలు అవగతమవు తాయి.

ఒక సమస్యను పూర్తిగా ఎఱుకపరచు కొన్నప్పుడు ఆ సమస్య ఇట్టేపరిష్కారమవుతుంది. ప్రయత్న పూర్వకమైన ఆలోచనల ద్వారా సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నించినప్పుడు అనుభవాలు అడ్డుని లుస్తాయి. అనుభవాలు యథార్థ స్థితికి భిన్నమైనవి కావటం వల్ల అసలు సమస్య పరిష్కారం కాదు. ఎఱుక అప్రమత్తతల ద్వారానే భయాన్ని అవగాహన చేసుకొని వైదొలగించుకోటానికి అవకాశం ఉంటుంది. మానవుని మనస్సు ఏదో ఒక ఆలోచనతో ఉండటం వల్ల ఆ స్థితిని పొందలేక పోతున్నాడు. ప్రశాంత చిత్తం భయ సందేహాలను నివృత్తి చేస్తుంది.

భయంలాగే పోలికలు కూడా మనల్ని పట్టిపీడిస్తున్న సమస్యలలో ప్రధానమైనవి. పోలికలు అసమానతలను సృష్టిస్తున్నాయి. ఒకరిలా ఉండాల నుకోవటంలో వైరుధ్యం చోటు చేసుకొంటుంది. పసితనం నుంచి పోలికలను మనసులో ప్రవేశ పెట్టి సున్నితమైన పసివారి జీవితాలలో ద్వేష బీజాలను నాటుతున్నారు. వెనుకటితరాల వారినుండి సంక్రమించిన ఈ రుగ్మతను ముందుతరాల వారికి అంటించుతున్నారు. బ్రతుకుబాటలో పోలికలు అడ్డదార్లు త్రొక్కటానికి ఉపకరించేవిగా ఉన్నాయే గాని మనిషిని సక్రమంగా ఎదగనివ్వటం లేదు. పోలికలతో ముడిపడిన జీవితాలకు శాంతి కరువు అవుతుంది. క్షణికమైన సంతృప్తిని అనుభవించి, మరింత సంతృప్తిని పొందటానికో లేక ఆ సంతృప్తిని కొనసాగించు కోటానికో చేసే ప్రయత్నం మనిషిని కృంగదీస్తోంది. అసలు మనిషి మరుగునపడి తీరని ఆశలతో

సతమతమయ్యే మరో మనిషి ఆ స్థానంలో చోటు చేసుకొంటున్నాడు. అనుభవాలు, ఆలోచనలు, ఆదర్శాలు అతనిలో వైరుధ్యాన్ని పెంచుతాయి. అనుభవాలు గతానికి సంబంధించినవికాగా, ఆ గతం నుంచి సాగే ఆలోచనలు కూడా గతంతో ముడిపడి ఉంటాయి. ఆశయాలు, ఆదర్శాలు వివేకరహిత మైనవి. అవి యథార్థ స్థితికి దూరంగా ఉండటం వల్ల సత్యాన్ని తెలుసుకోలేం. ఈ ధోరణులు ఏవీ మనసుకు సుఖ శాంతులను ఇవ్వక పోగా మనసును మలినం చేస్తాయి.

మాలిన్యంలేని మనస్సు, నమ్మకాలకు, కట్టుబాట్లకు, నియమ నిబంధనలకు అతీతంగా ఉంటుంది. అట్టి మనస్సు స్వతంత్రంగా స్వేచ్ఛా వాతావరణంలో పని చేయగలుగుతుంది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే- మన ఇచ్ఛ వచ్చిన రీతిని విహరించే విశృంఖలత్వం కాదు. స్వాతంత్ర్యం అంటే తీవ్రమైన (కఠోర) క్రమశిక్షణ. క్రమశిక్షణకు సరియైన అర్థం- అభ్యాసం -ఒక విషయాన్ని సమగ్రంగా తెలుసుకొని అభ్యసించటం. ఆ క్రియలోనే క్రమశిక్షణ ఇమిడి ఉన్నది. తద్వారా అనుకరణ, అణకువ, అణచివేతలనుండి విముక్తి లభిస్తుంది. నిర్బంధాలు స్వేచ్ఛకు అంతరా యాలు. నిర్బంధంలేని మనస్సు సత్యాన్ని తెలుసుకోగలుగుతుంది. అందులో ఆకర్షణలకు, ప్రకర్షణలకు తావుండదు. అప్పుడు సర్వమూ విదితమవుతుంది. హృదయ వైశాల్యం, ప్రేమ, కారుణ్యం, సాక్షాత్కార మవుతాయి.

ప్రేమ ఉన్నతావున స్వీయాభిప్రాయాలుండవు. అభిప్రాయాలు వైరుధ్యాలను సృష్టిస్తాయి. ప్రేమ జ్ఞాపకాలకు, అనుభవాలకు, ఆలోచనలకు అతీతమైనది. నిజమైన ప్రేమ స్వేచ్ఛను, సత్సంబంధాన్ని పెంచుతుంది. కేవలం సరిపుచ్చుకోవటం ప్రేమకు లక్షణం కాదు. అది ఒక కాలపరిధిలో ఇమిడేది కాదు. ప్రేమంటే సంతోషమూ కాదు, కోర్కెలను తీర్చుకోవ టమూ కాదు. ప్రేమ శాశ్వతమైనది. సుఖ, సంతోషాలు, కోర్కెలు అశాశ్వతాలు. వీటితో ముడిపడిన ప్రేమ, వాటిని పొందిన మరుక్షణం లుప్తమవుతుంది. అప్పుడది సమాధాన పరచుకోవట మవుతుంది గాని నిజమైన ప్రేమ గాదు. నిష్కల్మషమైన ప్రశాంత చిత్తమే ప్రేమకు నెలవు. ప్రేమ విశ్వ వ్యాప్తం.

మనిషి ప్రపంచాన్ని విడచి ఒంటరిగా ఉండలేడు. ఏకాకి బ్రతుకులో జీవితం స్తంభించి పోతుంది. అతనికి తోడుకావాలి. తద్వారా సంబంధ

బాంధవ్యాలు ఏర్పడుతున్నాయి. అవి సక్రమంగా ఉండాలంటే సదవగాహన కావాలి. అవగాహన కేవలం ఇతరుల గురించి మాత్రమే గాక తనను గురించి, తన నిజ స్థితిని గురించి కూడా ఉండాలి. తన అవసరాలు, సుఖ సంతోషాలు తనకు ఎంత అవసరమో ఇతరులకు కూడా వాటితో అంతే అవసరం ఉంటుంది. నడవడి మన స్థితిని ప్రదర్శిస్తుంది. తాను తానుగా గాక, తానే ప్రపంచంగా ఎఱుక పరచుకొన్న మనిషిలో ద్వంద్వ ప్రవృత్తికి తావుండదు. ద్వంద్వ ప్రవృత్తి వైరుధ్యానికి దారితీస్తుంది.

అహం ఉన్నచోట స్వార్థం ఉంటుంది. స్వార్థం తన చుట్టూ ఉన్న ప్రపంచం నుంచి తనను విడదీస్తుంది. తన అవసరాలే తనకు ప్రధానమనుకొన్నప్పుడు తాను ప్రపంచం నుంచి వెలి అవుతున్నాడు. ప్రస్తుత పరిస్థితులకు మూలం మనిషిలో ఈ స్వార్థం పేరుకోవటమే.

వాస్తవిక దృష్టితో చూచినట్లయితే మనమే ప్రపంచం. మనలోని ఆలోచనలు, ఆందోళనలు, వేదనలు, వ్యధలు, ఆశలు, నిరాశలు, వైషమ్యాలు, కార్పణ్యాలు, అయోమయావస్థ- అంతా ప్రపంచానికి సంబంధించినవే. ప్రపంచంలో మార్పు రావాలి; నేటి పరిస్థితుల నుంచి మానవులు విముక్తులు కావాలి- అనే ఆరాటం హెచ్చింది. మన ప్రవర్తనలలో ముందుగా మార్పు సంభవమైతే ఆ మార్పు సహజంగానే ప్రపంచంలో కానవస్తుంది. అలాగాక ఎవరికి వారే కుదించుకు పోతుంటే ప్రపంచం మారటం అసంభవం. ముందు వ్యక్తి మారాలి. అప్పుడే అతని చుట్టూ ఉన్న సమాజం కూడా మారుతుంది. అందుకు మున్ముందుగా వ్యక్తిలోని బహిరంతర వైరుధ్యం తొలగి పోవాలి.

మానవ బంధాలు ఎప్పుడూ ఒకే రకంగా ఉండవు. అవి చైతన్యవంతంగా ఉంటాయి. ఆ చైతన్యమే జీవితం. చైతన్యం ఉడిగినప్పుడు జీవితం స్తంభించి పోతుంది. మనిషి తనను తాను తెలుసుకొని ఇతరులను కూడా తెలుసుకోవాలి. ఈ ఆత్మ జ్ఞానం లేక స్వస్వరూప జ్ఞానం అతి ముఖ్యం. అలాగే పరరూప జ్ఞానం కూడా ముఖ్యం.

తనను బంధించి వైచిన నమ్మకాలు, అభిమతాలు, అభీష్టాల నుంచి వ్యక్తి విముక్తుడై మానవుడుగా వికసించాలి; మాలిన్య రహితుడై ఎదగాలి. విశాల దృక్పథంతో బాటు ప్రేమ, కరుణ వెల్లి విరియాలి.

మనిషి వ్యక్తి నుంచి విశ్వ మానవుడుగా వికసించి పరిమళించాలి. అదే కృష్ణమూర్తి అభిభాషణం.

# 6

# ధ్యానం

శరీరానికి స్నానం- మనసుకు ధ్యానం అవసరం అంటారు.

'ధ్యానం' అంటే ఏమిటి? అన్న ప్రశ్నకు 'ఏకాగ్రత' అంటూ వెంటనే జవాబు వస్తుంది.

కృష్ణమూర్తి దృష్టిలో 'ధ్యానం' అంటే ఏకాగ్రత కాదు; అలాగని ప్రార్థనా కాదు; భక్తి అంతకంటే కాదు; పైగా అదేదో శిక్షావిధానమూ కాదు. వారి దృష్టిలో 'ధ్యానం' అంటే 'ఆత్మ జ్ఞానం'. అది ఎఱుక, అప్రమత్తతల ద్వారా సిద్ధిస్తుంది. దానికి ముఖ్యంగా కావలసింది ప్రేమ. ప్రేమ పూరిత మనస్సు ప్రశాంతంగా నిశ్చలంగా ధ్యానానికి అనుకూలంగా ఉంటుంది.

సమస్యల ఊబిలోనుంచి బయటపడేందుకు, జరా రుజ మరణాలకు అతీతమైన ఏదో శాశ్వత సుఖాన్ని పొందేందుకు మానవుడు నిరంతరాన్వేషణా సక్తుడై ఉన్నాడు. అన్వేషణ అంటే పరిశోధించటం లేదా వెదకి తెలుసుకోవటం. ఆ తెలుసుకొనగోరేది అంతకు పూర్వమే పరిచయమై ఉంటేనే గాని అన్వేషణ ఫలితాన్ని గుర్తించటం సాధ్యం కాదు గనుక మానవుని మస్తిష్కంలో అవి నిక్షిప్తాలై ఉండటం వల్లనే వాటిని శోధించి పరిచయం చేసుకోగలుగుతాడు.

ఏదికాదో తెలుసుకోవటం ద్వారా ఏది అవునో తెలుస్తుంది. ధ్యానానికి మొదటి మెట్టు పరిశోధనాసక్తి విసర్జించటం. సంఘం, ప్రతిష్ఠ, నీతి వంటి విషయాల ప్రసక్తి లేని న్యాయమైన ప్రజ్ఞాక్రమమే ధ్యానానికి పునాది. క్రమరహిత్యాన్ని అవగతం చేసుకోవటం ద్వారా క్రమం ఎఱుక అవుతుంది. బాహ్యాభ్యంతర వైరుధ్యం వల్ల క్రమరాహిత్యం తప్పని సరి అవుతుంది. విధానాలకు, ఉపదేశాలకు, స్వానుభవాలకు అతీతమైన మనసు వల్లనే యథార్థ స్థితిని గుర్తించ గలం. ప్రయత్న పూర్వకంగా సత్ఫలితాలు పొందలేం. అట్టి సాధన వైరుధ్యాలను సృష్టిస్తుంది. వైరుధ్యం వల్ల అలజడి, అక్రమం చోటు చేసుకొంటాయి. వాటిని అతిగమించటం గాక, ఎఱుక పరచు కోవటం ద్వారా యథార్థ స్థితి గోచరమవుతుంది.

ధ్యానమంటే ఏకాగ్రత కాదు. ఏకాగ్ర మనస్సు సత్యాన్ని కనుగొన లేదు. ఏకాగ్రతలో అదుపు, అంగీకారం, బహిష్కారం ఉంటాయి. ఇట్టి సాధనతో మనస్సును నిలకడగా ఉంచడానికి చేసే ప్రయత్నంలో- వశం చేసుకొనేవానికి వశమయ్యేదానికి మధ్య విభజన ఉంటుంది. విభజన వైరుధ్యాన్ని నెలకొల్పుతుంది. తద్వారా క్రమం తప్పిపోతుంది. ఈ సత్యాన్ని అవగాహన చేసుకోగలిగితే ఏకాగ్రత అసమంజసమని విశదమవుతుంది.

ధ్యానమంటే ప్రార్థన కాదు. ప్రార్థించటమంటే కోరుకోవటం. కలతలు, అలజడి, ఆందోళనలలో తగులుకొన్నప్పుడే ప్రాధేయపడటం, ప్రార్థించటం అవసరమవుతున్నది. సుఖ సంతోషాలలో, ప్రశాంతతలో ప్రార్థన అవసరం లుప్తమవుతుంది. మంత్రోచ్చారణ, స్తోత్రపఠనలతో ఆలోచన మందగించి మనస్సు నిలకడగా ఉంటుంది. ఆ స్థితిలో ఏదో సందేశం వంటిది ప్రాప్తిస్తుంది. అది అంతర్గత మనస్సునుండి గాని, గతస్మృతుల నుండి గాని వచ్చిన వాణియే కాని- సత్యవాక్కు మాత్రం కాదు. అది ఆత్మ సమ్మోహనం మాత్రమే.

ధ్యానమంటే భక్తి కూడా కాదు. భక్తి అంటే ఒక భావానికి ఆత్మబలి. తృప్తి పరచే వాటియందే భక్తి, అనురక్తి కలుగుతాయి. సంతృప్తిలోపించిన క్షణంలోనే భక్తి కరిగిపోతుంది. ఆరాధించే ప్రతిదీ మనోగతమే. అంటే

మనోగత భావాలనే మనం ఆరాధిస్తున్నాం. మనంగా ఏర్పరచుకొన్న భావాలను, ఆకృతులను ఆరాధించటం వల్ల మనల్ని మనమే ఆరాధించు కొంటున్నట్లు అవుతుంది.

ఇక ధ్యానమంటే శిక్షణ కూడా కాదు, శిక్షిత మనస్సు స్వేచ్ఛను కోల్పోతుంది. అటువంటి మనస్సు సంకుచితమై, నియమిత పరిధిలోనే పనిచేయ గలుగుతుంది. ఆ స్థితిలో కలిగే ఫలితాలు శిక్షిత మనస్సు నుండి ఎగసిన శిఖలు మాత్రమే.

ఆత్మజ్ఞానం కన్న వేరే ధ్యానం లేదు. ఆత్మజ్ఞానమంటే ప్రతిక్షణమూ సత్యాన్ని గ్రహించటం. అనుభవం ద్వారా కాక గ్రహణశక్తి ద్వారానే అది సాధ్యమవుతుంది. ఏకాగ్రత, ప్రార్థన, భక్తి శిక్షావిధానాలలో మనస్సు అన్యాక్రాంత మవుతుంది. కట్టుబాటు స్వేచ్ఛను హరిస్తుంది. శ్రద్ధ, ఆసక్తి మనసును శాంత పరుస్తాయి. నిశ్చల మనసు ద్వారానే యథార్థ స్థితి ఆవిష్కారమవుతుంది. ఎటువంటి వికారము, ప్రతిరోధము లేని తీక్ష్ణమైన జాగ్రదవస్థ వల్ల మనస్సు ధ్యానస్థాయిని చేరుకొని ఎఱుక పొంది సత్యాన్ని అవలోకిస్తుంది. ఈ మనః స్థితే ఆత్మావగాహన, ఆత్మజ్ఞానం- స్వస్వరూప జ్ఞానం- అదే ధ్యానం.

ఎప్పుడూ ఉద్రేకాలతో, రాగభావాలతో తల్లడిల్లుతూ అవును- కాదు అనే ద్వంద్వాలతో వేగి వైరుధ్యాలు సృష్టిస్తున్న మనస్సును తెలుసుకోటా నికి ప్రశాంత చిత్తం తప్పని సరి అవుతున్నది. అప్రమత్తంగా ఉండటం వల్లనే అట్టి మనస్సును ఎఱుక పరచుకోగలం. ప్రయత్నం ద్వారా ప్రశాంత చిత్తం సాధ్యపడదు. అట్టి ప్రయత్నం- కాలపరిమితిలో, పొందవలసిన దానికోసం కృషి సల్పటమవుతుంది. కాలాతీతమైన స్థితిలో భూత భవిష్యత్ వర్తమానాలుండవు. కాని ఆ నిశ్చల మానసిక స్థితిలో గూడా చలనము, అనుభవమూ ఉంటాయి. ఎఱుక గలిగి ఉండటం వల్ల మనం వాటిని గుర్తించ గలం. మానసిక చైతన్య స్రవంతిలోని కదలిక ఈ ఎఱుక. ఆ స్రవంతి గతం నుంచి భవిష్యత్తుకు ప్రవహిస్తుంటుంది.

ఈ ఎఱుక స్థితిని కృష్ణమూర్తి- గోడగడియారంలోని లోలక భ్రమణంతో పోలుస్తూ ఇచ్చిన సాదృశ్యం స్పష్టంగా ఉంటుంది. లోలకం

అటూ ఇటూ ఊగుతుంటుంది. వీటిని భూత భవిష్యత్తులతో సరిపోల్చవచ్చును. లోలకం అటునుంచి ఇటు కదలటం భూతకాలం నుంచి భవిష్యత్తుకు వెళ్లుతున్నట్లు అర్థం అవుతుంది. అంటే భవిష్యత్తు గతం నుంచి వస్తుంది. ఏవో కొలది మార్పులున్నా అది గతం యొక్క రూపమే. లోలకం ఆ చివరినుంచి ఈ చివరికి వచ్చి, తిరిగి ఆ చివరికి వెళ్లటానికి ముందున్న అతి సూక్ష్మకాలంలో విరామం, ప్రశాంతత ఉంటాయి. అలాగే ఎఱుక గలిగిన మనస్సులో- ఆలోచనకు ఆలోచనకు మధ్య విరామం ఉంటుంది. రెండు ఆలోచనల మధ్యనున్న విరామానికి ఆలోచనల క్రమంతో సంబంధంలేదు. సూక్ష్మావగాహన ద్వారా ఆ నిశ్చల స్థితి, ఆ విరామం కాలానికి సంబంధించినవి కావని ద్యోతకమవుతుంది. ఆ స్థితిని కనిపెట్టి దాన్ని పూర్తిగా అనుభవించటం ద్వారా నియమాలనుంచి, నియమ బద్ధతల నుంచి విముక్తి లభిస్తుంది. ఈ విరామాలపైని మనస్సును కేంద్రీకరించటమే ధ్యానానికి అర్థం అంటారు, కృష్ణమూర్తి.

దృశ్య శ్రవణ క్రియయే అప్రమత్తత లేక జాగ్రదవస్థ. దీనికి ప్రత్యేక సాధన అనవసరం. సాధన ప్రారంభించిన క్షణమే అది పట్టుతప్పిపోతుంది. అప్రమత్తతలో నున్నా మనస్సు సంచరిస్తూనే ఉండవచ్చు. అదే పరధ్యానం లేక అశ్రద్ధ. ఆ పరధ్యానాన్ని ఎఱుక పరచుకోవటమే అప్రమత్తత లేక శ్రద్ధ. శ్రద్ధాళువు కావాలని తీవ్రంగా కృషి సల్పటం మొండితనమవుతుంది. శ్రద్ధ లోపించినట్లు గ్రహిస్తేచాలు. అభీష్టాలతో నిమిత్తం లేకుండా ఆ లోపాన్ని ఎఱుక పరచుకోవాలి. తత్ క్షణమే, ఆ ప్రమత్తతలో వ్యాపకం ఉన్నప్పుడు ఆ వ్యాపక క్రియను ఎఱుక పరచుకోవాలి. అప్పుడు సర్వమూ విదితమవుతుంది.

మనసుతో బాటు శరీరం కూడా ప్రశాంతంగా ఉండాలి. శరీరంలో నాడులు, అవయవాలు, అన్నీ కుదురుగా ఉండాలి. శరీరం చలనం లేనప్పుడు శిరస్సుకు రక్తం ఎక్కువగా ప్రసరిస్తుంది. ఏటవాలుగానో, ముడుచుకొనో గాక శరీరం నిటారుగా ఉండాలి. అప్పుడే రక్తం శిరస్సుకు ప్రవహించటం సులువు అవుతుంది. అన్యవ్యాపకాలలో ఉంటూ కూడా ధ్యానాన్ని సాగించవచ్చు. వాహనాలను నడిపేవారు కూడా అప్రమత్తులై ఉంటారు. శరీరానికి గూడా సూక్ష్మ గ్రాహిత్వం ఉంటుంది. దాన్ని

ఆలోచన నాశనం చేస్తుంది. ఆలోచన సుఖాన్ని అపేక్షిస్తుంది. తద్వారా యధేచ్ఛను ప్రోత్సహిస్తుంది. శరీరాన్ని బలవంతంగా నైనా పని చేయించడానికి ప్రయత్నిస్తుంది. దాన్ని రాపాడి సూక్ష్మ గ్రాహిత్వాన్ని నాశనం చేసి బండబారేట్లు చేస్తుంది. ఎక్కడ సునిశితత్వం, సౌకుమార్యం- ఉంటాయో అక్కడ వివేకం, తద్వారా ప్రేమ ఉంటాయి. అట్టి ప్రేమ ఉల్లాస భరితం, నిరవధికం.

ధ్యానానికి సంబంధించిన మరొక విభాగం- జాగృత మనస్సు. పగలంతా చెప్పినట్లు విని విధేయతతో పనిచేసే మనస్సు దినచర్యలో వివేకంతో ఉండి, నిద్దుర పోతున్నప్పుడు కలలలో కూడా తన విధిని నిర్వహిస్తూంటుంది. అంటే కలలలో గూడా చైతన్య క్రియ సాగుతూంటుంది. కనుక, నిద్దుర- మెలకువ ఘడియల పొడిగింపు. పగటి పూటసాగే ఆత్మాశ్రయ చర్యలను శ్రద్ధగా గమనించితే కలలురావు. మనస్సు ఆలోచనల ప్రతి కదలికనూ గమనిస్తూంటుంది. ప్రతిమాటనూ శ్రద్ధగా ఆలకిస్తుంది. పైగా అందులోని సౌందర్యాన్ని కాంచగలుగుతుంది. అప్పుడు నిద్దురలో గూడా జాగ్రదవస్థను గుర్తించవచ్చు.

ధ్యానం ఎంతో ముఖ్యమైనది; బహువిలువైనది. అందులో ఎంతో ఔన్నత్యం, గౌరవం, సొగసు, సౌందర్యం ఉన్నాయి. ఎఱుక, అప్రమత్తత, శ్రద్ధల ద్వారా మెలకువలోగాని, సుషుప్తిలోగాని మనస్సు చైతన్యవంతంగా ఉంటుంది. ఆ స్థితిని ఎవరికి వారు తెలుసుకోవలసిందే గాని వర్ణించటం అసాధ్యం.

ధ్యానానికి ముఖ్యంగా కావలసింది 'ప్రేమ'. ప్రేమ ఉన్నచోట భయం ఉండదు; వ్యత్యాసాలుండవు. అప్పుడు మనస్సు, మెదడు, హృదయం, ఇతర ఉద్రేకాలన్నీ సమశ్రుతిలో ఉంటాయి. అదిలోపించిన ధ్యానం ఆత్మ సమ్మోహన మవుతుంది- అన్నారు కృష్ణమూర్తి.

# 7

# చదువు-జీవితం

జీవన సరణికి భిన్నంగా జీవించటం వల్లనే మానవ జీవితాలలో కల్లోలాలు చెలరేగుతున్నాయి. సమస్యలను వాస్తవిక దృష్టితో పరిశీలించక, ముందుగానే నిర్ణయాలు తీసుకోవటం వల్ల అవి మరింత జటిలమవుతున్నాయి. జిజ్ఞాసను పెంపొందించుకొని అప్రమత్తత ద్వారా స్వబుద్ధితో సత్యాన్ని తెలుసుకొని మానవుడు జీవితాన్ని సుగమం చేసుకోవాలి.

మనం పెరిగిన వాతావరణం, మనం నేర్చిన చదువులు జీవితాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోటానికి ఏ మాత్రం ఉపకరించటం లేదు. మనసు ఎదిగే తరుణం లోనే, దాన్ని మన అవసరాలకు, ఆశయాలకు అనుగుణంగా మలచటానికి ప్రయత్నిస్తున్నాం. స్వేచ్ఛను కోల్పోయిన మనసు వికృతంగా తయారవుతున్నది. నియమాల పేరట, నిబంధనల పేరట మనసును ఎదగ నీయక పోవటంతో వివేకాన్ని, సునిశిత జ్ఞానాన్ని కోల్పోయి మేధ ఏదో ఒక పరిధిలోనే పనిచేయ గలుగుతున్నది. సంపూర్ణ మానసిక వికాసానికి నేటి విద్యావిధానంలో మార్పురావాలి. భావితరాల వారికైనా ఈ దుస్థితి దాపురించకుండా ముందు జాగ్రత్త వహించాలి- అన్నారు కృష్ణమూర్తి.

వారి దృష్టిలో-

మానవులంతా ఒకే మూసనుంచి వచ్చినట్లుగా- సాంఘిక భద్రత, సమాజంలో గుర్తింపు, సుఖప్రదమైన జీవితాలపై ఆకాంక్ష తప్పించి మరో ఆలోచనలేకుండా తయారవుతున్నారు. విద్యార్థిదశలోనే అందుకు అవసరమైన బీజాలు ఆ లేతమనసులలో ప్రవేశ పెడుతున్నారు. ఈ వ్యవస్థ ఎంతో కాలంగా, ఇలాగే కొనసాగుతున్నది. నేటి వ్యవస్థాగత విద్యావిధానం స్వతంత్రాలోచనలకు ప్రోత్సహించక ఏదో ఒక విధానానికి అనుగుణంగా క్రమబద్ధం చేయటం వల్ల, మనసు ఎదగక పోగా, పొందే ఫలితాలు అంతంత మాత్రం గానే ఉంటున్నాయి.

లౌకిక పారలౌకిక ప్రతిఫలాపేక్ష, బహిరంతర్గత భద్రతాందోళన, సుఖ సంతోషాన్వేషణాది కృషి యావత్తూ మానవులను అసంతృప్తితో కృంగ దీస్తూ భయాన్ని పెంచుతోంది. ఈ భయం- జీవితాన్ని అర్థం చేసుకోటానికి ప్రతిబంధక మవుతున్నది. శతాబ్దాల తరబడి పాతుకొని ఉన్న సాంఘిక వ్యవస్థకు భిన్నంగా ఆలోచించనీయక, అధికారానికి, సంప్రదాయానికి తల ఒగ్గేట్లు చేస్తోంది నేటి వ్యవస్థాగత విద్యావిధానం.

సంస్కారణల వల్ల గాని, తిరుగు బాటు ద్వారా కాని, అసలు సమస్యలు పరిష్కారం కాక పోగా మరొక సంస్కరణకో, మరొక తిరుగు బాటుకో ఆస్కారమవుతున్నాయి. అలాగాక- ఆలోచన, అనుభూతులను ఎఱుక పరచుకొన్న ఆత్మజ్ఞానం లేక స్వస్వరూపజ్ఞానం ద్వారా వాటినుంచి వైముఖ్యాన్ని పొందినప్పుడు సత్ఫలితాలు కలుగుతాయి. అనుభూతిని యథాతథంగా పొంది, జ్ఞానాన్ని మేల్కొలిపి ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళటం ద్వారానే అది సాధ్యమవుతుంది. అలా ఉన్నత స్థాయికి చేరుకొన్న జ్ఞానమే అంతర్ జ్ఞానం. అదే జీవితానికి సరైనదారి చూపుతుంది.

జీవితానికి అర్థం, జీవించటంలో అంతరార్థం వంటి విషయవివేచన ద్వారా మనం కొన్ని సత్యాలను తెలుసుకోగలం. కేవలం ఘనతను సాధించటానికి, మంచి ఉద్యోగం సంపాదించుకోటానికి లేదా సామర్థ్యాన్ని పెంచుకొని ఇతరులపై ఆధిక్యాన్ని పెంచుకొనటానికే విద్యను అభ్యసించిన ట్లయితే జీవితాలు నిరర్థకాలవుతాయి. నేటి నాగరక ప్రపంచంలో జీవితాన్ని ఎన్నో విభాగాలు చేసుకొని, ఏదో ఒక విభాగానికే పరిమితమై, విద్యా బోధ చేయటం వల్ల- ఆ విభాగానికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం, వృత్తి నైపుణ్యం మాత్రమే అబ్బుతాయి గాని, సంపూర్ణవికాసానికి ఈ పద్ధతి అవరోధమవుతున్నది.

వ్యక్తి వివిధ తత్త్వాల సముదాయం. విద్య ఈ తత్త్వాలనన్నింటినీ విడివిడిగా కాక సమన్వయ పరచి పూర్ణ మానవునిగా రూపొందించాలి. విద్యకు ప్రయోజనం కేవలం మనసుకు శిక్షణ ఇవ్వటమే కాదు. శిక్షణ వల్ల సామర్థ్యం పెరగవచ్చునే కాని, సంపూర్ణత్వం సిద్ధించదు. శిక్షణ పొందిన మనసు గతం యొక్క అవశేషం. అటువంటి మనసు నూతన విషయాలను కనుగొన లేదు. సరైన విద్యను ఆవిష్కరించటానికి జీవిత

అంతరార్థాన్ని తెలుసుకోవాలి. జీవితాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోటానికి- ప్రేమ, కరుణ అవసరం. అవి మృగ్యమైనప్పుడు క్రౌర్యం చోటు చేసుకొంటుంది. పరస్పర కలహాలకు, వినాశానికి దారి చూపే విద్య ప్రయోజన శూన్యమైనది.

జీవితాన్ని అర్థం చేసుకోటానికి ముందు మనల్ని మనం అర్థం చేసుకోవాలి. అదే విద్యకు అది- అదే లక్ష్యం. విద్యాభ్యాసమంటే విజ్ఞాన సముపార్జన, కార్యకారణ వివేచనే కాదు; అది జీవిత అంతరార్థాన్ని సంపూర్ణంగా అవగతం చేసుకోవటం. విద్యాభ్యాసంలోనే తెలుసుకొన్నది అనుభవైక వేద్యం చేసుకొనే క్రియ కూడా ఉన్నది.

పరీక్షలు, పట్టాలవల్లనే బుద్ధి వికసించదు. బుద్ధి సూక్ష్మతకు చదువుతో నిమిత్తం లేదన్న విషయంకూడా విశదమవుతున్నది. సూక్ష్మ గ్రాహిత్వమంటే ప్రాథమిక విషయాలను అన్ని కోణాలనుంచి చూచి తెలుసుకోగల సామర్థ్యం. అట్టి సామర్థ్యాన్ని తనలోనూ, ఇతరులలోనూ మేలుకొలపటానికి ఉపయుక్తమైనదే విద్య.

ఏవో కొన్ని సూత్రాలకు, ఆదర్శాలకు మాత్రమే పరిమితమై వ్యక్తిని సంఘానికి అనుగుణంగానో, వ్యతిరేకంగానో మలచటానికి గాక, విద్య సమ్యక్ పరిశోధన, సమ్యగవగాహన, ఆత్మావలోకనం ద్వారా యథార్థ జీవిత విలువలను తెలుసుకొనేందుకు సాయపడాలి. ఆత్మజ్ఞానం (Self Knowledge) లేనప్పుడు, ఆత్మప్రకాశం (Self Expression) ఆత్మాతిశయం (Self Aggression) అవుతుంది. అట్టి స్థితి కలహాలకు కారణమయ్యే ఆశ, మోహాలవంటి వైరుధ్యభావాలను పెంపొందిస్తుంది. విద్య ఆత్మావలోకన సామర్థ్యాన్ని పెంచేదిగా ఉండాలిగాని, ఆత్మస్తుతికి- తద్వారా పరనిందకు కారణం కాకూడదు.

విద్యావిధానాలంటూ వింటున్నాం. విధానాలు శాశ్వతాలు కావు. మనలో మౌలికమైన పరివర్తన కలిగినప్పుడు మనం ఏర్పరచుకొన్న విధానాలు కూడా మారుతుంటాయి. వ్యక్తి తనలోని పరివర్తనను అవగాహన చేసుకోనప్పుడు అది ఏపక్షానికి చెందిన విధానమైనా సుఖశాంతుల నివ్వదు. అవగాహన ఆత్మజ్ఞానం (స్వస్వరూపజ్ఞానం) ద్వారానే సిద్ధిస్తుంది. ఆ స్థితి సంపూర్ణ మానసిక పరిణామం ద్వారానే లభ్యమవుతుంది. విద్యకు

అర్థం- తనను తాను తెలుసుకోవటం. తద్వారా ఇతరులను కూడా అర్థం చేసుకోటానికి (పరరూపజ్ఞానం) వీలవుతుంది.

సరియైన విద్య ఏదో తెలుసుకోటానికి ముందు మన దృక్పథంలో మార్పు రావాలి. అందుకు మనం తిరిగి విద్యను అభ్యసించాలి. పవిత్రత, మహత్తర ఆశయం, భావి సుఖం- వంటి ఆలోచనల మాటున జరిపే హింసా దౌష్ట్యాలకు స్వస్తి పలికి, ఉన్నదానిలో సంతృప్తి చెంది సర్వోత్కృష్టాన్ని అరసి జాలి, దయ, కనికరాలను పెంచుకోవాలి. అప్పుడే మానవ జాతికి ముక్తి.

విద్యారంభం అంటే జీవిత అంతరార్థాన్ని తెలుసుకోటానికి నాంది పలకటం. లేతమనసులను స్వేచ్ఛగా ఎదగనీయక- పిల్లలు మన సొంత ఆస్తులుగానో, వాళ్లు మన వారసులు గానో, లేదా మన ఆశలను తీర్చే ప్రతినిధులు గానో భావించి మన అభీష్టాలకు అనుగుణంగా మలచే ప్రయత్నంలో ముందుగానే కొన్ని నిర్ణయాలు తీసుకొని వారి మేధను కూడా క్రమబద్ధం చేయటం ద్వారా వారికి ఎంతో అపచారం చేస్తున్న వాళ్లమవుతున్నాం. ఇదే నేడు నెలకొన్న వ్యవస్థ. ఇటువంటి వ్యవస్థలో ప్రేమకు తావుండదు. పిల్లల భవిష్యత్తు గురించి తాపత్రయం, వాళ్లు పెరిగి పెద్దవాళ్లయి ఉన్నత స్థానాలు అధిరోహించాలనే ఆరాటం తప్పించి ఆలేతగుండెలలో దాగి ఉన్న అభిరుచులతో పెద్దవాళ్లకు నిమిత్తంవుండదు. తల్లిదండ్రులు ఎక్కువగా వారి వారి వ్యక్తిగత సమస్యలతో సతమతమవుతూ, వారి పిల్లల మంచి, చెడులను చూచే బాధ్యతను ఉపాధ్యాయులపైన మోపుతారు. విద్యాబోధకుడు ముందుగా అటువంటి తల్లిదండ్రులకు విద్యాబోధ చేయాలి.

సమసమాజస్థాపనకు, ఉత్తమ విద్యాబోధనకు ఉపాధ్యాయులకు గూడా గురుతర బాధ్యత ఉన్నది. బోధకుడు తన బాధ్యతలను కర్తవ్యాన్ని సాంఘిక పరాయణతలను గుర్తెరిగి ప్రవర్తించాలి. ఓరిమి, ఆలోచన, ప్రేమ, సానుభూతి అలవరుచు కోవాలి. ఏదో ఒక విధానాన్ని వివేచన లేకుండా అనుసరించటం గాక, సమస్యను క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలి. వాటిని దూరంగా చూచి ఊహించుకొని భయపడి, ఆభయాన్ని కప్పిపుచ్చు కుంటూ మనసులోనే మధన పడటం ద్వారా, ఆ భయాన్ని విద్యార్థులకు గూడా అంటించే ప్రమాదం ఉంది. బోధకుడు ముందుగా తాను

స్వేచ్ఛపొంది, విద్యార్థులు కూడా స్వేచ్ఛావాతావరణంలో పెరిగేందుకు సాయపడాలి. తన జీవిత విలువను తెలుసుకొంటూ, విద్యార్థులకు గూడా ఆ ప్రయత్నంలో సాయపడటం వల్ల వారిరువురి మధ్య సత్సంబంధాలు ఏర్పడుతాయి. స్వేచ్ఛను, బుద్ధి సూక్ష్మతను మేల్కొలపటానికి అధికారం ఒక ఆటంకం. అధ్యాపకుడు, విద్యార్థిపై అధికారాన్ని చెలాయించ కూడదు. అధికారం పెంపొందించటమనేది అంతర్గతంగాను బహిరంతంగానూ జరిగే క్రియ. విద్యాబోధన ఆత్మ సంతృప్తి కాదు- అది ఆత్మ పరిత్యాగం.

మానవుల అనేకానేక సమస్యలలో మనోవికారం- కామేచ్ఛ జటిలమయింది. విద్యా బోధకులు ఈ సమస్యలను తెలియ పరచే విధానం వారి మనఃస్థితిపై ఆధారపడి ఉంటుంది. నిర్వ్యసనం, నిగ్రహం ఎంతో అవసరం. కామం మనసుకు సంబంధించినది. కోరిక, నిరాశ, నిస్పృహల వంటి ఉచ్చులలో చిక్కుకొన్నప్పుడు, ఆ ఉచ్చులలో నుంచి బయటపడేందుకు కామం మార్గం అవుతున్నది. ఆ అనుభూతిని పొడిగించుకోవాలని పడే తాపత్రయంతో కామానికి బానిసలవుతున్నారు. మత్తు పానీయాలు మాదక ద్రవ్యాలు కూడా ఆకోవకు చేరినవే. క్షణికమైన సుఖాలకు పొంగి, పదే పదే అనుభవించి ఆ క్షణికానుభూతిని నిలుపు కోవాలనే భ్రాంతితో వాటికి కూడా బానిసలవుతున్నారు. సృజనాత్మక జీవనం ద్వారా మనం ఈ సమస్యను పరిష్కరించు కోవచ్చు.

సృజనాత్మక జీవనమంటే 'తాను' అనే భావనముండి విముక్తి పొందటమని గ్రహించాలి. అట్టి జీవనానికి భయం ఒక అడ్డుగోడ. గౌరవార్హత భయానికి రూపాంతరం. గౌరవం, నీతి అంటూ పేర్లు పెట్టుకొని తాముగా విధించుకొన్న విధానాల అధీనపు బ్రతుకులలో జీవిత పరమార్థాన్ని గ్రహించలేరు. వారు నిర్మించుకొన్న నీతి, నియమాలు, మూఢనమ్మకాలు, ఆదర్శాలు- వారు అనుసరించే మతాలపై ఆధారపడి వుంటాయి. ఆత్మ సంతృప్తికరమైన ధార్మిక జీవితం గడుపుతున్నామను కొంటున్న ఈ గౌరవనీయులు కూడా అయోమయం, ఆత్మ సంఘర్షణ, భయం, దుఃఖం వంటి బాధలలో చిక్కుకొంటారు.

భయం ఒక మానసిక స్థితి. భద్రత కోల్పోవటం వల్ల ఇది మనసును ఆవహిస్తుంది. భయం అధికారాన్ని అంగీకరించి తల ఒగ్గేట్లు చేస్తుంది. ఆ కారణంగా సృజనాత్మక శక్తి నశిస్తుంది. కోరిక, తృప్తి, మనోరథాలలో

తగులుకోకుండా, భయానికి తావులేని స్థితిలో స్వేచ్ఛగా జీవించగలిగినప్పుడు సృజన ఉంటుంది.

ప్రేమ కరువైన జీవితానికి సుఖ శాంతులుండవు. సౌశీల్యం, స్వచ్ఛత, పవిత్రత- ప్రేమ ద్వారానే లభిస్తాయి. విద్యాబోధకుడు ముందు తన హృదయాన్ని, మనసును పరిశుద్ధం చేసుకోవాలి. విద్యాబోధకుడే సందిగ్ధావస్థలో పడి కుటిల మనస్కుడై కోరికల ఊబిలో కూరుకు పోయినప్పుడు ఇతరులకు జ్ఞానబోధచేసి, విద్యార్థులను సక్రమమార్గంలో పెట్టలేడు. మనం ఎన్నో ప్రేరణల, ఆకస్మిక సంఘటనల ఫలితాలమనే విషయం గ్రహించాలి. ఎవరికి వారే ఈ అయోమయాన్ని అర్థం చేసుకొని బయటపడాలన్నారు కృష్ణమూర్తి.

కళల గురించి ముచ్చటిస్తూ-

పరవశత్వానికి కళలు ఉపకరిస్తున్నాయి. త్రాగుడు, వ్యసనం, నిగూఢమత సిద్ధాంతాలు కూడా మానవులను మైమరపిస్తున్నాయి. అవి కలిగించే ఆనందం క్షణికమైనా వైరుధ్యాన్ని, సంశయాలను మానవ జీవితంలో సృష్టిస్తున్నాయి. వైరుధ్యం ఉన్న చోట సృజన ఉండదు. సరియైన విద్య వైరుధ్యాలను, సంశయాలను ఎదుర్కొనేందుకు సాయపడాలి. అప్పుడే సృజన ఆవిర్భవిస్తుంది- అన్నారు. కృష్ణమూర్తి అభిప్రాయం కళాఖండాలు కేవలం ప్రతిరూపాలే కాని యథార్థాలు కావు. వాటిలో కళాకారుల ఆత్మ ప్రతిబింబిస్తుంది. మనం మాతృకలను చూచి స్పందించ గలగాలేకాని ప్రతిరూపాలను చూచి మురిసిపోయి సంతృప్తి పడకూడదు. అలాగే ప్రకృతిలోని సౌందర్యంతో బాటు, వికృతాన్ని కూడా చూచి స్పందించినప్పుడు జీవితంలోని యథార్థం దర్శించ గలం. నిజమైన సౌందర్యారాధనలోనే ఆ స్థితి సిద్ధిస్తుంది.

సృజనలోని ఆనందం వెల్లివిరియాలంటే- ఇంద్రియలౌల్యానికి, పరవశత్వానికి లొంగక, హృదయాలలో మనస్సులలో ఆవరించి ఉన్న శూన్యాన్ని ఎఱుక పరచుకొని, వికాసం చెంది, బహుసునిశితంగా ఉండాలి. ఆ ఆనందాన్ని అందుకోటానికి పిల్లలలో లాలిత్యాన్ని, సునిశితత్వాన్ని పెంపొందించాలి. పిల్లల కన్న ముందుగా పెద్దలు ప్రకృతి శోభను యథాతథంగా చూచి స్పందించ గలగాలి. ఆ సమదృష్టి సమ్యగవగాహన పిల్లలు కూడా పొందేందుకు ప్రయత్నించాలి.

అప్పుడే నిజమైన సౌందర్యం అవగతమవుతుంది.

# 8

# మతం - మతజీవనం

కృష్ణమూర్తి దృష్టిలో మతం కల్లోలాలను సృష్టించిందే కాని మానవాళికి మేలు చేకూర్చ లేదు. మత విశ్వాసం మనుష్యుల్ని మూఢుల్ని చేసింది. మతం మత్తులో వివేకం కోల్పోయిన మానవుల విచక్షణారహిత ప్రవర్తన అనర్థాలకు దారి తీస్తుంది. ఈ విపత్కర పరిస్థితులను ఎదుర్కొని సత్యాన్వేషణ ద్వారా మానవుడు విముక్తి పొందాలంటూ కృష్ణమూర్తి ''మతం, మతజీవనం'' అనే అంశాలపై పలుమార్లు ప్రసంగించారు.

'మతం' అంటే అభిప్రాయం లేక విశ్వాసం. కాని వాస్తవం అందుకు భిన్నంగా ఉంటుంది. ఎవరి అభిప్రాయాలు, విశ్వాసాలు వారివి కాగా వాటిని ఇతరులు సమ్మతించటం సమ్మతించక పోవటం అనేది వారి వారి ఇష్టాయిష్టాల ననుసరించి ఉంటుంది. అమాయకు లెప్పుడూ మంచి- చెడు, మేలు- కీడు అనే విచక్షణ లేకుండా చెప్పిందల్లా విని తలలూచేసి విధేయులుగా ఉంటారు. విశ్వాసాలు అలవాటైన మనసు ఏదో ఒక సూత్రానికో, సిద్ధాంతానికో కట్టుబడి ఉంటుంది. మానవుని మేధలోని ఆలోచనా గతమైన నిర్మాణాభిలాష సత్యాన్వేషణకు అవరోధమవుతున్నది. గత అనుభవాల నుంచి, ఆ అనుభవాలు ప్రేరేపించే ప్రతి చర్యల నుంచి ఆలోచన ఉద్భవిస్తుందన్నారు కృష్ణమూర్తి. అందువల్ల విశ్వాసమనేది- కట్టుబాటుకు, భయ ప్రకంపనానికి లేదా సుఖప్రద జీవన వాంఛల తీవ్రతకు లోనై వుంటుంది.

మానవుడు బాధామయ, వ్యధా భరిత దైనిక జీవితంతో విసుగుచెంది, అటువంటి జీవితానికి అతీతమైన శాశ్వత సుఖాన్ని సదా అపేక్షించుతుంటాడు. ఆ అపేక్ష ఆలయాల నిర్మాణానికి, మత స్థాపనకు హేతువయింది. తానుగా కుదుర్చుకొన్న నమ్మకాలు విశ్వాసాలుగా, ఆ విశ్వాసాలు వాస్తవం కన్న ప్రీతి పాత్రంగా పరిణమించటం వల్ల, ఇంగితం నశించి, చిత్ర హింసను, విధ్వంసాన్ని, అఘాయిత్యాలను ప్రోత్సహించాయి. ఆ విశ్వాసాలు నిలుపుకోటానికి ఎటువంటి త్యాగానికయినా సిద్ధమవుతున్నాడు. ఆ విశ్వాసంలో భద్రత, శాంతి, సుఖం ఉంటాయనే భ్రమ అతన్ని వెన్నంటి మరో ఆలోచన లేకుండా చేస్తున్నది. మానవుడు మత జీవిగా యుగాలుగా మనుగడ సాగిస్తున్నా స్వార్థం, అతిశయం, కలవరం ఇంకా అతన్ని అంటి పెట్టుకొనే ఉన్నాయి. మతాలు కొంత వరకూ సామాజిక జీవితానికి ఉపకరించినా మానవుల మధ్య కక్షలు పెంచి, హింసాగ్నిని రగిలించటం వల్ల అవి చేసిన మేలు కన్నా కీడు అధికమని కృష్ణమూర్తి అభిప్రాయం.

వారి ఉద్దేశంలో మత స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు అన్నవాదనలో అర్థం లేదు. మతం ద్వారా ఊరట, సంఘీభావం, ప్రేమవంటి లాభాలు పొందవచ్చునన్న వాదనను కూడా తిరస్కరించారు. భక్తి నివేదన ద్వారా భగవచ్ఛాయలో పరమానందం పొందుతున్నా మన్నవారితో ఛాయకన్న మూలం ప్రధానమని వాదించారు. కృష్ణమూర్తి దృష్టిలో అప్రమాణికమైన దేదీ సత్యంకానేరదు. ఏ విశ్వాసమూ, ఏ నమ్మకమూ లేకుండా జీవించటం అసాధ్యమనే అభిప్రాయాన్ని తిరస్కరించుతూ అవి కొన్ని రకాల మానసిక రుగ్మతలను బహిర్గతపరుస్తూ బద్ధిమాంద్యాన్ని పెంచుతాయన్నారు.

'మతం' అన్నది కృష్ణమూర్తి దృష్టిలో మాటలు పొదిగి వ్యక్తం చేయలేనిది. అంతేగాక అది ఆలోచనలకు అతీతమైనది. విషయ వివేచన ప్రయోజనం పరిమితం. తెలుసుకొన గోరే విషయాన్ని గురించి ముందుగానే ఒక అభిప్రాయం ఏర్పరచుకోవటం సహజం. భయం, భద్రత, ఉపశమనాది భావనలు మనసును ఆక్రమించుకొని, ఏవోకొన్ని సర్దుబాట్లు చేసుకొని ఉండటం వల్ల ఆ మనసు ద్వారా పొందే అన్వేషణ ఫలితాలు సత్యదూరాలవుతాయి. గత అనుభవాలు స్మృతిపథంలో నిక్షిప్తమై వుం

టాయి. భావనల ద్వారా అవి మనసులో మెదులుతుంటాయి. సత్యాన్వేషణ మంటే అదేనన్న భ్రమలో ఉంటారు, కొందరు.

పరమార్థం పేరుతో ఆస్తులు, అంతస్తులు కూడగట్టుకొనే ప్రచార సాధనంగా మతం మార్పు చెందింది. అది ఒక విశ్వాసంగా నెలకొని, సిద్ధాంతంగా రూపొంది, కర్మకాండగా పరిణమించటంతో మతం మన నిత్య జీవితానికి దూరమయింది. లోభం, అత్యాశ, మోసం, దగా మనల్ని అంటి పెట్టుకొని ఉండగా, కేవలం విశ్వాసాలను మాత్రమే ఆశ్రయించటం వల్ల జీవితానికి అర్థం కొరవడుతుందంటారు, కృష్ణమూర్తి. అంతకన్నా, ఏ భగవంతుడినో, ఏ సంరక్షకుడినో, లేదా ఏ గురువునో ఆశ్రయించి విశ్వాసాలకు దూరంగా ఉండటం వల్ల అవి మన నిత్యజీవితాలను స్పృశించే అవకాశం ఉండదంటారు.

నమ్మకాలు, అపనమ్మకాలు- అనేవి కాల, సామాజిక, ప్రచారాల ప్రభావాలకు లోనై ఉంటాయి. ఈ ప్రచారంలోనుంచి బయటపడి స్వతంత్రంగా ఆలోచించగలిగిన నాడు, ఈ పరిస్థితులకు అతీతమైన దాన్ని కనుగొనగలమంటారు, కృష్ణమూర్తి. అందుకు ముందుగా విశ్వాసాలను వదలు కోవాలి. అన్వేషణకు స్వేచ్ఛ అవసరం. భయం, ఆందోళన, మానసిక భద్రతాపేక్షల నుండి విముక్తి చెందాలి. నిర్వికార, నిరహంకార, నిష్పాక్షిక, నిర్మల మనస్సు సత్యాన్వేషణకు ప్రధాన ఉపకరణం. తనలోని వైరుధ్యాన్ని తెలుసు కొనగలిగితే మనసు తనంతట తాను స్వేచ్ఛ పొందగలుగుతుంది. అందుకు ప్రత్యేక కృషి, ప్రయత్నం అనవసరమం టారు, కృష్ణమూర్తి.

మానవునికున్న శక్తి స్వల్పం. ఉన్న ఈ స్వల్ప శక్తిని వృథా ప్రయాసలకు, పోరాటాలకు, విరోధాలకు వినియోగిస్తుంటారు. మానసిక శక్తితో బాటు, దేహ బలం కూడా అవసరం. విలక్షణమై, వివేచనాపేక్ష కలిగిన నిర్వికార మనస్సు, రాగ ద్వేషాలకు అతీతమై, ఏ ఉద్రేకమూ లేకుండా ప్రేమతోనిండిన దయాంతరంగ హృదయం ద్వారా మానసిక, భౌతిక శక్తులు పొందగలగాలి. అప్పుడే సత్యాన్వేషణ సుకరమవు తుందన్నారు.

సత్యాన్వేషణమంటే అసలు విషయాన్ని అవగతం చేసుకోవటం. ఉన్నదాన్ని ఉన్నట్లుగా పరిశీలించటం ద్వారా అవగాహన ఏర్పడుతుంది. ఆ అవగాహనను జీవితానికి అన్వయించుకోవటం ద్వారా విషయాన్ని అవగతం చేసుకోగలం. మానవ జీవితాలు సంకుచిత పరిధిని దాటాలి. సంకుచిత పరిధిలో అపూర్వానుభవాలు అసంభవం. ఈ అతిశయం, ఈ ఆకాంక్ష, ఈ ఆవేదన, ఈ ద్వేషం, ఈ నేర ప్రవృత్తి, ఈ హింసా ప్రవృత్తి మనలో అంతమొందించక ఏవో అపూర్వానుభూతులు పొందాలనుకోవటం నిరర్థకం. మాదక ద్రవ్యాలు, మత్తు పదార్థాల ద్వారా విశేషానుభూతి పొందాలనుకోవటం అవివేకం. వాటిని సేవించటం వల్ల ఆశించిన ఫలితాలు దక్కక పోగా వాటికి బానిసలవుతుంటారు. వాటి నిరంతర సేవనం వల్ల మనసు మొద్దుబారి వికృతంగా తయారయ్యే ప్రమాదం కూడా ఉన్నది- అంటూ యోగాభ్యాసం కూడా పరిమిత ఫలితాలనే ఇస్తుందన్నారు.

యోగం అనేది వారి దృష్టిలో ఒక జీవన విధానం. యోగాభ్యాసం శరీరాన్ని స్వాధీనంలో ఉంచుతుందే గాని, దాని వల్ల పెద్ద ప్రయోజనం లేదు. అలాగే మంత్రోపాసన. మంత్రాలు కేవలం కొన్ని అక్షరాల సముచ్చయాలు. మంత్రోచ్చారణ ద్వారా అంతరంగంలో శబ్ద సృష్టి జరుగుతుంది. సుదీర్ఘ మంత్రోచ్చారణ వల్ల ఆ శబ్దం ఉజ్జీవమై అదేదో అద్భుతంగా భాసిస్తుంది. అది కేవలం ఆత్మసమ్మోహనం మాత్రమేనంటూ దాన్ని కూడా నిరాకరించాలంటారు.

ఒక విధానానికి, ఒక పద్ధతికి అలవాటు పడటం వల్ల బుద్ధి చురుకుతనం కోల్పోతుంది. కనుక విధానాలు, క్రతువులు వంటి ప్రక్రియలనుంచి బయటపడటంవల్ల భయం, కోరిక, పరాధీనతలు కూడా వైదొలగి మనసు స్వాస్థ్యం పొందుతుంది. అటువంటి మనసు సచేతనంగా తీక్ష్ణంగా స్థిరంగా ఉంటుంది. మనసుతో బాటు హృదయం కూడా అదే స్థితిలో ఉండటం వల్ల సత్యాన్వేషణ సజావుగా సాగుతుంది.

ఎఱుక, జాగరూకత- అన్నవి సత్యాన్వేషణకు సులభ మార్గాలు అంటూ కృష్ణమూర్తి వాటికి వివరణ ఇచ్చారు. ఎఱుక అంటే ఉన్నది ఉన్నట్లుగా చూచి తెలుసుకోవటం. కేవల అవలోకనంలో అభిప్రాయాలకు,

ఆలోచనలకు తావుండదు. జాగరూకత అంటే మనసు లోపల, బయటా జరిగే క్రియలను తెలుసుకోవటం. అందులో ప్రతిరోధం, నిరోధం ఉండకూడదు. ఎఱుక జాగరూకతలు మనసుకు అసాధారణ జీవశక్తి, చైతన్యాలను ఇస్తాయి. జాగరూకత లేక జాగ్రదవస్థ ఏకాగ్రతకు భిన్నమైనది. ఏకాగ్రత అనేది ఒక విధమైన బహిష్కార ప్రతిరోధచర్య. ఏకాగ్రతలో ప్రయత్నం ఉంటుంది. ప్రయత్నం సంఘర్షణకు దారి తీస్తుంది. తద్వారా శక్తి, సమయం వృథా అవుతాయి. శరీరం కొన్ని క్షణాలైనా కుదురుగా ఉండదు. శరీరంలోని ఏదో ఒక అవయవం ఎప్పుడూ కదలికలోనే ఉంటుంది. అలాగే మనసుకూడా సదా సంచరిస్తూనే ఉంటుంది. సంచారం స్తంభించినప్పుడు భయం ముంచుకొస్తుంది. అందుకని ఏదో ఒక పని కల్పించుకొంటుంది. దాన్ని అణచిపెట్టాలని ప్రయత్నిస్తే, ఆ ప్రయత్నం నిలిపిన మరుక్షణంలోనే తిరిగి విజృంభిస్తుంది. ఎఱుక, జాగ్రదవస్థ- రెండూ కలిసే వుంటాయి. ఈ రెండూ కలసి తీక్షణంగా పనిచేయ గలిగిన స్థితి ధ్యానం అవుతుందంటూ, ధ్యానం అవసరాన్ని విశదం చేశారు.

ధ్యానస్థాయిని చేరుకొన్న మనసు సత్యాన్ని అవలోకిస్తుంది. ఆ మనః స్థితే- ఆత్మావగాహన. ఆత్మావగాహన- ఆత్మజ్ఞానాన్ని లేక స్వస్వరూప జ్ఞానాన్ని ఎఱుక పరుస్తుంది. మనసు పూర్తి ఎఱుకలో ఉన్నప్పుడు ప్రశాంతంగా ఉంటుంది. ఆ ప్రశాంత స్థితిలో మనసు సత్యాన్ని దర్శించటమే గాక సత్యానికి ఆవలి తీరాన్ని కూడా చూడగలుగుతుందంటారు. అదే మతైక మనస్సు- అదిగతాన్ని పూర్తిగా విస్మరించి గతస్మృతిని కొంతవరకు మాత్రమే వినియోగించుకుంటుంది. ఈ స్థితిని మాటలతో వివరించలేం. దాన్ని ఎవరికి వారే అనుభవంలోకి తెచ్చుకోవాలంటారు. కనుకనే ''మతం'' అంటే మాటలతో నిక్షేపించటం శక్యంగాదు. ఆలోచన ప్రమాణాలకు లొంగి ఉంటుంది గనుక మతం ఆలోచనలకు లొంగనిది- అని కృష్ణమూర్తి ఉద్దేశం.

ఉపాసన, ఆరాధనలు విశ్వమంతటా అంగీకరించిన సంప్రదాయాలు. కృష్ణమూర్తి వాటిని తిరస్కరించారు. మనమే అల్పులం; మనకన్న గొప్పది అనుకొని ఆరాధించటంలో మన అల్పత్వాన్ని, అవివేకాన్ని ప్రదర్శించుకొంటాం. అల్పత్వం ఔన్నత్యాన్ని తన స్థాయికి తగినట్లే చూడ గలుగుతుంద

న్నారు. కృష్ణమూర్తి దృష్టిలో ఆరాధకుడే ఆరాధితుడు. మనం ఏర్పరచు కొన్న ఆకృతే మనల్ని మత్తులో నింపుతుంది. ఆ ఆకృతి మన జ్ఞాపకాల నుంచి ఊహించి ఏర్పరచుకొన్నట్టిది. మనసులో ఏర్పరచుకొన్న ఆకృతు లను ఆరాధించటం వల్ల మనల్ని మనమే ఆరాధించుకొంటున్నాం. అంటే మనోగతరూపాలనే ప్రేమించి, నిరంతర ఆరాధన ద్వారా వాటికి పవిత్రత ఆపాదిస్తున్నాం. ఆలోచనలనుండి ఉద్భవించినదేదీ పవిత్రం కానేరదు. పవిత్రత రూపొందిన క్షణమే ఆలోచన మరుగున పడుతుంది. ప్రవచనాల ద్వారా కాని, ప్రతీకల ద్వారా కాని వ్యక్త పరచటం సాధ్యం కాని స్థితి అది అంటూ- అలావ్యక్తమయిన మరుక్షణం అది మరొకటి అవుతుంద న్నారు.

మతజీవనాన్ని విశదపరుస్తూ- మత పరంగా ఉండటమంటే ఆరాధించటం కాక అంకితమవటం- అన్నారు. అత్యంత తీవ్ర సంకల్పంతో సత్యాన్ని శోధించటమే నిజమైన మతం- సత్యశోధకుడే నిజమైన మతజీవి. అందాన్ని, ఆనందాన్ని త్యజించటం మత జీవనానికి మార్గం కాదు. క్షుబ్ధ చిత్తం, శిధిల మనస్సు, వక్రబుద్ధి, హింసా ప్రవృత్తి మన జీవితాలకు అవరోధాలు. అటువంటి మనసులలో కేవలం అలజడి మాత్రమే నిండి ఉంటుంది. అటువంటి మనసులోని కోరికలు, ఆత్మగతమైన ఆలోచనలకు ప్రతిరూపాలంటూ, ఆ స్థితిలో మతజీవనం అసాధ్యం అని తేల్చి చెప్పారు. అంతే గాక, మత పరత్వమంటే- మనసా, వాచా, కర్మణా సర్వం ఒకటికావటం. ప్రశాంత చిత్తమే ఆస్థితిని చేరుకొని, జీవన సర్వస్వాన్ని ఒకటిగా చూడగలుగుతుంది. అందులో విభజనకు తావులేదు- అంటూ- మతజీవులమని చాటుకోవటం, అతీంద్రియ శక్తులను ప్రదర్శించటం ద్వారా ప్రాపంచిక విషయలౌల్యాన్ని బహిర్గతం చేసుకోవటమే అవుతుందని- నిష్కర్షగా చెప్పారు.

మతం పేరుతో మానవాళికి జరుగుతున్న అన్యాయాలను, అక్రమా లను నిర్మొహమాటంగా తమ అప్రతిహతమైన తర్కంతో తృణీకరించారు. మత వ్యవస్థ మానవ జాతిని మభ్య పెట్టిందే కాని మేలు చేకూర్చ లేకపోయిందనేదే కృష్ణమూర్తి అభిప్రాయం.

# 9

# హింసా కాండ

''హింస'' అంటే కేవలం సంహారమనే గాక దౌర్జన్య దౌష్ట్యాహంకారాల ద్వారా బాధించే ఉగ్రస్వభావమని కూడా అర్థం చేసుకోవాలంటూ, ''నేను, నాది, నాకు, నన్ను'' అనే భావనలు ఏ ప్రమాణంలోనైనా ఉన్నంత కాలం ''హింస'' ఉండి తీరుతుంది- అన్నారు, హింస గురించి వారు చేసిన విశదీకరణ మనం తెలుసుకోవాలి.

మనం నిర్మించుకొన్న సమాజమే హింసా పూరితం. ఈ సమాజంలో మానవులుగా చెలామణి అవుతున్న మనం దౌర్జన్య పూరితులం. మన యత్నాలకు, శ్రమకు, వేదనలకు, భయంకరమైన క్రౌర్యానికి ఫలితాలే మన పరిసరాలు, మన సంస్కృతి. మనలోని హింసా ప్రవృత్తి సమాజంలో కూడా ప్రతిబింబించటంలో ఆశ్చర్యం లేదు.

ప్రపంచమంతటా హింసాధోరణి చేస్తున్న విలయాన్ని కూడా మనం గమనిస్తున్నాం. ఈ ధోరణి అన్నిరకాల అనుబంధాలను విచ్ఛిన్నం చేసి మనకెంతో వ్యధను కలిగిస్తున్నది. ప్రశాంత జీవితానికి మనం అర్రులు చాస్తున్నాం. ప్రశాంత జీవితంలో ప్రేమ నెలకొని ఉంటుంది. హింసా ప్రవృత్తిని మనలో తుద ముట్టించట మెలాగన్నది మనం తీవ్రమైన విషయంగా పరిగణించి మన జీవన మార్గాన్ని సుగమం చేసుకొనే మార్గం తెలుసుకోవాలన్నారు.

భయ, మోద, ఖేద, భావన, హింసలు పరస్పర సంబద్ధాలు. హింసా ప్రవృత్తితో ఇతరులను నిరసించటం, ఒక జాతిని గాని, వర్గాన్ని గాని, లేదా ఒక మానవ సమూహాన్ని గాని ద్వేషించటం, ఇష్టంలేని వారితో వైర భావం కలిగి ఉండటం ద్వారా ఆనందం అనుభవిస్తుంటారు. కాని, హింసారహిత మానసిక స్థితిలో ఎంతో ఆనందం నిండి వుంటుందన్న వాస్తవాన్ని వారు గుర్తించ లేకపోతున్నారు.

హింస వివిధ స్థాయిలలో, వివిధ రూపాలలో ప్రజ్వరిల్లుతోంది. మానవ జాతి ఆవిర్భవించిన నాటినుంచి ఇదే ధోరణి కొనసాగుతున్నది. ఈ వాతావరణం నుంచి మనసు విముక్తి చెందటానికి ఆత్మవిమర్శ చాలా అవసరమంటారు, కృష్ణమూర్తి.

హింసకు హేతువు ''తాను'' అనే భావన. అదే ''అహం''. ఆ అహం ''స్వ'', ''పర'' భేదాలను సృష్టిస్తుంది. ఈ విభేదాల వల్ల మానవుల మధ్య అగాధాలు ఏర్పడి, కలహాలకు దారి తీసి ఫలితంగా హింస నెలకొంటుంది. హింసకు మూలకందాన్ని పెళ్లగించి మానవుడు స్వేచ్ఛ పొందాలి. కారణం వెదకినంత మాత్రాన హింస మాసిపోదు. కార్యకారణాలు రెండూ కలసి ఉంటాయన్న విషయం మనం గుర్తుంచుకోవాలి. వాటిని

విడివిడిగా కాక, ఏకంగా, నేరుగా పరిశీలించాలి. హింసను మనలోనుంచి తొలగించు కోకుంటే అనుదినమూ మనం పోరుతోనే జీవితాలను వెళ్ల మార్చాల్సి వుంటుంది.

బాహ్య ప్రపంచానికి సంబంధించిన యుద్ధాలు, సంక్షోభాలు, వైషమ్యాలు, పోరాటాలవంటి హింసాకాండనే గాక, మన అంతరంగాలలో నెలకొన్న హింసాప్రవృత్తిని సైతం గుర్తించి, ఎఱుక పరచుకొంటే గాని మనం ఆ ప్రవృత్తినుంచి విముక్తి పొందలేం.

శతాబ్దాల తరబడి మానవునిలో హింస రగులుతూనే ఉన్నది. మతాలు మానవుని సాదు చేసుకొనేందుకు ప్రయత్నించాయి. కాని, ఒక్కటీ పూర్తిగా సాఫల్యం పొంద లేదు. సమస్యా పరిష్కారానికి మనం లోతుగా మూలకందానికి చొచ్చుకు పోవాలి. ఉపేక్షా భావంవల్ల లాభం చేకూరదు. ఉదాసీన వైఖరి, బుద్ధికుశలతలతో మాత్రమే సమస్యను విశ్లేషించటం వల్ల మన ప్రయత్నాల ద్వారా ఒనగూడే ప్రయోజనం అంతంత మాత్రంగానే ఉంటుంది.

హింస ఒక శక్తి స్వరూపం. శక్తిని వక్రమార్గంలో ప్రయోగించటం వల్ల అది క్రోధంగా మారుతుంది. అందులో హింసా ప్రవృత్తి వచ్చిచేరు తుంది. బహిర్గతమయ్యే హింసా ప్రవృత్తిని భౌతికంగా గుర్తించవచ్చునే కాని, అంతర్గతంగా మానవుల మనసులలో నిబిడీకృతమై ఉన్న హింసా ప్రవృత్తిని వెదకి పట్టుకోవటం అంత సులువు కాదు. ఎవరికి వారే అనుభవపూర్వకంగా ఆ స్థితిని ఎఱుక పరచుకోవాలి. ఈ ప్రవృత్తికి జడిసి దూరంగా పారిపోక దాన్ని ఆకళింపు చేసుకోవాలి. నిరసన, సమర్థనల ప్రమేయం లేక దాన్ని యథారూపంలో గుర్తించి, విశ్లేషించాలి. అందుకు మనసు స్వచ్ఛంగా స్పష్టంగా ప్రసన్నంగా ఉండాలి. ఇష్టాయిష్టాలకు మనసులో తావుండకూడదు. 'ఇచ్ఛ' అనేది హింసా ప్రవృత్తికి ఆజ్యంవంటిది. దాన్ని హింసాగ్నికి అంటుకోనివ్వకూడదు.

హింసను మనం వాస్తవిక దృష్టితో అర్థం చేసుకోవాలి. ఏదో ఒక భావన, అభిప్రాయం లేదా ఒక ఉద్దేశంగా కాక అది మానవుని మనఃస్థితికి సంబంధించినదిగా, ఆ మానవుని స్థానం నుండే పరిశీలించాలి. ఎదుటివారికి

అందులో శ్రద్ధా సక్తులు లేకపోయినా నిరుత్సాహం చెందక ఆమూలాగ్రం పరిశీలించాలి. అప్పుడే హింసా ప్రవృత్తి విశదమవుతుంది. ఈ ప్రవృత్తి- కోపంలో, శారీరక సుఖాన్వేషణలో, ద్వేషంలో, ఈర్ష్యలో- ఇలా వివిధ మానసికోద్రేకాలలో వ్యక్తమవుతుంది.

హింస కేవలం సంహారంలోనే గాక పదునైన పదజాలం, వెకిలి చేష్టలు, వినయ విధేయతలు ప్రదర్శించటంలో కూడా దాగి ఉంటుంది. మనలోని భయాందోళనల కారణంగా మనం వీటికి లొంగి ఉంటాం. దేవతల పేరున జరిపే బలులు మాత్రమే గాక, సంఘం పేరున, దేశం పేరున జరిపే కసాయి పనులు అంతకన్నా దారుణమైనవిగా గ్రహించాలి.

హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు, ఆసియావాసులు, ఐరోపా వాసులు- అంటూ మతాల వారీగా, దేశాలు ఖండాల వారిగా పేర్లు పెట్టి పిలవటం కూడా ఒక విధంగా దౌర్జన్య భావానికి హేతువు అవుతున్నది. అలా వారిని తక్కిన మానవ సమాజం నుంచి వేరు చేసి చూడటం వల్ల కలిగే వ్యత్యాస భావం దౌర్జన్యానికి దారి తీస్తున్నది. హింసా ప్రవృతిని అవగతం చేసుకోటానికి దేశ, మత, రాజకీయ, వర్ణవిభేదాలకు అతీతంగా ఉండాలి. మానవ జాతిని సంపూర్ణ సౌమనస్యంతో అర్థం చేసుకోవటమే మన లక్ష్యం కావాలి.

ఆగ్రహంలో కూడా హింస (ఉగ్రం) ఉంటుంది. దాన్ని ధర్మయుక్త మని, అధర్మయుక్తమని విభజించటం సరికాదు. హింసకు ఆలవాలమైన ఆగ్రహాన్ని మన ఇష్టాయిష్టాలతో గాక సూటిగా పరిశీలించాలి.

మనం పుట్టిపెరిగిన జాతికో, దేశానికో, మతానికో లేదా కులానికో చెందిన వ్యక్తులుగా మనల్ని మనం బందీలుగా చేసుకోవటం వల్ల బుద్ధి మందగించి, నియమాలకు, నిబంధనలకు బద్ధులమవుతున్నాం. యథార్థ స్థితిని తెలుసుకొనేందుకు లోలోతులను స్పృశించే మౌలికమైన సామర్థ్యం కొంతవరకైనా పొందాలి. బుద్ధికి పదును పెట్టి, ఆత్మ వివేచనతో మన చుట్టూ కట్టుకొన్న అడ్డుగోడలను తొలగించుకొని సమ్యగ్ దృష్టి సమ్యగవగాహనలతో యథార్థాన్ని గ్రహించాలి. అప్పుడే సమస్యను సమగ్రంగా ఎఱుక పరచుకోగలం.

పోలికలు హింసా ప్రవృత్తిని ఎలా ప్రేరేపిస్తాయో- కృష్ణమూర్తి ఇలా వివరించారు. పోలికలు అసమానతలను సృష్టిస్తాయి. అసమానతలు కోరికలకు దారితీస్తాయి. కోరికలు ఈడేరటానికి అడ్డదారులు అవసరమవుతున్నాయి. తద్వారా కాఠిన్యం- ఆ కాఠిన్యం హింసకు బాటవేయటం- ఇలా ఒక దాని వెంట మరొకటి హింసకు దారి తీయిస్తున్నాయి. భయ, మోద, ఖేద గుణాలు హింసా ప్రవృత్తికి ప్రేరేపకాలు. సమాజం కూడా హింసా ప్రవృత్తిని వీరరస విశేషంగా పరిగణించి ప్రోత్సహించటం వల్ల, సమాజంలోని వ్యక్తులమైన మనం హింసాకాండకు బాధ్యులమవుతున్నాం.

హింసా ప్రవృత్తిలా ప్రేమ కూడా మనలోని శక్తికి ఒక రూపం. పవిత్రప్రేమలో అసూయ, ఆందోళన, వేదన, భయ, విద్వేషాలకు తావులేదు. శక్తిని సక్రమమార్గంలో ప్రయోగించితే హింసకు ఆస్కారం ఉండదు. ఈ విశేషమైన జ్ఞానేంద్రియ శక్త్యనుభూతికి జ్ఞానపరిపాకం, కోమల స్వభావం, మృదు హృదయం, సునిశిత దృష్టి- తద్వారా ప్రజ్ఞ అవసరం.

నమ్మకాలు ఎప్పుడూ యథార్థాలు కావు. ఈ నమ్మకాలు మనుషులను విడదీస్తున్నాయి. తద్వారా హింస చెలరేగుతున్నది. హింస నుంచి విముక్తి చెందాలంటే మానవుల మధ్యనున్న అంతరాలు తొలగిపోవాలి. నమ్మకాల్ను, సిద్ధాంతాలు, సంప్రదాయాల ప్రాతిపదికగా, దేశాల మధ్య, దైవాల మధ్య ఏర్పడిన వ్యత్యాసాలు, అభిప్రాయ భేదాలు, ఆదర్శాల ముసుగులు పటాపంచలై పోవాలి.

జీవితానికి లక్ష్యం జీవించటమేనని తెలుసుకోవాలి. ఎవరికి వారు తమ సదుపాయం కొద్దీ లక్ష్యాలు ఏర్పరచుకొంటుంటే ఎవరిదారి వారిదికాగా, మానవుల మధ్య అంతరాలు వ్యత్యాసాలు తప్పని సరి అవుతాయి. వ్యత్యాసాల ద్వారా వైషమ్యాలు తలెత్తుతాయి. చివరకు అది హింసకు దోహదమవుతుంది.

మానవుడు ముందుగా తాను జీవిస్తూ, ఇతరులను కూడా జీవించనివ్వటం నేర్చుకోవాలి. అప్పుడు హింసా ప్రవృత్తికి తావుండదు.

# 10

# విప్లవం

విప్లవ నినాదాలు నేడు సర్వసాధారణమైనాయి. పారిశ్రామిక విప్లవం, ఆర్థిక విప్లవం, రాజకీయ విప్లవం, మత విప్లవం, సాంస్కృతిక విప్లవం-ఇలా వివిధ రంగాలలో విప్లవ నినాదాలు వింటున్నాం. మార్పు, సంస్కరణ-విప్లవానికి చేరువగా ఉండే పరివర్తన దశలు.

కృష్ణమూర్తి ఈ మార్పు, సంస్కరణ, విప్లవాలను మానవుని మానసిక స్థితికి సంబంధించినవిగా విశ్లేషించారు. మౌలికంగా మానవుని అంతరంగంలో మార్పు కలగటం ద్వారా సమాజంలో కూడా మార్పు సహజం, అనివార్యం అవుతున్నది. ఈ మార్పు ప్రయత్నపూర్వకంగా కాక సహజోద్గమంగా ఉండాలి, అంటారు కృష్ణమూర్తి.

విప్లవం అంటే సాధారణంగా చెప్పుకొనే అర్థం సంపూర్ణ పరివర్తనం-పునర్వ్యవస్థీకరణం. ఇటువంటి మార్పును బాధలకు గురిఅయిన వారే ఎక్కువగా కోరుకొంటారు. ఏ బాధాలేని వారికి విప్లవాలతో పనిలేదు. ఆ బాధ తమను సోకనంతవరకూ వారికి ఆ ఊసే ఉండదు. తిరుగుబాటు, ఉద్యమం అనేవి ఉద్రేకంతో కూడుకొన్నవి. అవి ఎక్కువ కాలం నిలిచేవి కావు. అందువల్ల చెరుపుకు మూల కారణాలలో ఏవిధమైన మార్పూ ఉండదు.

చర్యకు ఒకప్రతిచర్య ఉంటుంది. ప్రయత్నించి ఎంతో కొంత మార్పు తీసుకురాగలిగినా తిరిగి మరొక రూపంలో దానికి ప్రతిగా మరొక ప్రయత్నం సహజమవటం వల్ల ఆ తీసుకురాగలిగిన మార్పు తాత్కాలికం అవుతున్నది. బాధకు కారణం సమసి పోనప్పుడు చేసే ప్రయత్నాలు వృధా అవుతాయి. ఈ పోరాటాలకు, ప్రతిఘటనలకు, వైరుధ్యాలకు, దురవస్థలకు, అయోమయానికి మూలం మనస్సు. ఈ సమస్య స్వరూప స్వభావాలను సమగ్రంగా అవగతం చేసుకోనంత వరకూ వీటినుంచి విముక్తి పొందలేం. సమస్యకు పరిష్కారం సమస్యను అవగాహన చేసుకోవటం ద్వారానే సాధ్యమవుతుంది. భయ విభ్రాంతులు మనస్సును అంటి పెట్టుకొని ఉన్నంత వరకూ స్వేచ్ఛ పొందటం అసాధ్యం.

దురదృష్టవశాత్తూ మానవుడు నమ్మకాలకు, విశ్వాసాలకు, ప్రభావా లకు, ప్రలోభాలకు లొంగిపోయాడు. అవి మత పరంగానో, రాజకీయ పరంగానో, ఆర్థిక పరంగానో ఉంటాయి. ఈ ఉచ్చులలో చిక్కుకొన్న మానవుడు స్వేచ్ఛను కోల్పోయి శాసన బద్ధుడైనాడు. ప్రచారాల ద్వారా విధానాలు ప్రాచుర్యం పొంది ఇతర ఆలోచనలకు తావు లేకుండా చేస్తున్నాయి. విధానాలు ఎవరో కొందరు విశ్వసించి రూపొందించినవి కాగా వాటిని ఇతరులు కూడా అనుసరించాలని బలవంత పెట్టటం అనుచితం. అవి సమకాలీన సమాజానికి సరిపడక పోవచ్చు. విధానాలు గత అనుభవాల నుంచి ఆలోచనల ద్వారా ఉద్భవించినవే కాని నిత్య నూతనమైనవి కావు. ఎవరి అనుభవాలు, ఆలోచనలు, ఆదర్శాలు, విధానాలు, వారివికాగా వ్యక్తిపరమైన ఆదర్శాలను, విధానాలను ఇతరులు కూడా అనుసరించాలని బలవంతం చేయటంతో సంఘర్షణ ఆరంభమవు తుంది. స్వతంత్రంగా ఆలోచించలేనివారు, ఆలోచించినా ఎదురించ లేని వారు సమాధానపరచు కొని వాటికి లొంగిపోతున్నారు. వ్యక్తులతో నిమిత్తం లేక- విధానాలకు, ఆ విధానాలను ఆసరాగా తీసుకొని ప్రాబల్యం పొందుతున్న వారికి మాత్రమే ప్రాధాన్యం లభిస్తున్నది.

విధానాలను అనుసరించినంత మాత్రాన ప్రయోజనం చేకూరదు. మౌలికమైన మార్పు విప్లవం ద్వారానే సాధ్యం. అది మూలాధారాలను కుదుప గలగాలి. వ్యక్తిపరంగానే అది ఆరంభం కావాలి. భౌతికమైనటువంటి బాహ్యవిప్లవం కన్న ఆంతరంగిక విప్లవం ప్రధానం. బాహ్య విప్లవం కేవలం

మార్పు మాత్రమే. అంటే అంతకుముందు నెలకొన్న దానికి కొంత మార్పు మాత్రమే. ఆంతరంగిక విప్లవం అలాగాక నిత్యశోభితమైనది. అది యథార్థ స్థితిని ఎఱుక పరచు కోవటం వల్ల సాధ్యమవుతుంది. అసంతుష్టితో, ఆత్మపరిశీలన జరుపుకొంటూ యథార్థస్థితిని గమనిస్తూ ముందుకు సాగాలి. అప్పుడే వికాసం కలుగుతుంది. అగ్నిరగులు కొంటుంది. సత్యం గోచరమవుతుంది.

కృష్ణమూర్తి దృష్టిలో ప్రస్తుత అనర్థాలకు. కారణాలు ముఖ్యంగా మూడు.

- ప్రపంచంలో నెలకొన్న వైరుధ్యాలకు కారణం - భౌగోళిక, ఆర్థికపరమైనవి గాక కేవలం అభిప్రాయాలకు సంబంధించిన విభేధాలు మాత్రమే. ఈ భ్రమ కల్పితమైన భావనలకోసం, అభిప్రాయాలకోసం నిర్దాక్షిణ్యంగా నరుకుకొంటున్నారు. అందుకు ఏత్యాగానికైనా సిద్ధమవుతు న్నారు.

- మానవుడు, మానవ జీవిత విలువలు ప్రధానం గాక, స్వార్థం కోసం, స్వప్రయోజనాలకోసం మనుష్యులను బలిపశువులను చేయటం రెండవది.

- వ్యక్తివిలువ కన్నా వస్తువిలువలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తూ విషయ వాంఛలలో తగులుకోవటం మూడవ కారణం. తద్వారా హింసా ప్రవృత్తి, పగ, ద్వేషం చెలరేగుతున్నాయి.

అపూర్వమైన ఈ విషమపరిస్థితిలో, ఏదో ఒక అపూర్వమైన పరిష్కార మార్గం ఆవశ్యక మవుతున్నది. అటువంటి పరిష్కార మార్గం మానసిక విప్లవం ద్వారానే సాధ్యమవుతుంది. అదే అతని అంతర్గత స్వభావంలో మార్పును తీసుకురాగలుగుతుంది.

విధానాలు మనిషిని మౌలికంగా మార్చలేవు. విధానాలను మానవుడు మార్చుతున్నట్లు చరిత్ర చెప్పుతున్నది. క్రమపరిణామం కూడా అంత ప్రయోజనకరమైనది కాదు. అది తక్షణ ఫలితాలను ఇవ్వలేదు. అలాగే సంస్కరణ కూడా సత్ఫలితాలను ఇవ్వలేదు. ఒక సంస్కరణ మరొక సంస్కరణకు కారణమవుతున్నది. అందువల్ల మార్పు అసంపూర్ణమవుతు న్నది. కనుక విప్లవం అనేది అనివార్యమే గాక సాధ్యం కూడా అవుతున్నది.

మనలను ఆవరించి ఉన్న సాంఘిక, మత, సాంస్కృతిక, రాజకీయ సమస్యలన్నీ చాలా జటిలమైనవి. ఈ సమస్యల వలయం నుంచి బయటపడేందుకు ఒక క్రొత్త మార్గాన్ని అన్వేషిస్తున్నారు. సరళత ఒక్కటే అందుకు మార్గం. సరళ స్వభావమంటే, ఉదాసీనం, బోళాతనం, మూఢత్వం అని కాదు. అది మనోనివృత్తి- అంటే అన్ని భావాలనుండి విముక్తి పొందటం. మనస్సులో పేరుకు పోయిన విజ్ఞానం సర్వస్వం వాస్తవాన్ని నేరుగా గ్రహించి అనుభవపరచు కోటానికి అవరోధం అవుతున్నది. మన సాంఘిక వ్యవస్థ అత్యంత వివేక ప్రధానమైనది. ఇతర అంశాలను వదలి తెలివికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటం వల్ల భావాలు మనస్సునంతా ముప్పిరిగొని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఈ మనోగత భావాలు మనల్ని యథార్థాన్ని గుర్తించకుండా చేస్తున్నాయి. మనోగతమైన భావాల ప్రమేయం లేకుండా సమస్యను సూటిగా చూడగలగాలి. అందుకు సరళ స్వభావం అవసరమవుతున్నది. వస్తుసంపద, విజ్ఞానసముపార్జన, మూఢవిశ్వాసాల ద్వారా యథార్థాన్ని గాక చీకటినే కాంచగలరు. ఇవే చెరుపుకు, కడగండ్లకు కారణమవుతాయి.

కల్లోలం మార్పును తీసుకు రాలేదు. అది అశాంతిని, ఆందోళనను మాత్రమే కలుగజేస్తుంది. భయ విభ్రమాలు మనస్సును సక్రమంగా పని చేయనివ్వవు. అసమానత వైరుధ్యాన్ని సృష్టిస్తున్నది. అసమానతలు జాతిపరమైనవి గాని, రాజకీయపరమైనవి గాని, ఆర్థికపరమైనవి గాని, అధికారపరమైనవి గాని, వ్యక్తిపరమైనవి గాని కావచ్చును. సదవగాహన, మన్నింపు, ప్రేమల ద్వారా ఈ విభేధాలను నిర్మూలించుకోవచ్చును.

సత్యశోధన స్వేచ్ఛకు మార్గాన్ని సుగమం చేస్తుంది. భవిష్యత్తులో ఏదో రాగలదని ఉవ్విళ్లూరుతూ కాలయాపన చేయటంవల్ల మార్పురాదు. భవిష్యత్తు గతం నుంచే వస్తుందన్న విషయం తెలుసుకోవాలి. కనుక మార్పు తత్‌క్షణమే రావాలి. అసత్యాన్ని అసత్యంగాను, సత్యాన్ని సత్యంగాను చూడగలగాలి. ఈ తేడాను గమనించడం ద్వారానే మార్పుసంభవమవుతుంది. సత్యాన్ని ఎఱుకపరచుకొన్నప్పుడే స్వేచ్ఛ కలుగుతుంది. విభేధాలు మనం సృష్టించుకొన్నవనే విషయంకూడా గోచరమవుతుంది. జ్ఞాపకాలు మనస్సును ఆవరించిన మబ్బులు. ఆ మబ్బుల తెరలనుంచి సత్యం బహిర్గతమవ్వాలి. ఈ జ్ఞాపకాలు గత అనుభవాలతో ముడిపడి మనలను ఏవో కొన్ని విధానాలకు బద్ధులను

చేస్తున్నాయి. అందువల్ల మనం యథార్థ స్థితిని కాంచలేక పోతున్నాం. ఈ జ్ఞాపకాలు, అనుభవాలు, కాలానికి సంబంధించినవి. భూత భవిష్యత్ వర్తమానాలుగా కాలక్రమాన్ని అనుసరిస్తున్నవి. అందువల్ల కాలాతీతమైన శాశ్వత సత్యాన్ని సాక్షాత్కరించు కోటానికి అవి అవరోధమవుతున్నవి.

ఆలోచనలతో సతమతమయ్యే మనస్సు సత్యాన్ని కనుగొనలేదు. అనుభవాల బరువును దించుకొన్నప్పుడే మనస్సు తేలిక అవుతుంది. ప్రస్తుత క్షణంలోనే సత్యాన్ని ఎఱుకపరచుకోవాలి. అందుకు చురుకైన మనస్సు, కోమల హృదయం కావాలి.

మార్పు అనేది ప్రయత్న పూర్వకంగా లభించే ప్రతిఫలం కాదు. అటువంటి ఫలితం గతానికి అవశేషమే అవుతుంది. కార్యకారణాలు రెండూ కలసే ఉంటాయి. ప్రతిక్షణమూ ఉన్నది ఉన్నట్లు అనుభవించటమే సత్యం. సుఖం కూడా క్షణికమైనదే. కాని ఆక్షణికానుభూతిని పొడిగించు కొంటూ తృప్తి చెందుతున్నారు.

సత్యాన్ని ఎవరికి వారే తెలుసుకోవాలి. అసంతృప్తి ప్రబలమైనప్పుడే కాలాతీతమైన సుఖ ప్రాప్తికి దోహదమవుతుంది. నిరంతర సత్యాన్వేషణ ద్వారానే మనం ఈ స్థితిని చేరుకోగలం. కాల బద్ధమైన ఆలోచన స్తంభించినప్పుడే నిజమైన ప్రేమ నెలకొంటుంది. నిజమైన ప్రేమ సత్యాన్ని ఎఱుకపరుస్తుంది. ప్రేమ నిండిన చోట మార్పు ఉంటుంది. ప్రేమ లేకుండా విప్లవం అసంభవం. ప్రేమలోపించిన విప్లవం వినాశానికి, క్షయానికి, దుఃఖానికి హేతువు అవుతుంది. ప్రేమైక విప్లవం ప్రతి క్షణమూ మార్పును సంతరించుకొంటుంది.

తనను తాను తెలుసుకొంటూ ఇతరుల తోడి సంబంధాన్ని అవగతం చేసుకోవాలి. ఇతరుల తోడి సత్సంబంధం నెలకొన్నప్పుడే తనను గురించి తాను తెలుసుకోవటానికి వీలవుతుంది. పోలికలతో గాక ప్రేమ ద్వారానే మానవుల మధ్య సత్సంబంధాలు నెలకొంటాయి. సృజనాత్మకమైన మార్పు వ్యక్తుల సంబంధాలలో అంటే సమాజంలోని మార్పు ద్వారానే సంభవమవుతుంది.

ప్రేమ ఒక్కటే సమాజంలో నెలకొన్న ఉన్మాదాన్ని, ఆందోళనను మాపుతుంది. ప్రేమ అంటే స్వార్థత్యాగం, అంతరం లేకుండా చూచుకోగలగటం. శ్రవణం, దర్శనం, శ్రద్ధ అనేవి అందుకు ముఖ్య సాధనాలు. ●

# 11

# జీవితం - మృత్యువు

కృష్ణమూర్తి సత్యాన్వేషణ మానవ జీవితానికి సంబంధించిన వివిధాంశాలపై- ముఖ్యంగా జీవితం పైనా, దాన్ని నిరంతరం వెంటాడే మృత్యువు పైనా సాగింది. తామెంతగానో ప్రేమించిన తమ్ముడు నిత్యానంద అకాల మరణం వారిని ఎంతగానో కలవర పరచి, జీవితం- మృత్యువులపై అన్వేషణ, మీమాంస, వివేచనలకు ప్రధాన హేతువయింది. వారి చర్చలలో, ప్రసంగాలలో, ఈ అంశాలు తరచుగా ప్రస్తావితమయ్యేవి.

కృష్ణమూర్తి దృష్టిలో జీవితం వేరు; జీవనం వేరు. జీవన సరణికి భిన్నంగా జీవించటం వలననే అసంతృప్తి, నిరాశ మానవ జీవితాలలో చోటుచేసుకొంటున్నాయి.

నిండుగా; లోతుగా ప్రవహించే నది వంటిది జీవితం. అది ఎన్నో మెలికలు తిరుగుతూ, నిమ్నోన్నతాలను అతిగమించి గమ్యం చేరుతుంది. ఆ నదీప్రవాహంలో ఎంతో చైతన్యం ఉంటుంది. కొందరికి జీవితమంటే జీవన వాహినితో ఏ సంబంధమూ లేక చైతన్య విహీనమై, ఆ జీవన వాహిని ప్రక్కనే ఉండే చిన్నమడుగు. భద్రత, నిలకడల మీది వ్యామోహంతో వారు ఆ మడుగుల బ్రతుకులనే కోరుకుంటారు. వాస్తవిక దృష్టితో వారు పరిశీలించ గలిగితే ఆ భద్రత, నిలకడ అనేవి ఒట్టి భ్రమలని తెలుసుకోగలుగుతారు.

జన్మ, మార్పు, మృత్యువు, పునర్జన్మ- అనేవి జీవిత క్రమానికి చెందిన ప్రధాన దశలు. ఇవి ప్రకృతి సహజాలు. మానవ శరీరంలోని జీవకణాలకు గూడా ఈ ధర్మం వర్తిస్తుంది. ఈ సత్యాన్ని తెలుసుకోలేక అలవాటు, ఆస్తి, అంతస్తు, మతం, సంప్రదాయం, కీర్తి, కాంక్షలవంటి విషయవాంఛలలో చిక్కుకుపోయి, అందులోనే భద్రతను నిలకడను వెతుక్కుంటూ ప్రకృతికి విరుద్ధంగా జీవించటానికి ప్రయత్నిస్తారు. ఈ విషయ వాంఛల వల్ల మరికొన్ని సమస్యలు ఉత్పన్నమవుతాయి. ఈ లంపటం నుంచి బయట పడి జీవన వాహినిలోనికి చొచ్చుకుపోయినప్పుడు జీవితమే రక్షణ కల్పిస్తుందన్న వాస్తవాన్ని వారు తెలుసుకోలేక పోతున్నారు.

కృష్ణమూర్తి తమ ప్రసంగాలలోను, రచనల్లోనూ జీవితంలోని సౌందర్యాన్ని, అద్భుతాలను, అవగాహనలను జీవితపు లోతులను తరచి చూపిస్తూ చేసే లఘువ్యాఖ్యలు- ప్రకృతి పరిసరాల రామణీయకం, వాస్తవిక జగత్తు, భావపరిధులు, ఆయాసందర్భాలతో మిళితమై రమ్యంగా హృద్యంగా కవితావేశంతో ఉండి, వారి తాత్త్విక సమాలోచనలకు ఉపోద్ఘాతాలుగా ఉంటాయి. ఇటువంటి వ్యాఖ్యలను, చర్చలను వారి ''జీవన వ్యాఖ్యలు'' **(Commentaries on Living)**, ''యాదాస్తు పుస్తకం'' **(Note Book)**లో మనం వీక్షించగలం.

సృష్టి, సృజన అనేవి జీవలక్షణాలంటూ కృష్ణమూర్తి లలిత కళలు, యథార్థ జీవితాన్ని గాక కళాకారుల ఆత్మనే ప్రతిబింబిస్తాయన్నారు. సృజన అనేది 'తాను' అనే భావనా శూన్యమై, అనుభవాలకు, ఆశలకు, కోరికలకు, ప్రయత్నాలకు తావు లేని మనః స్థితిగా అభివర్ణించారు. అలాగని అది అనుస్యూతమైన స్థితి కూడా కాదన్నారు. వారి దృష్టిలో అది క్షణ క్షణానికి నూతనత్వాన్ని సంతరించుకొనే స్థితి. అందులో 'తాను', 'తనది' అనే భావనలకు తావుండదు. ఆత్మా శ్రితం కానిదే సృజన. అదే సర్వసృష్టికి మూలం. సృజన అంటే కేవలం సృష్టి అనే భావానికే పరిమితం చేసుకోక, ప్రకృతి సహజాలైన ఉత్పత్తి, విచ్ఛిత్తి వంటి జీవిత సత్యాలని కూడా ఎఱుక పరచుకోవాలన్నారు.

జీవితానికి సంబంధించినదంతా ఒక్కటే. సకలజీవరాసులు, వాటి జీవన క్రమం బాంధవ్యాలతో ముడిపడి ఉన్నాయి. జీవనమంటే బంధం.

బంధమంటే అంటి పెట్టుకొని ఉండటం. అంటి పెట్టుకొని ఉండటం అంటే సహకరించు కోవటం. బాంధవ్యమనేది సహజోద్గమంగా ఉండాలన్నదే కృష్ణమూర్తి అభిప్రాయం. మానవ జీవితంలో నేడవి లుప్తమవటానికి కారణం- ఆలోచనల వల్ల స్వేచ్ఛకు అంతరాయం కలగటం. భావనలకు, బాంధవ్యాలకు అందులో చోటు లేదు. కాని మనకున్న ఒకే ఒక బాంధవ్యం- భావించుకొన్నది మాత్రమే. వాస్తవం ఊహకు భిన్నమైనది. మానవులు తమకు కలిగిన అనుభవాల నుండి ఇతరుల గురించి ఊహారూపాలు చిత్రించుకొని, వ్యక్తులతో గాక వారు కల్పించు కొన్న ఆ ఊహారూపాలతోనే వ్యవహరిస్తున్నారు. వైవాహిక జీవితంలో గూడా భార్యా భర్తలు తాము ముందుగా ఏర్పరచుకొన్న ఊహారూపాలను మనసులలో నుంచి వైదొలగించుకొంటేగాని ప్రేమించు కోవటం సాధ్యం కాదు.

బాంధవ్యానికి మరికొంత వివరణ ఇస్తూ కృష్ణమూర్తి బాంధవ్యమంటే- సమస్పందన; మనం ఇతరులతో వ్యవహరించేటప్పుడు సమశ్రుతిలో గాక, అనుభవాల పునాదులపై కల్పించు కొన్న ఊహాబింబాలతో మాత్రమే వ్యవహరించినప్పుడు- బాంధవ్యం కరువైపోగా మిగిలేది ఒంటరి బ్రతుకే; అందులో జీవితం మృగ్యం- అన్నారు.

ఒకానొక సందర్భంలో విద్యార్థుల నుద్దేశించి మాట్లాడుతూ- వేదాంతాలు మతాలు కావు, మానవుల సమస్యలే మనకు ముఖ్యం- అంటూ మానవులను అంటి పెట్టుకొని ఉన్న సమస్యలు, వాటి పరిష్కార మార్గాలను విశదీకరించారు.

మానవులను పీడిస్తున్న వ్యధలను గురించిన చింతన మనకు ప్రధానం. వ్యధ ఏదో ఒక రూపంలో మనల్ని ఆవహించి ఉన్నది. వెరపు- వ్యాకులం, ఆస- అడియాస, తద్వారా కల్లోలం ప్రపంచమంతటా వ్యాపించి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. మానవుల సమస్యలన్నీ ఒక దానితో ఒకటి ముడిపడి ఉంటాయనే విషయం ఈ సందర్భంలో గమనార్హం. ఒక సమస్యను పూర్తిగా అర్థం చేసుకొంటే అన్ని సమస్యలూ తేలిపోతాయి. సమస్యల పరిష్కారానికి ముఖ్యంగా కావలసింది అవగాహన. - కేవలం కోర్కెలను అతిగమించినంత మాత్రాన సమస్యలు పరిష్కారం కాక పోగా

అవి తిరిగి ఉధృతమయ్యే ప్రమాదం ఉన్నది. కోర్కెల స్వరూప స్వభావాలను, వాటి ఉనికిని, గుర్తించి కూలంకషంగా అర్థం చేసుకోగలిగిన ప్పుడు మనలో నవ్యచేతనను ఎఱుకపరచుకొంటాం. ఆ స్థితిని గుర్తించిన క్షణమే హఠాత్పరిణామం సంభవమవుతుంది.

జీవితానికి అర్థం ఏమిటి? పరమార్థం ఏమిటి? అనేవి కృష్ణమూర్తి ప్రసంగాలలోను, చర్చలలోను వచ్చే ప్రశ్నలు. వాటికి స్పందిస్తూ, కృష్ణమూర్తి- జీవితానికి అర్థం, పరమార్థం ఏమిటి అన్న ప్రశ్నలకు బదులు లేదు- అంటూ, నిన్నటి అనుభూతి నీడను గాని, రేపటి ఆశల వెలుగున గాని కాక వర్తమానంతోనే జీవితం ముడిపడి ఉంది- అనే వారు. ఈ వాస్తవాన్ని తెలుసుకోటానికి సాధ్యం కాని పరిస్థితులలో మానవుడు జీవిత లక్ష్యాన్నుంచే తప్పించు కొనేందుకు చేసే వింత ప్రయత్నాలలో ఒకటే జీవిత పరమార్థాన్ని తెలుసుకోనేందుకు సలిపే నిరంతర కృషి. కొందరు జీవితానికి ఏదో అర్థాన్ని, పరమార్థాన్ని ప్రసాదించేటట్లు మాట్లాడుతారు. పరమార్థం అనేది ఆలోచనలనుంచే పుడుతుందన్న విషయాన్ని వాళ్లు గమనించరు.

జీవితం- మృత్యువుల విషయాని కొస్తూ, అవి రెండూ ఒకటిగానే కలసి వుంటాయన్నారు. అందు వల్ల మృత్యువంటే ఏమిటో ముందుగా తెలుసుకోవాలి. కారణం- అది జీవితంలోనే ఒక భాగం కనుక. ఆత్మీయు లనుకొన్నవాళ్లను కోల్పోయి ఊరడింపులకోసం కృష్ణమూర్తిని ఆశ్రయిస్తే- మత గురువులు, ఆచార్యపురుషులకు మల్లే అనునయ వాక్యాలు పలుకలేదు. మృత్యువు ఎవరికైనా అనివార్యమే. ఈ జీవిత సత్యాన్ని ప్రతి వారూ తెలుసుకోవాలి. ఈ పృథివిపైన గాని, మనలో గాని ఏదీ శాశ్వతం కాదు. స్మృతి, ఆలోచన అనేవి మనకు అనశ్వరమనే భ్రమను కల్పిస్తున్నాయి. తెలియని దానిని గురించిన భయాన్నుంచి తప్పించుకోటానికి మనం ఈ భ్రమల చాటును ఆశ్రయిస్తాం. మృత్యువును గురించి తెలుసుకోటానికి ముందుగా జీవించటం తెలుసుకోవాలి. బ్రతకటమంటూ తెలుసుకొంటే చావటం ఒక సమస్య కాదు; ఆచావును గురించి భయమూ ఉండదు. తెలిసిన వాటిని గురించి భయపడటంలో వివేకమున్నది కాని, తెలియని

దానిని గురించి భయపడటం అవివేకం. మృత్యువన్నది అవిదితమైనప్పుడు, మృత్యువును గురించి భయపడటమంటే, అది తెలియని దానిని గురించిన భయమే కాదు; తెలిసిన దానిని వదలుకోటాన్ని గురించిన భయం కూడాను అంటూ, జీవితమొక్కటే శాశ్వతం; నిరంతర జీవన క్రమంలో పాత విషయాలు మరచి క్రొత్త విషయాలు తెలుసుకుంటూ జీవించే వారికి మృత్యుభీతి వుండదు- అని ఖండితంగా తేల్చి చెప్పారు.

అవ్యవధి అనేది కాలానికి సంబంధించినది. అవ్యవధికి కూడా అంతం ఉంటుంది. శాశ్వతమైనది అంటే కాలానికి అతీతమైనది- అని అర్థం. కాలం నుండి విడిపోవటం ద్వారానే మనం అమృతత్త్వాన్ని పొందగలం. ఈ కాలం కూడా కేవలం ఊహా కల్పితమే. ఆలోచన అక్షరం ద్వారా, జ్ఞాపకం మననం ద్వారా పరంపరాగతమైనవని తెలుసుకోమన్నారు కృష్ణమూర్తి. కాగా ఆలోచన అంత్యమే నవ్యతకు ఆరంభం. ఆలోచనలు అంతమొందినప్పుడు జీవితం శాశ్వతమవుతుంది- అన్నారు.

నశించేది ఏది?- అని ప్రశ్నించుకొంటే 'శరీరం' అని వెంటనే స్ఫురిస్తుందే కాని ఒక మూర్తి మత్వం లేక 'తాను' అనేది చనిపోవటమంటే మాత్రం అంగీకరించరు. ఈ 'తాను' అనేది కృష్ణమూర్తి దృష్టిలో అసదృశమైన స్వేచ్ఛా ప్రవృతి గలది. పరిసరాలు, కాలం, జ్ఞాపకాలు, ఆలోచనల సృష్టి- ఈ 'తాను' అని అర్థం చేసుకొని, ''తాను'' అనే ''భావన'' నుండి బయట పడగలిగితే మృత్యువంటే ఏమిటో తెలుసుకోగలమంటారు, కృష్ణమూర్తి. అంతే గాక వీటితోడిదే జీవితం అనిపించే అశాశ్వతమైన సుఖాలు, దుఃఖాలు, బాంధవ్యాల నుంచి విముక్తి చెంది - మనసు ప్రయత్న పూర్వకంగా కాక సహజంగా, నిర్మలంగా ఉండగలిగినప్పుడు మృత్యువును చూడగలమంటారు.

మృత్యువుకు ముందు జీవించటమంటే మృత్యువుతో జీవించటమే- అంటే కాలానికి అతీతమైన ప్రపంచంలో జీవించటం అని చెప్పటమే గాక అటువంటి స్థితిని పొంది మృత్యువును దర్శించి, మృత్యువుతో సదా జీవించగలిగారు, కృష్ణమూర్తి.

# 12

# బ్రతుకు భయం

అనుభవాల పునాదులపై పేర్చుకొన్న జ్ఞాపకాలతో ఆలోచనల గూళ్ళు కట్టుకుంటూ, అవి నిలవక మానవుడు సతమతమవుతున్నాడు. అనుభవాలు కాలానికి సంబంధించినవి కాగా కాలం చెల్లిన అనుభవాలు మస్తిష్కంలో నిలిచి జ్ఞాపకాల హెచ్చరికలతో మనస్సులో ముప్పిరిగొని స్థైర్యం సడలి మానవుడు వెరపు బ్రతుకు వెళ్లదీస్తున్నాడు.

నిన్నటి చేదు అనుభవం - రేపటి అసందిగ్ధాల మధ్య నేటి మానవుడు ఊగిసలాడుతున్నాడు. భయం - మానవజీవితంలో ద్వేషంలా ఒక భాగంగా, ఒక జీవిత విధానంగా పరిణమించింది. భయం అనేది విడిగా కాక ఏదో ఒక భావనతోనో సమస్యతోనో ముడిపడి ఉంటుంది.

కృష్ణమూర్తి దృష్టిలో భయం అనేది ఒక ఊహ మాత్రమే. అది గత అనుభవాల ద్వారానో, భవిష్యత్తు పైని వ్యామోహంతోనో, భద్రతను గురించిన చింతనతోనో మనంగా కల్పించుకొన్న భావనలను లేదా విధించు కొన్న నియమాలకు బద్ధుల్ని చేస్తున్నది. అటువంటి జీవితాలలో స్వతంత్రపు టాలోచనలు లోపించి సాంఘికపరంగానో, మతపరంగానో, జాతిపరంగానో, ఏదో ఒక ఒరవడికి లొంగి మానవులు యంత్రాల్లా మసులుకొంటున్నారు - అంటూ కృష్ణమూర్తి భయహేతువులు, వాటి నిర్మూలనాది వివరణలు ఇచ్చారు.

భయహేతువును అవగతం చేసుకోవటం ద్వారా భయాన్ని మనం వదలించుకోవచ్చు. భౌతికమైన కారణాలను మనం సులభంగానే గ్రహించ వచ్చు కాని మానసికమైన కారణాలను గుర్తించటానికి ఎంతో అప్రమత్తతతో బాటు, అభిప్రాయాలకు, సిద్ధాంతాలకు అతీతమై స్వతంత్రంగా వివేచన చేసే మనస్సు కావాలి. బహిర్గతమయే భయవిభ్రాంతులతో బాటు అంతర్గతంగా పేరుకుపోయిన భయాన్ని కూడా పసిగట్టగలగాలి.

భయహేతువులను విడివిడిగా విశ్లేషించటం వల్ల కాలయాపన కాగలదు. మూలస్వభావం, స్థూలక్రమాలను అవగతం చేసుకోవటం ద్వారా మనం భయాన్ని ఆకళింపు చేసుకోగలం.

కొందరికి చీకటి అంటే భయం - వెలుగు ప్రసరించిన మరుక్షణం భయం మరుగున పడుతుంది.

భర్త అంటే భార్యకు, లేదా భార్య అంటే భర్తకు భయం - వ్యక్తులతో గాక వారిని గురించి ముందుగా ఏర్పరచుకొన్న మిథ్యాబింబాల ద్వారా సత్సంబంధాలు నెలకొనవు. అటువంటి సంబంధాలలో సహజత్వం లోపించి వారి మధ్యన అగాధం ఏర్పడుతుంది; ప్రేమ లుప్తమై

దురభిమానాలు, అనుమానాలు చోటుచేసుకొంటాయి. నిజమైన ప్రేమ - అంటే ఒకరికొకరు అంకితమవటం.

జనం ఏమనుకొంటారోననే భయం - సాంఘికమైన కట్టుబాట్లు ఇందుకు కారణాలు.

ఒంటరి బ్రతుకులో భయం - పరాధీనానికి పర్యవసానమిది.

జీవితంలో ఏదో వెలితిని చూచుకొనో, భవిష్యత్తును తలచుకొనో భయభ్రాంతులవుతుంటారు కొందరు.

చావు అంటే భయం చాలా మందికి - అలవాటయిన పరిసరాలను, ఉన్న వాటిని వదలుకోలేని జంఝాటన ప్రధాన కారణం.

ఇలా ఏదో ఒక విషయాన్ని తలచుకొని భయానికి గురవుతుంటారు. అవివేకం, అదుపు, ఆరడి, అస్వతంత్రం, భద్రతా దృష్టి వంటివి - అందుకు కారణాలు. భౌతికమయిన కారణాలకన్న మనసును వెంటాడే కారణాలు మనిషిని కృంగదీస్తాయి - అంటూ యథార్థస్థితి లేదా వాస్తవాన్నించి వైదొలగటమే భయం; ఉన్నది ఉన్నట్లు ఎఱుకపరచుకోక పలాయనం చిత్తగించటం వల్లనే భయ సంశయాలు ఏర్పడుతున్నాయి. అలాగే పోలికలు కూడా భయాన్ని పొదుగుతాయి; కాగా భయానికి మూలం - అసలు సమస్య - అపరిష్కృతంగానే ఉండిపోతుంది - అంటారు కృష్ణమూర్తి.

కేవల విశ్లేషణ వల్లనే సమస్యలు పరిష్కారం కావు. విశ్లేషించే వారి మనఃస్థితినిబట్టి కూడా ఆ విశ్లేషణ ఫలితాలుంటాయి. వారి స్వీయానుభవాల నుంచి వారి ఆలోచనలు కూడా సాగుతుంటాయన్న విషయాన్ని మరువకూడదు. పైగా విశ్లేషణ ఫలితాలు తెలుసుకొనేలోగా ఎన్నో మార్పులు కూడా సంభవించే అవకాశం ఉండటంవల్ల అనుకొన్న ఫలితాలు పొందలేకపోగా ఎదురు చూడని అవరోధాలు తటస్థించే అవకాశాలుంటాయి. ఈ అవాంతరాలను అతిగమించేందుకు ప్రాథమికమైన తక్షణ పరిణామం ఒక్కటే మార్గం. ఇతరుల అనుభవాల ద్వారాగాక ఎవరికివారే మార్గాన్ని తెలుసుకోగలగాలి అన్నది కృష్ణమూర్తి హితవు.

భయానికి కేంద్రం మనస్సు. గత అనుభవాలు మనిషిని భవిష్యత్తును గురించిన ఆలోచనల వైపుకు మళ్లిస్తాయి. సుఖదుఃఖాలు జ్ఞాపకాల పొరలలో నిక్షేపాలై పదేపదే హెచ్చరికలు చేస్తుంటాయి. భయానికి కారణం - ఆలోచన. ఈ ఆలోచనే వ్యధను పెంచుతుంది. భయానికిగల హేతువుకు, భయం తీరిపోవటానికి గల మధ్య కాలంలో భయం యొక్క చైతన్య క్రియ ఉంటుంది. అంటే భయం కాలంతో ముడిపడి ఉంటుంది. అది కాలమాన క్రమానుసారంగా కాక మనోగత కాలక్రమానుసారం ప్రవర్తిల్లు తుంది. ఆలోచనకు - ఆచరణకు మధ్యనున్న కాలమే మనోగత కాలమని కృష్ణమూర్తి ఒక క్రొత్త కాల ప్రమాణాన్ని ప్రవేశపెట్టారు. దైనందిన జీవితంలో ప్రతి క్షణమూ అప్రమత్తంగా ఉన్నప్పుడు బహిరంతర భయ కారణాలు అవగతమవుతాయన్నారు.

సమస్య పరిష్కారానికి విశ్లేషణకన్న ఆ సమస్యను పూర్తిగా ఎఱుక పరచుకోవటం అవసరం. ఎఱుక, అప్రమత్తతల ద్వారానే భయాన్ని అవగాహన చేసుకొని వైదొలగించుకోటానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. ప్రయత్న పూర్వకంగా ఆలోచించే మనస్సుకు అనుభవం అడ్డు తగులు తుంది. మనస్సు ఎప్పుడూ ఏదో ఒక ఆలోచనతో ఉండటంవల్ల మానవుడు సతమతమవుతున్నాడు. ప్రశాంత చిత్తం భయసందేహాలను నివృత్తి చేస్తుంది. భయంలాగే పోలికలు కూడా మనల్ని పట్టి పీడిస్తున్నాయి. పోలికలు అసమానతలను సృష్టిస్తాయి. తద్వారా మనస్సులో వైరుధ్యం చోటు చేసుకొంటుంది. శైశవంలోనే ఈ ద్వేషం బీజావాపమై పెరిగి విస్తరించి తిరిగి ముందు తరాల వారికి సంక్రమిస్తున్నది. బ్రతుకు బాటలో పోలికలు అడ్డదార్లు త్రొక్కటాన్ని ప్రోత్సహిస్తున్నాయి. పోలికలలో ముడిపడిన జీవితాలకు సుఖశాంతులు కరువు అవుతాయి. క్షణిక సుఖానుభూతిని పొడిగించుకొనే ప్రయత్నం మానవుడిని కృంగదీస్తోంది. ఆశ - నిరాశల మధ్య ఆందోళనతో ఉచితానుచితాలను కోల్పోతున్నాడు నేటి మానవుడు.

మాలిన్యంలేని మనస్సు నమ్మకాలకు, కట్టుబాట్లకు, నియమ నిబంధనలకు అతీతంగా ఉంటుంది. అట్టి మనస్సు స్వతంత్రంగా స్వేచ్ఛా వాతావరణంలో పనిచేయగలుగుతుంది. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలంటే విశృంఖలత్వం కాదు. అది కఠోర క్రమశిక్షణ. క్రమశిక్షణకు సరియైన

అర్థం - అభ్యాసం - అంటే ఒక విషయాన్ని సమగ్రంగా తెలుసుకొని అభ్యసించటం. ఆక్రియ ద్వారా అనుకరణ, అణకువ, అణచివేతలనుంచి విముక్తి లభిస్తుంది. నిర్బంధంలేని మనస్సు సత్యాన్ని తెలుసుకొంటుంది.

ఆలోచనలు జ్ఞాపకాలకు ప్రతిస్పందనలు మాత్రమే. జ్ఞాపకాల అవసరం మన నిత్యకృత్యాలు తీర్చుకోటానికి మాత్రమే పరిమితమవ్వాలి. మదిలో నిక్షిప్తం చేసుకొన్న సాంకేతిక విజ్ఞానం మన విధి నిర్వహణకు మాత్రమే ఉపయుక్తం కావాలి. ఇతరేతర ఆలోచనలు, మాలిన్యాలు - దానికి సోకరాదు.

ఆలోచనలే మనిషికి ''నేను'' అనే భావనను కలిగిస్తున్నాయి. ఈ ''నేను'' అన్నభావన బలవత్తరమై మనిషిలో స్వార్థం ముదురుతున్నది. తనది, తన వాళ్లు - అన్నభావన, ఇతరులనుంచి తనను విడదీస్తున్నది. ఫలితం - సంఘర్షణ. తన విషయం వేరు, ఇతరుల విషయం వేరు - అనుకొంటూ తన వ్యక్తిగతమైన అవసరాలు తీర్చుకొనే తాపత్రయంతో అతనిలోనే ద్వంద్వ ప్రవృత్తి చోటుచేసుకొంటున్నది. విభజన వైరుధ్యాన్ని సృష్టిస్తుంది. ఎవరి అవసరాలు, ఎవరి ఇష్టాలు, ఎవరి ఆదర్శాలు వారివి కాగా, స్వార్థం ముదిరి అహాయిత్యాలకు ఒడి గట్టటంవల్ల అశాంతి, భీతి - అనివార్యమవుతున్నాయి.

ఆలోచనలు సృష్టించిన 'నేను' అనే భావన కేంద్రంగా మనిషి మనుగడ సాగిస్తున్నాడు. ఈ కేంద్రమే 'స్వ', 'పర' - భేదానికి హేతువు అవుతున్నది. ఈ కేంద్రం, ఈ విభేదం సంఘర్షణకు దారితీయిస్తున్నాయి. 'నేను', 'నాది' - అనే భావన మనిషిని అంటిపెట్టుకొని ఉన్నంత పర్యంతం భయం పట్టిపీడిస్తూనే ఉంటుంది. భయానికి హేతుభూతమైన 'నేను' అనే కేంద్రాన్ని ఛేదించక, భయాన్ని వదలించుకోవాలని చేసే ప్రతి ప్రయత్నమూ వృధాశ్రమ అవటమేగాక ''నేను'' అనే కేంద్రం మరింత బలవత్తరమై భయం కూడా మరింత పుంజుకోటానికి ఆస్కారమవుతుంది. మనస్సు ఈకేంద్రాన్ని విస్మరించి నేరుగా చూడగలిగినప్పుడు భయం పటాపంచలవుతుంది. అందుకు చైతన్యవంతమైన మనస్సుతో బాటు సహృదయం - తద్వారా వివేకం, ఆర్ద్రత అవసరం - అన్నదే కృష్ణమూర్తి అభిభాషణం.

# 13

# మానసిక పరివర్తనం

"మానవ ప్రవృత్తి పెడదారి పట్టిందా? అందుకు ఫలితమేనా - ఈ విభజనలు, వైరుధ్యాలు, వినాశం?" అని ప్రశ్నిస్తూ కృష్ణమూర్తి డాక్టర్ డేవిడ్ బామ్‌తో 1980 మే నుంచి సెప్టెంబరు నెల మధ్య కాలంలో సలిపిన సంభాషణలలో - మానవ స్వభావం, సమాజంతో మానవుని సంబంధ బాంధవ్యాలు, మానవుని చిత్తవృత్తి, ఆలోచనలు, ఆసలు, అడియాసలు, తద్వారా చెలరేగే ద్వేషాలు, సంఘర్షణలు, కవ్వింపులు, సాధింపులు వంటి విషయాలనే గాక, వీటికి అతీతమైన మానసిక స్థాయిని చేరుకోవాల్సిన అవసరం, అందుకు అనుకూలమైన పరిస్థితుల వంటి విశేషాలను కూడా విశ్లేషించారు.

డా. డేవిడ్ బామ్ ప్రఖ్యాత శాస్త్రవేత్త. అమెరికా, బ్రిటన్, బ్రెజిల్, ఇస్రాయేల్ దేశాలలో పదార్థ విజ్ఞాన శాస్త్ర ఆచార్యులుగా ప్రశిద్ధులు. తేజః కణవాదం (QUANTUM THEORY) సాపేక్ష సిద్ధాంతం (RELATIVITY) వేదాంతం (PHILOSOPHY) వంటి జటిలమైన అంశాలపై గ్రంథాలు వ్రాశారు. కృష్ణమూర్తి డా|| డేవిడ్ బామ్‌తో వివిధ సందర్భాలలో, వివిధ అంశాలపై చర్చించారు. గ్రంథస్థమైన ఈ చర్చా నివేదికలు జిజ్ఞాసువులకు ఎంతో ఆసక్తిదాయకాలు.

కృష్ణమూర్తి దృష్టిలో -

మానవులు ఏ ప్రాంతానికి చెందిన వారయినా వారి మనఃస్థితి-స్థాయీ భేదం మినహా, మౌలికంగా ఒకే రకంగా ఉంటుంది. మానవ ప్రవృత్తి, మానవ మేధ, అంటే కేవలం ఏ ఒక వ్యక్తికి మాత్రమే పరిమిత మయినవిగా కాక, అవి సమస్త మానవ జాతికి సంబంధించినవి. లక్షల సంవత్సరాలుగా మానవ మేధ పరిణామం చెందుతూ, ఎంతో అనుభవాన్ని, విజ్ఞానాన్ని, గడించుకొంటూ వాటితో పాటు, స్వార్థాన్ని, హింసను, క్రౌర్యాన్ని, కపటాన్ని కూడా సేకరించుకొన్నది.

మానవుని దుస్థితిని అభివర్ణిస్తూ-

- తన యథార్థ స్థితికి భిన్నంగా మానవుడు నడచుకోటానికి ప్రయత్నించటం వల్లనే అనర్థాలు దాపురిస్తున్నాయి. ఈ ఊబిలోనుంచి బయటపడే మార్గాలు తానుగా ఊహించుకొని, అవి సఫలంగాక, సఫలమయినా తృప్తిచెందక ఆత్మ వంచన చేసుకొంటున్నాడు. ఆలోచన ద్వారా ఆత్మగతమయిన విభజన, తద్వారా ఉత్పన్నమయిన మనోగత కాలానికి చెందిన అనుభూతి జనితమయిన ''నేను'' అనే భావన వల్ల, మానవుడు తన నిజస్థితి ఏదో తెలుసుకోలేక పోతున్నాడు.

రానురాను మానవుడు తన జీవన విధానంలో ఆలోచనకు అత్యంత ప్రాధాన్యం ఇస్తున్నాడు. తాను గడించిన విజ్ఞానం తన ఆలోచనలను, తద్వారా తన జీవితాన్ని ప్రభావితం చేస్తున్నది. కడకు, ప్రాముఖ్యం లేని విషయాలలో గూడా సాంకేతిక పరమైన కాలనిబద్ధిత ఆలోచనలు చోటు చేసుకొంటున్నాయి. విజ్ఞానానికున్న విలువ పరిమితం. అపారమైన విజ్ఞానం అపాయకరం. అవసరానికి మించి విజ్ఞానాన్ని ప్రోది చేసుకోవటం వల్లనే మన నాగరకత శిఖరం కూలి పోతున్నది. భౌతిక విజ్ఞానం కన్న మానసిక విజ్ఞానం చాలా అవసరం. మానసిక జ్ఞానం వివేకాన్ని పెంచుతుంది - అంటూ మానసిక జ్ఞానం అంటే, తనను గురించిన జ్ఞానం; ఆ జ్ఞానంలో జీవించుతూ దాన్ని వృద్ధి చేసుకోవటమని తెలుసుకోవాలన్నారు, కృష్ణమూర్తి.

మానవ మేధ క్రమంగా ఏవో కొన్ని విధానాలకు లొంగి సంకుచిత పరిధులలో పని చేస్తున్నది. ఒక విధానంతో సరిపెట్టుకోలేక దానితో మరి కొన్ని విధానాలను అనుసరిస్తూ నిరంతరం ఏదో ఒక వ్యాపకంతో సతమతమవుతున్నది. నిరంతరాన్వేషణ మానవ మేధకు ఒక లక్షణంగా, ఒక లక్ష్యంగా మారింది. స్వయం పోషణ, స్వీయ రక్షణ, బుద్ధి మాంద్యం, ఉపేక్షతా భావం, స్వీయ వికాసం పట్ల ఉదాసీన వైఖరి, నిర్లక్ష్యం వంటివి అందుకు కారణాలుగా పేర్కొంటూ-

విధానాలకూ, ఆదేశాలకూ లొంగి చర్వితచరణంగా చేసినపనినే చేసుకపోతుండటం వల్ల కూడా బుద్ధి మందగిస్తుంది. వివేకం మరుగున పడి 'గాటి బ్రతుకు' అలవాటవుతుంది. అందులో ఔచిత్యం, అనౌచిత్యం అనే ప్రసక్తి వుండదు.

## 131 మానసిక పరివర్తనం

మానవులు ఎంత విద్యావంతులయినా, ఎంతో తెలివిగల వాళ్ల మనుకొంటున్నా, లేదా ఏదో మతపరంగా మసలుకొంటున్నా మనుకొంటున్నా ఏవో కొన్ని నియమాలు, విధానాల గాటిలో పడుతుంటారు. ఈ 'గాడి' సమకూర్చుకొన్న విజ్ఞానం వంటిది. అందులో ఏ ప్రత్యేకతా లేక పోయినా, ఆ 'గాటి బ్రతుకు'కు అలవాటయి, అదే పరమార్థంగా దానిపై మమకారాన్ని పెంచుకుంటారు. తాము పెంచుకున్న మమకారం ఉచ్చులలో తాముగా చిక్కుకొని బయటపడలేక సతమత మవుతున్నారు.

అంతేగాక-

మనస్సులో కల్పించుకొన్న ఊహలు, తామేదో పరివర్తనం చెందను న్నట్లు, తమ స్థితిగతులలో ఏవో మార్పులు రానున్నట్లుభ్రమలు కల్పించుతాయి. బీదవాడు భాగ్యవంతుడు కావాలనుకోవటం, భాగ్యవంతుడు మరింత భాగ్యవంతుడు కావాలను కోవటం, బహిరంతరాలలో సాగే మానసిక ప్రేరణ క్రియగా తెలుసు కోవాలి. ఏదో ఒక నాటికి కోరుకున్నదేదో సిద్ధిస్తుందనే ఆశ వారిని పట్టి పీడిస్తూ, వ్యధలకు గురి చేస్తుంటుంది. ఆరాటం పెరిగిన కొలది ఉచితం, అనుచితం అనే విచక్షణను కోల్పోయి ఏదో సాధించాలి - అనే తపన బలీయమవుతూ క్రౌర్యాన్ని పెంచుకుంటున్నారు.

మన మేధస్సును ఎటువంటి సాంకేతిక సమస్యనయినా పరిష్కరించగలిగేట్లు రూపొందించుకొన్నామే కాని, అది మానవుల మౌలిక సమస్యలను మాత్రం పరిష్కరించ లేక పోతున్నట్లు విశదమవుతున్నది. నేటి ప్రపంచ మానవుడు ఎన్నో సమస్యలలో తల మునకలై ఉన్నాడు. మొత్తం మానవ జాతి మనుగడ జటిలమై, ఒక బృహత్ సమస్యగా పరిణమించింది. విజ్ఞానం పెరుగుతున్నా, శతాబ్దాలుగా మానవ క్రమ పరిణామం కొనసాగుతున్నా, మానవుడు సమస్యల బారి నుంచి విముక్తుడు కాలేక పోతున్నాడు. పై పెచ్చు మానవులు తాము వృద్ధి చేసుకొన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని మారణహోమానికి వినియోగించుకొంటున్నారు. తమను ఆవరించి ఉన్న మానవ బంధాల సమస్యలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరత, అస్థిరం, అనుకంపం వంటి భావనలు, ఉదర పోషణ కర్తవ్యం - ఇలా ఎన్నో సమస్యల పట్ల సదవగాహన కుదుర్చుకోలేక పోతున్నారు.

జాగరూక మనస్సు, విశుద్ధ వర్తనం, ఈ సమస్యలకు పరిష్కార మార్గాలను సూచిస్తాయి. జాగరూక మనస్సుకు అశ్రద్ధ, స్వాభిమానం, ఆత్మ వైరుధ్యం, అడ్డు తగులుతాయి. మనం ముందుగా వీటిని వైదొలగించు కోవాలి. విజ్ఞానం ద్వారా స్వాతిశయం పెరిగి, స్వార్థం పేరుకొని, ఆత్మ వైరుధ్యం దురభిమానం వంటి దుర్లక్షణాలు సోకిన మనస్సు ఎదిగే స్థాయిని కోల్పోయి ముందుకు సాగలేక ఏదో ఒకచోట స్థిరంగా నిలచిపోతుంది - అంటూ కృష్ణమూర్తి ఆ స్థితిని అతిగమించే మార్గాలను కూడా సూచించారు.

వివేచన ద్వారా వివేక రహితమైన ఈ అసందిగ్ధము ఆత్మగతమైన ఆలోచనల నుండి విముక్తి సిద్ధిస్తుంది. వివేచనల వల్లనే ఆలోచనలకు అతీతమైన గ్రహణశక్తి కూడా లభ్యమవుతుంది. అందులో క్రమము, శక్తి యుక్తి వుంటాయి. 'నేను' అనే అహం భావనకు, కాలానికి అందులో తావుండదు. జీవితానికి సరైన అర్థం తెలుసుకోవాలంటే ఈ భావనా శూన్య తలాన్ని స్పృశించాలి. అదే - సర్వమూ, అన్ని కార్యకారణాలకు, ఆద్యంతాలకు నెలవు. విజ్ఞాన శాస్త్రం వస్తుపరంగా ఆతలాన్ని స్థావరాన్ని గుర్తించినా, మన మానసిక విభజనలను, సంఘర్షణలను మార్చలేక పోవటం వల్ల అది మన అంతరంగ జీవితాలకు ఏ మాత్రం ప్రయోజనం చేకూర్చ లేక పోయింది. ఈ విభజనలు, సంఘర్షణలు, పరిష్కారం కాకుంటే మానవ జాతి నాశ మొందటం తథ్యం - అని హెచ్చరించుతూ వీటి నిజ స్థావరాన్ని నేరుగా గ్రహించి తెలుసుకోగలగాలి; అందుకు మనస్సు ప్రశాంతంగా, ఎట్టి ఆలోచన లేకుండా ఉండాలి - అన్నారు, కృష్ణమూర్తి.

వివేచనకు 'లోచూపు' అవసరం. అంటే మన మనస్సులను మనం తరచి చూచుకోవటం. అదే అంతర్ దృష్టి. తద్వారా ఆత్మ జ్ఞానం - అంటే 'స్వ' స్వరూపజ్ఞానం కలుగుతుంది. మన అంతరంగాలలో చీకటి క్రమ్మ కోటానికి, 'నేను' అనిపించే అహంభావనకు - హేతు మూలాన్ని స్వస్వరూప జ్ఞానం ద్వారానే తెలుసుకోగలం. ఈ కేంద్రమే కలవరాన్ని, అయోమయాన్ని సృష్టించి, మనస్సును చిందర వందర చేస్తుంది. ఈ కేంద్రం పని చేయకుండా ఆగి పోవటమే ప్రాథమిక పరివర్తనం - అంటూ అందుకు మార్గాలు సూచించారు.

మనం - నేరుగా ఏదైనా ఒక విషయాన్ని గ్రహించి తెలుసుకోవటంలో మన గ్రహణశక్తి మనం ప్రోది చేసుకొన్న విజ్ఞానం, పొందిన అనుభవాలను

అనుసరించి వుంటుంది. ఆదృష్టితో చూచినదే సరి - అనే భ్రమలో కూరుకు పోతాం. తద్వారా మెదడు కుదించుక పోవటానికి, శక్తి కోల్పోవటానికి అవకాశం వుంటుంది. కాలం ద్వారా పరిణతి చెందిన మెదడు ఇంకా ఆ కాలానికే సంబంధించిన విధానానికి కట్టుబడి శక్తిని కోల్పోయింది. అలాగాక కాలానికి చెందిన విధానం నుంచి విడివడినప్పుడు మెదడు ఆ విధానానికి అతీతంగా ఉంటుంది. శరీరంలోని అవయవాలను మెదడు అదుపులో ఉంచుతుంది. మనస్సు స్వాస్థ్యాన్ని కోల్పోయినప్పుడు శరీరం కూడా స్వాస్థ్యాన్ని కోల్పోతుంది.

కృష్ణమూర్తి దృష్టిలో - కాల పరిమితిలో జీవించటం అంటే గతంలో ఆలోచించుతూ, అందులోనే జీవించుతూ, ఆ గతం నుంచి సేకరించిన విజ్ఞానం ప్రాతిపదికగా ప్రవర్తించటం. కల్పించుకొన్న మిథ్యాబింబాలు, అపోహలు, దురభిమానాలు గతం నుంచే ఉద్భవిస్తాయి. ఇవన్నీ కాలానికి సంబంధించినవి. ఇవే ప్రపంచంలో నేటి అస్తవ్యస్త స్థితిని కల్పించుతున్నాయి. విషయ గ్రాహ్యతకు కాలం కారణమవుతున్నది. సేకరించిన విషయాలను మెదడులో పేర్చి వాటిని గురించి ఆలోచింపజేస్తున్నది. ఇదంతా కాలం ప్రభావమే. దయనీయమైన ఈ స్థితిని 'నేను' అనే భావాన్ని విడనాడి పరికించి చూస్తే మెదడు చెందుతున్న మార్పును పసిగట్ట వచ్చును. అటువంటి అంతర్ దృష్టి కాలానికి అతీతమైనది.

అహం సృష్టించిన అంధకారం మేధస్సులో సంఘర్షణను రేపుతుంది. సంఘర్షణ దుర్నడవడికను ప్రోత్సహిస్తుంది. దుష్ప్రవర్తన మేధస్సును గాయపరుస్తుంది. అంతర్ దృష్టి వల్లనే మేధకు తగిలిన గాయాలను, రాపిడిని మాన్పటానికి సాధ్యమవుతుంది. స్పష్టత పొందిన మేధ నూతన తేజంతో ప్రకాశిస్తుంది. అంతర్ దృష్టి ద్వారా సిద్ధించే జ్ఞానం - ఆలోచనకు, కాలానికి, పదార్థానికి, అతీతమైన శక్తిలో ఉద్భవిస్తుందంటూ, అది భౌతికంగాను, మానసికంగానూ - కేవలం వ్యక్తికే పరిమితం గాక యావత్ ప్రపంచానికి, మొత్తం మానవాళికి చెందిన క్రమంలో పని చేయగలుగుతుంది. సృష్టిక్రమం - అనే మాటను వింటుంటాం. సృష్టి అంటేనే క్రమం. అందులోనే అన్ని క్రమాలు ఉంటాయి. ప్రపంచ క్రమం, భౌతిక క్రమం,, మానసిక క్రమం - అనేవి అందులోని విభజనలు మాత్రమే. మెదడు, మనస్సు - పరస్పరం విరోధించుట వల్లనే అవి క్రమం తప్పినట్లు ఉంటాయన్నారు.

అనుభూతి, ఆలోచన, జ్ఞాపకం - తత్సంబంధమైన వాసనలు ఇసుమంతయినా లేకుండా మెదడును శూన్యంగా ఉంచాలి. అప్పుడే మనస్సు స్వచ్ఛంగా ఉండి ధ్యానస్థాయిని చేరుకొంటుంది. అదే ప్రశాంత మనఃస్థితి. ఆ స్థాయిని చేరుకొన్న మనస్సు ఎంతో వివేకంతో ఉంటుంది. వివేకం పొందిన మనస్సు కల్పించుకొన్న భ్రమల నుంచి, భ్రమ కల్పిత రూపాలనుంచి, చేసుకొన్న వంచనల నుంచి స్వేచ్ఛను పొందుతుంది; మానవుల మధ్య కల్పించుకొన్న అంతరాలు పటాపంచలు అవుతాయి. ఆత్మ గతమైన భావనలు వైదొలగి సదవగాహన ఏర్పడుతుంది. సదవగాహన సత్సంబంధాలు నెలకొల్పుతుంది. తద్వారా ప్రేమ జనిస్తుంది. నిజమైన ప్రేమలో స్వార్థానికి తావుండదు. అట్టి ప్రేమలో వివేకం, నిర్మలత్వం, ఉండి ఒకరినొకరు విశదంగా తెలుసుకోవటానికి యోగ్యంగా ఉంటుంది. అదే జ్ఞానం - అసలైన జ్ఞానం. ప్రేమ ఒకడి సొంతం కాదు. అది సర్వమానవాళికి చెందినట్టిది. మూఢత్వంతో దూరంగా ఒదిగి ప్రేమను పొందలేక పోతున్నారు.

మానవులు తమ జీవితాలను ప్రభావితం చేసే దేనికోసమో పరితపిస్తున్నారు. క్షణిక సుఖానుభూతిని గాక శాశ్వత సుఖప్రద జీవితాలకు అర్రులు చాస్తున్నారు. దైనందిన సమస్యల ఊబిలోనుంచి బయటపడాలని ఆవేదన చెందుతున్నారు. కేవలం వ్యక్తి పరంగా కాక, సమష్టిగా సమస్యలు పరిష్కార మయితేనే సుఖశాంతులు నెలకొంటాయి. అయితే అది ఎలా సాధ్యమవుతుంది - అన్న సందేహానికి కృష్ణమూర్తి నివృత్తి మార్గాన్ని సూచిస్తూ - వ్యక్తి నుంచి సమాజానికి, మరింత గాఢంగా మానవాళిలోనికి చొచ్చుకొనిపోయి వారి అంతరంగాలను స్పృశించ గలిగేవి - ప్రేమ, కరుణ, విశ్వాసం, వివేకం, సూక్ష్మ గ్రాహిత్యాలు మాత్రమే. అంటే దానికి అర్థం - మనస్సు, హృదయం, సర్వమూ ఒకటిగా కలసి ఆత్మ విమర్శ చేసుకోవటం. అందుకు ఎవరికి వారే జిజ్ఞాసువులు కావాలి. వ్యష్టిగాను, సమష్టిగాను, ఆత్మవిమర్శ చేసుకొని ఆత్మసాక్షాత్కారం పొందాలి అన్నారు-

- ఇదే మానవులలో రావలసిన తత్ క్షణ మానసిక పరివర్తనను గురించి కృష్ణమూర్తి అభిభాషణం.

# 14

# కృష్ణమూర్తి భావాలు - ప్రభావాలు

కృష్ణమూర్తి భావాలు ఎందరిని ప్రభావితుల్ని చేశాయి?

సుమారు ఏడుపదుల సంవత్సరాల సుదీర్ఘ కాలం ప్రపంచమంతటా పర్యటించి చేసిన ప్రసంగాలు, జరిపిన చర్చలు, ప్రచురించిన గ్రంథాలు మానవ సమాజంలో ఏమాత్రం మార్పును తీసుకు వచ్చాయి?

మానవ సమూహాల మధ్య నెలకొన్న ద్వేషాగ్ని చల్లారిపోయిందా?

యుద్ధాలు నిలచి పోయాయా?

శాంతి ప్రభవించిందా?

సోదర భావం పెంపొందిందా?

విశ్వమానవ సౌభ్రాత్రం నెలకొన్నదా?

మానవుడు విశ్వమానవుడుగా ఆవిర్భవించే స్థాయికి ఎదిగాడా?

కృష్ణమూర్తి ప్రభావం మానవ సమాజంపై ఎటువంటి ముద్రవేసింది?

- ఇలా ఎన్నో ప్రశ్నలు, సందేహాలు, విమర్శలు అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ తలెత్తుతూనే వున్నాయి. కృష్ణమూర్తి కూడా ఇటువంటి సవాళ్లను ఎన్నో సందర్భాలలో ఎదుర్కొన్నారు.

కృష్ణమూర్తి భావాలు సులభగ్రాహ్యాలు కావు; వాటిలో నిగూఢార్థాలు న్నాయి; లోతుగా పరిశీలిస్తే కాని బోధపడవు - అనే వాళ్లున్నారు.

జగద్గురువులు, పరమగురువులు బోధించిన విషయాలనే కృష్ణమూర్తి నేటి సమాజానికి అన్వయించి మనముందుంచారు - అనే వాళ్లూ ఉన్నారు.

మైత్రేయుడు, శ్రీ కృష్ణుడు, ఏసు, బోధిసత్వుడు, దక్షిణామూర్తి, శంకరులు, రామానుజులు - ఇలా ఎందరి విశేషాంశాలనో కృష్ణమూర్తిలో చూచి తన్మయులైన వాళ్లు కూడా వున్నారు.

అసలు విషయమేమో అంతు పట్టక, అయోమయావస్థలో పడిన వాళ్లు కూడా లెక్కకు మిక్కిలిగానే ఉన్నారు.

కృష్ణమూర్తి జగద్రక్షకుడు, ఆపద్బాంధవుడు, ప్రవక్త, గురువు వంటి బిరుదులు, ఆడంబరాల ముసుగులు, ఏనాడో వదలించుకొన్నారు. తానుగా సత్యాన్ని శోధిస్తూ సత్యశోధనాభిలాషకల వారికి నిమిత్తమాత్రంగా సహకరించే తోటిమానవుడు; సత్యపథాన పయనించే నిరంతర పథికుడుగానే చెప్పుకొన్నారు.

కృష్ణమూర్తి భావాలు సులభంగా మనసుకు పట్టకపోవచ్చు. ఏవో కొన్ని అభిప్రాయాలు, అభిమతాలు, అనుభవాలు, అనుభూతులు మదిలో ముందుగానే నిక్షిప్తమై వుండటం అందుకు ప్రధాన కారణం.

వేల సంవత్సరాలుగా మనసులకు మప్పిన విజ్ఞానం సత్యాన్ని నేరుగా తెలుసుకొని గ్రహించటానికి అవరోధమవుతుంది. మనస్సులో పేరుకొన్న విజ్ఞానం స్మృతుల ద్వారా హెచ్చరికలు చేస్తూ స్వతంత్రంగా ఆలోచించే శక్తిని సన్నగిల్ల జేస్తుంది.

కృష్ణమూర్తి భావనలను గ్రహించటానికి నిర్మలమైన మనసు, స్పందించే హృదయం కావాలి. ఇవి రెండూ ఒనగూడినప్పుడు సత్యం గోచర మవుతుంది. వైరుధ్యాలూ, బంధాలూ లేని స్వేచ్ఛావాతావరణం అందుకు అనుకూలంగా ఉంటుంది.

తమ నిజస్థితిని తాము అవగతం చేసుకొని తమను బందీకృతులను చేసిన శృంఖలాలనుంచి ముందుగా విడుదల కమ్మని కృష్ణమూర్తి పదేపదే హెచ్చరికలు చేశారు. ఆ స్వేచ్ఛలోని అద్భుతాన్ని, ఆనందాన్ని అనుభవించి తానుగా తెలుసుకొన్న విశేషాలను మనముందుంచారు. వాటిని నమ్మమని బలవంతం చేయలేదు. సత్యం ఒకళ్లు చెప్పి ఒప్పించేది కాదు. ఎవరికి వారు తెలుసుకోవాలి. అందుకే కృష్ణమూర్తి తమభావాలను ప్రచారం చేయలేదు. వారి దృష్టిలో ప్రచారం అనృతం. కేవలం సత్యస్వరూపాన్ని సూచనగా మనముందుంచారు. అంగీకరించటం అంగీకరించకపోవటం అనేది ఎవరి అభీష్టాలకు తగినట్లు వారుగా నిర్ణయించుకోవాలి. కృష్ణమూర్తి

భావాలు మనసుకు పట్టలేదనుకోవచ్చు కాని, అందులోని నిజాయితీని మాత్రం ఎవరూ శంకించలేదు.

కృష్ణమూర్తి ప్రసంగాలు భావ భరితాలు. వారి ప్రసంగాలను సూక్ష్మంగా పరిశీలించితే వారిలోని భావ పరిణామ దశలు అవగతమవుతాయి.

1909లో జగద్గురువు స్థానానికి ఎంచుకొన్న తొలినాళ్ళ నుంచి 1929లో తారక సంస్థను రద్దుపరచేంత వరకూ చేసిన ప్రసంగాలు మొదటి దశకు చెందినవిగా విభజించవచ్చును. ఈ దశలో కృష్ణమూర్తి అవతార పురుషుడుగా ప్రసంగించటం ప్రారంభించి క్రమంగా బంగారు సంకెళ్లనుంచి విముక్తుడవుతూ, మానవబంధాలు, వ్యక్తిస్వేచ్ఛ, గురుశిష్య సంబంధాలు వంటి అంశాలపై చర్చిస్తూ ఆపైన సత్యానికి నిర్దిష్టమైన మార్గాలు లేవు; ఎవరంతట వారే సత్యశోధనకు ఉద్యమించాలంటూ ప్రసంగించారు. ప్రవచనాల నుంచీ అభయాలనుంచీ ఆత్మవిమర్శకు ప్రేరేపించే ప్రసంగాలు చేశారు.

తారక సంస్థను రద్దు పరచినది మొదలు ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం వరకూ - అంటే 1929 నుంచి 1949 వరకూ చేసిన ప్రసంగాలు రెండవ దశకు చెందుతాయి. స్వేచ్ఛ, సత్యశోధన, మానవ సమాజ పరిణామం వంటి విషయాలు, మానవులను పట్టి పీడిస్తున్న నిరాశ, నిస్పృహలు, నిత్యజీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలు, మతాలు, ఆచారాలు, సంప్రదాయాలు - వీటి ప్రభావం నుంచి మానవుడు విముక్తుడు కావలసిన అవసరం, విశ్వమానవుడుగా వికసించటం వంటి విషయాలపై ప్రసంగించారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో విదేశ సంచారానికి అవరోధం కలగటం వల్ల కాలిఫోర్నియా రాష్ట్రంలోనే సంచరిస్తూ ఎందరో ప్రసిద్ధులైన వేదాంతులను, రచయితలను, శాస్త్రజ్ఞులను, మేధావులను కలుసుకొని వారితో చర్చలు జరిపి వివిధాంశాలపై సంపూర్ణావగాహన ఏర్పరచుకొన్నారు.

1950 నుంచి 1980 వరకూ చేసిన ప్రసంగాలు మూడవ దశకు చెందుతాయి. ఈ దశాకాలంలో ప్రపంచమంతటా విస్తృతంగా పర్యటించారు. వారి గ్రంథాలు కూడా ఈ కాలంలోనే అధిక సంఖ్యలో ప్రచురితమై ప్రపంచంలోని అభిమానులందరికీ కృష్ణమూర్తి భావాలు వివరంగా తెలుసుకొనేందుకు ఉపకరించాయి. విజ్ఞాన శాస్త్ర ప్రగతి, మానవ సమాజంపై

శాస్త్రప్రయోగాల దుష్పరిణామాలు, మానవుల మనస్సులలో పేరుకొం టున్న కపటం, కాలుష్యం, రాజకీయాలు, వంచన, హింస - వీటినన్నింటినీ అతిగమించి విశ్వమానవ దృక్పథాన్ని ఏర్పరచుకొని వసుధైక కుటుంబంగా మానవజాతి పరిణామం చెందాలంటూ ప్రసంగించారు.

1980లో వేయి పున్నములను తిలకించిన నాటినుంచి జీవన సంధ్యాసమయం వరకూ చేసిన ప్రసంగాలు నాలుగవదశకు - అంటే చరమ దశకు చెందినవి. కృష్ణమూర్తి పరిపూర్ణులు. ఆ పరిపూర్ణత వారి ప్రసంగాలలో ప్రస్ఫుటమయింది. జాతి, మతం, కులం, దేశం వంటి ఎల్లలను దాటి విశ్వప్రేమ వైపుకు మనసులను మళ్లించాలన్నారు. వేల సంవత్సరాలుగా మానవులను అంటిపెట్టుకొని ఉన్న విశ్వాసాలు, కట్టు కొన్న అడ్డుగోడలు తొలగిపోవాలి; బహిరంతరంగాలలో పొంచి ఉన్న దుష్టశక్తులను పసిగట్టి వాటిని ఒదిలించుకోవాలి - అన్నారు. విజ్ఞాన శాస్త్రంలో వచ్చిన నూతన పరిణామాలను మానవ మనోవికాసానికి గాక, విలాసాలకు ఆధిక్యతను నిలుపుకొనేందుకు వినియోగించటం పట్ల ఆవేదన చెందారు. విజ్ఞాన శాస్త్ర ప్రయోగాలు కొన్ని మరీ దారుణంగా మానవుడిని నిస్తేజం చేయగల ప్రమాదం పొంచి ఉన్నదని కూడా హెచ్చరించారు.

కృష్ణమూర్తి ప్రసంగాలు ఏదో ఒక భావ పరిధికి మాత్రమే పరిమితం కాక మానవ జీవనానికి సంబంధించిన వివిధాంశాలపై సాగాయి. అవి మామూలు తరహా ఉపన్యాసాలుగా కాక శ్రోతలతో సన్నిహితంగా, వారిలో ఒకడుగా ఉంటూ ముచ్చటించుతున్నట్లు ఉండటం వల్ల ప్రసంగాలుగా చెప్పుకోవలసి వస్తున్నది.

కృష్ణమూర్తి మొదటి ప్రసంగం 1911 సంవత్సరం మే నెల 28వ తేదీన లండన్‌లో చేసినట్లు, ప్రసంగం ఆరంభంలో కొంచెం జంకినా క్రమంగా నిలదొక్కుకొని శ్రోతలను ఆకట్టుకొన్నట్లు తెలుస్తున్నది. అంతకు ముందు వారణాసిలో 1910 సంవత్సరం డిశెంబరు నెల 28వ తేదీన దివ్యజ్ఞాన సమాజం వార్షిక సమావేశంలో తారక సంస్థ సభ్యులకు ఆమోద పత్రాలనిస్తూ లఘు ప్రసంగం చేసినా ఆ తరువాత లండన్‌లో చేసిన ప్రసంగమే కృష్ణమూర్తి మొదటి ప్రసంగంగా నమోదయింది. చివరి ప్రసంగం 1986 సంవత్సరం జనవరి నెల 4వ తేదీన మదరాసు వసంతవిహార్‌లో చేశారు.

కృష్ణమూర్తి ప్రసంగాలు ప్రధానంగా సత్యశోధన, అందుకు అనువ యిన వాతావరణాన్ని సమాయత్తం చేసుకోవలసిన అవసరం వంటి

విషయాలపై సాగాయి. సత్యశోధనకు ముందు ఆత్మజ్ఞానం - అంటే స్వస్వరూపజ్ఞానం అవసరం. తనను తాను తెలుసుకోవటం ద్వారా పరరూపజ్ఞానం బోధ పడుతుంది. ముముక్షువుకు - ముందుగా స్వస్వరూపజ్ఞానం, తరువాత పరరూపజ్ఞానం, ఆ తరువాత ప్రకృతి స్వరూపజ్ఞానం, ఆపైన ఉపాయస్వరూపజ్ఞానం, ఇంకా పైన విరోధిస్వరూప జ్ఞానం అవసరం. 1929 సంవత్సరం ఆగస్టు నెల 3వ తేదీన హాలెండులోని 'ఒమ్మెన్'లో తారక సంస్థ సమావేశానికి విచ్చేసిన మూడువేల పైచిలుకు సభ్యుల నుద్దేశించి చేసిన ప్రసంగం కృష్ణమూర్తి ప్రసంగాల కన్నింటిలోకి చాలా విశిష్టమయింది. అది తారక సంస్థను రద్దుపరుస్తూ చేసిన ప్రసంగం అవటమేకాక కృష్ణమూర్తి భావికార్యక్రమానికి నాంది పలికింది. ఆ ప్రసంగంలో చెప్పిన మాటపైనే కడవరకూ నిలచారు. చెప్పింది చేశారు. చేసేదే చెప్పారు. మాటకు చేతకు పొంతన కృష్ణమూర్తి విషయంలో సార్థకమయింది.

కృష్ణమూర్తి ప్రసంగ సమావేశాలకు వచ్చిన వారి సంఖ్య సాధారణంగా మూడు నాలుగు వేలకు మించలేదు. ఇక చర్చలకు వచ్చే వారి సంఖ్య పదులలోనే - కృష్ణమూర్తి ప్రసంగాలు, చర్చలు ఆంగ్లంలోనే నిర్వహించారు. ఆంగ్లభాష తెలిసిన వారే ఎక్కువ సంఖ్యలో సమావేవాలకు హాజరయ్యేవారు. కృష్ణమూర్తి భాష సరళ సుందరం. పదాడంబరం లేదు. ప్రసంగం ఆరంభం నుంచి అంతం వరకూ శ్రద్ధగా వినాలి. ఏమరుపాటు ఏమాత్రం పనికిరాదు. ఏమరుపాటు, అశ్రద్ధల వల్ల ప్రయోజనం చేకూరకపోగా మరొకలా అర్థం చేసుకొనేందుకు అవకాశం హెచ్చు.

కృష్ణమూర్తి ప్రసంగాలు సామాన్య జనానికి గాక విద్యావంతులకు - ముఖ్యంగా ఆంగ్లం తెలిసిన మేధావులకు మాత్రమే ఉపకరిస్తాయనే ప్రథ కూడా ఉన్నది. వారి ప్రసంగాలు ఆంగ్లంలో సాగినా సమస్త మానవాళిని ఉద్దేశించినవే కాని ఏ ఒక వర్గానికి మాత్రమో పరిమితంకాలేదు.

ప్రసంగ విషయాలు, చర్చనీయాంశాలు ముందుగా నిర్ణయమయ్యేవి కావు. అప్పటి కప్పుడు సభికుల కోరికపై ఏదో ఒక అంశం నిర్ణయమయ్యేది. భావప్రకటనకు కృష్ణమూర్తి ఎన్నో పదాలు ప్రయోగించేవారు. శ్రోతలు సరిగా అర్థం చేసుకోవాలనే ఆరాటంలో ఒకే విషయాన్ని ఎన్నో వాక్యాలలో వివరించేవారు. ఒక్కొక్కమారు చెప్పిందే చెప్పినట్లు తోచినా శ్రోతలు

దారి తప్పకూడదనే ఆరాటం వారి ప్రసంగాలలో కానవచ్చేది. ఒక్కొక్క విషయాన్ని వివరిస్తూ, శ్రోతలతోనే ఉంటూ, వారిని మెట్టుమెట్టుగా నడిపించుతూ, గమ్యం కనుచూపు మేరలో ఉన్నదనగా ఇకపై గమనాన్ని మీరే సాగించండి - అన్నట్లుగా ఆ ప్రస్తావనను అంతటితో ముగించే వారు. అంతవరకూ అర్థమయినట్లే వుండి ఆపైన ఎటు వెళ్లాలో తెలియక శ్రోతలు ఒక్కొక్కమారు తికమక పడేవారు. ఈ సమయాలలోనే శ్రోతలు నిబ్బరంగా ఆలోచించుకోవాలి. గుడ్డిగా అనుసరించటం కాక వివేకంతో ముందుకు సాగాలి.

కృష్ణమూర్తి చెప్పేది చాలా సంగ్రహంగా, సంక్షేపంగా ఉంటాయను కోవటం భావ్యం కాదు. మన ప్రజ్ఞ, ఉపజ్ఞలను పెంపొందించుకోవాలి. మనస్సులో అంతకు మునుపే కుట్టుకున్న ఆలోచనలగూళ్లు, చేసుకొన్న నిర్ణయాలు అందుకు అవరోధం కాకూడదు. అప్పుడే గమనం సుగమ మవుతుంది.

కృష్ణమూర్తి వేదవాక్కులు, ఉపనిషత్ సూక్తులు, పవిత్ర గ్రంథాల ప్రసక్తి, సంప్రదాయ పదాలు, ఉట్టంకింపులు లేకుండా అతీంద్రియ శక్తులు, యోగసంబంధ విశేషాలు, శాస్త్రవిషయాలు వంటి జటిలమైన సమస్యలను కూడా తమదైన బాణిలో తేలిక మాటలతో మానవ జీవన సమస్యలకు అన్వయించి చెప్పారు. శ్రోతలు అంతకు ముందే అలవాటయిన విధానానికి అవి భిన్నంగా తోచటం వల్ల ఇబ్బందిపాలైన సందర్భాలు కూడా కద్దు. వారి ప్రసంగాలలో సమయం, సందర్భాలననుసరించి కవిత జాలువారింది. కృష్ణమూర్తి ఉత్తమ భావుకుడన్న విషయం మరచిపోరాదు.

కృష్ణమూర్తి భావాలు మానవాళిపై ఏపాటి ప్రభావాన్ని చూపాయి? - అన్న ప్రశ్నకు సూటిగా బదులు చెప్పటం కష్టం. వారు బోధకుడనని చెప్పుకోలేదు. కాని అభిమానులు వారిని బోధకుడుగా పరిగణించారు. వారి భావాలు సూక్ష్మంగా తేలికగా కనిపించినా, సునిశితంగాను తీవ్రంగానూ ఉంటాయి. అందరం కలసి సమష్టిగా సమస్యలను అవగాహన చేసుకొందాం - అనేవారు. సరియైన అవగాహనల ద్వారా సమస్యలు సమసి పోతాయి. వారి ప్రసంగాలలో తరచుగా, ఉద్యోగ సమస్యలు, భార్యా భర్తల మధ్య విభేదాలు, కుటుంబ కలహం వంటి 'సాధారణం' అనుకొనే సమస్యలను ప్రస్తావించేవారు. ఉపశమనాలు, పరిష్కారాలుగాక సమస్యలను మనముందుం

చేవారు. సూత్రాలు, ప్రతిపాదనలు గాక మౌలిక విషయాలను చర్చించేవారు. విశ్వాసాలు మాని ప్రశ్నించటం అలవరచుకోమనేవారు. స్తబ్దత ఒదిలించుకొని పరమోత్కృష్టాన్ని పరికించ మన్నారు. వారి ప్రసంగాలను విన్నవారు, గ్రంథాలను చదివిన వారు కృష్ణమూర్తి భావనల ఔచిత్యాన్ని ఎంతవరకూ గ్రహించ గలిగారు - అన్నది ఇంకా ఒక ప్రశ్నగానే మిగిలింది. వీరిలో విద్యాధికులు, బుద్ధి జీవుల పాలు ఎక్కువ. తీవ్రంగా ఆలోచించగల సమర్థులైనా, ఆత్మపరిశీలన జరుపుకొని విశుద్ధ వర్తనానికి ముందుకు సాగేందుకు జంకు అడ్డుతగులుతున్నదేమో ననిపిస్తుంది. వారనుభవిస్తున్నదే సుఖదాయక జీవనమనే భ్రమ తొలగక, అలాంటి భ్రమలు తొలగినా స్వేచ్ఛగా బయటపడలేక సతమత మవుతున్నారేమోనని కూడ అనుమానించవలసి వస్తున్నది. ఇంకా వారిని ఏవో కొన్ని అభీష్టాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు, మమకారాలు వంటివి అంటిపెట్టుకొని ముందుకు సాగనివ్వటం లేదనికూడా అనిపిస్తుంది.

కృష్ణమూర్తి ప్రసంగాలను విన్నవారు మరింతగా వినాలనుకొంటారు. వారిపై అభిమానం పెరుగుతుందేకాని తరగదు. కాని అభిమానం - ఆరాధనగా మారేసరికి ప్రమాదం ముంచుకొస్తుంది. కృష్ణమూర్తి ఆశించింది ఆరాధనకాదు - ఆలోచన. కాని 'ఆలోచించే శక్తి సహనం కొరవడి - ఇంగితం నశించి అందిందేదో దొరక పుచ్చుకొని అదే పరమార్థం అనుకొనే పరిస్థితులకు దాసులవుతున్నారు. ఈ ఊగిసలాట ధోరణి ప్రగతికి ప్రతిబంధకం. అవును - కాదు అనే సందిగ్ధాల నుంచి మానవుడు ముందుగా విముక్తుడు కావాలి.

కృష్ణమూర్తి అధ్యయన కేంద్రాలు పలు ప్రాంతాలలో నెలకొల్పుతున్నారు. ఈ కేంద్రాలు కృష్ణమూర్తి భావప్రసరణానికే పరిమితం కావాలి - ప్రచార కేంద్రాలు కాకూడదు. కృష్ణమూర్తి ఆశించినట్లు - అధ్యయన పరత్వంలో ప్రతిక్షణమూ సచేతనంగా ఉండాలి. ఎవరికి వారే గురువు, శిష్యుడు కావాలి. ఏ ఒక్కరో ప్రకాశించటం, ఫలసిద్ధి పొందటంగా కాక అందరూ ప్రయోజనం పొందాలి. అందరిలోనూ మంచితనం ప్రభవించాలి. అనుకరణలు, అనుసరణలు, అనుసంధానాలు, ఆమోదాలు, ఆవేశాలు మాని స్వయం ప్రతిభతో ప్రకాశించాలి. స్వానుభవంతో నేరుగా గ్రహించి సాక్షాత్కరింప జేసుకోవటంలోనే అందం, ఆనందం ఇమిడి వున్నాయి.

కృష్ణమూర్తి భావాలు - పథాలను, పద్ధతులను నిర్దేశించవు. పథగమనంలో ఎదురయ్యే సమస్యలను ఎఱుకపరుస్తాయి. అప్రమత్తతో ముందుకు సాగిపోవాలి.

కృష్ణమూర్తి వ్యక్తిత్వం విశిష్టమయింది. స్ఫటికం వంటి మనస్సు, సుందరరూపం, సరళ సులభ సుందరంగా ప్రత్యేక శైలితో చేసే విషయ వివరణ - ప్రసంగాలను వినే వారిని ఎంతగానో ఆకర్షించాయి. సభకు విచ్చేసిన వారు సమ్మోహితులై వినేవారు. అప్పటికి కృష్ణమూర్తి భావనలను అంగీకరించినా తిరిగి తమ విధానాలకు, సంప్రదాయాలకే లొంగి పోవటాన్ని చూస్తున్నాం. లోపం కృష్ణమూర్తిది కాదు. విన్న వారిది అనుకోవలసి వస్తున్నది.

కృష్ణమూర్తి భావాల పట్ల ఆకర్షితులైన వారిలో మేధావులు, వేదాంతులు, రచయితలు, శాస్త్రవేత్తలు, రాజ్యాధినేతలు, రాజకీయ నాయకులు - ఇలా ఎందరో వివిధ రంగాలకు చెందినవారున్నారు. ఏదో ఒక పరిణామంలో వాటి ప్రభావం వారిపైన ఉన్నది. సంప్రదాయ బద్ధమైన ఆచారాలు, నియమాలు, నిబంధనలు, పదాడంబరాలు లేకపోవటం వల్ల కృష్ణమూర్తి భావాలు యువతరాలను ఎక్కువగా ఆకర్షించాయి. నిస్సారం అనుకొన్న జీవితాలను సుఖప్రదం చేసుకొన్న వారు ఎందరో ఉన్నారు.

నేటి ప్రపంచ పరిస్థితి అస్తవ్యస్తంగా ఉన్న దనటంలో సందేహం లేదు. కటిక దరిద్రుల నుంచి అగర్భ శ్రీమంతులనుకొంటున్నవారి వరకు ఏదో వెలితితో బాధపడుతున్నారు. అదే వారిలో నెలకొంటున్న శూన్యానికి ఒక హెచ్చరికగా గ్రహించాలి. అది వస్తుపరంగా తీర్చలేనిది. అసమంజస జీవనానికి ఫలితం ఇది. ప్రేమ, అభిమానం, కరుణ కొరవడిన జీవితాలకిది ప్రతిఫలం.

నిర్మలమైన మనస్సు, కోమల హృదయం, కలసి సమశ్రుతిలో ఉన్నప్పుడు - తానే ప్రపంచమని విశదమవుతుంది. విశాల హృదయం, కరుణాంతరంగం, అవ్యాజమైన ప్రేమల కలయికే నిజమైన సుఖం - అందులోనే విముక్తి లభిస్తుంది; అదే సత్యం, శాశ్వతం - అన్నదే కృష్ణమూర్తి భావనల సారాంశం. శ్రోతల, పాఠకుల మానసిక స్థాయికి తగినట్లుగా కృష్ణమూర్తి భావాల ప్రభావం వుంటుంది. ప్రబోధనలు, ప్రభావాలతో నిమిత్తం లేక యథార్థాన్ని ఎఱుక పరచటమే తాము నెరవేర్చిన కార్యంగా కృష్ణమూర్తి చెప్పుకొన్నారు.

# 15

# రాజమండ్రిలో కృష్ణమూర్తి

కృష్ణమూర్తి తమ విస్తృతపర్యటనలను ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో కొనసాగించ లేకపోయారు.

కృష్ణమూర్తి సహజంగా శాంతికామి; యుద్ధానికి వ్యతిరేకి. పోరాటం, తద్వారా చెలరేగే హింస - అసలు సమస్యను పరిష్కరించకపోగా - మానవ సమూహాల మధ్య, జాతుల మధ్య, దేశాల మధ్య మరింతగా విభేదాలను, అగాధాలను పెంచుతాయనేవారు. పైగా యుద్ధం - దేశాధినేతలు తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనేందుకు నెరపే వికృత క్రీడగా వర్ణించుతూ, సామాన్య ప్రజ, యుద్ధంతో ఏమాత్రం సంబంధంలేని పామరులు దేశాభిమానం, ఔన్నత్యం పేరుతో జరిపే మారణ హోమానికి సమిధలుగా ఆహుతి అవుతున్నారని, కృష్ణమూర్తి తమ ప్రసంగాల ద్వారా ఆవేదనను వ్యక్తం చేశేవారు. హింసకు ప్రతిగా ప్రేమ పెంపొందినప్పుడే ప్రపంచంలో శాంతి నెలకొంటుందని, అప్రమత్తతతో, జాగరూకతతో వాస్తవాన్ని ఎఱుక పరచుకోమని ప్రబోధించేవారు.

కృష్ణమూర్తి ప్రసంగాలు, తమ యత్నాలకు నీరు కారుస్తాయేమోనని అగ్రరాజ్యాధి నేతల భీతి. కృష్ణమూర్తి కాలిఫోర్నియా రాష్ట్రం విడచి వెళ్లరాదని, బహిరంగ ప్రకటనలు, ప్రసంగాలు చేయరాదని ఆంక్షలు విధించారు. అగ్రరాజ్యాలలో ఒకటైన అమెరికాలోని "ఓహై" - కృష్ణమూర్తి నివాస ప్రదేశం. "ఓహై" కాలిఫోర్నియా రాష్ట్రంలోని పర్వతప్రాంతం. యుద్ధకాలంలో ఎక్కువగా "ఓహై"లోనే ఉంటూ కాలిఫోర్నియా రాష్ట్రం లోని ఇతర పట్టణాలకు, గ్రామాలకు తరచు వెళ్లి వస్తుండేవారు. ప్రపంచ ప్రఖ్యాతి వహించిన మేధావులు, రచయితలు, వేదాంతులు, శాస్త్రవేత్తలను యుద్ధకాలంలో తరచుగా కలుసుకొంటూ ప్రపంచ సమస్యలను, ముఖ్యంగా మానవ జాతిని పట్టి పీడిస్తున్న సమస్యలను చర్చించుతూ ఉండేవారు. అప్పటికి నడిమి వయస్సులో నున్న కృష్ణమూర్తికి వివిధ విషయాలపై సంపూర్ణావగాహన పెంచుకొనేందుకు ఈ చర్చలు ఎంతగానో దోహదమయ్యాయి.

యుద్ధం ముగిసింది. ప్రపంచాన్ని క్రమ్మిన కారుమబ్బులు విడిపోయాయి. కాని, మానవాళి గుండెల్లోని గాయాలు మాసిపోలేదు. అలము కొన్న గుబులు, బాధలు, వ్యధలు, స్పర్ధలు ఇంకా అంటిపెట్టుకొనే వున్నాయి. అగ్రరాజ్యాలు విజయోత్సవాలను ఆడంబరంగా జరుపుకొన్నాయి. కృష్ణమూర్తి ఆ విజయోత్సవాలలో పాల్గొన లేదు. లక్షల, కోట్ల మానవులు హతులైనందుకు పరితపించి, తప్తహృదయాలతో మరో మారణ హోమానికి అవకాశం రాకుండా చూచుకోవాల్సిన సమయంలో విజయోత్స వాలంటూ ఆధిక్యతను ప్రదర్శించు కోవటం ద్వేషాన్ని మరింత రగిలించినట్లవుతుందనేది కృష్ణమూర్తి వాదం.

1940 నుంచి 1947 వరకు కాలిఫోర్నియా వదలిరాని కృష్ణమూర్తి, 1947 ఉత్తరార్థంలో తిరిగి విదేశ ప్రయాణాలకు సన్నద్ధులయ్యారు. 1947 అక్టోబరు నెలలో తిరిగి భరత ఖండంపై కాలుమోపారు. బొంబయితో ప్రారంభించి, ఆనవాయితీగా విడిది చేసే ప్రధాన నగరాలను చుట్టి, పదునెనిమిది నెలల తరువాత, కాలిఫోర్నియాకు వెళ్లారు. భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందిన తొలిరోజులవి. కృష్ణమూర్తి దేశంలో వచ్చిన మార్పులను గమనిస్తూనే ఉన్నారు. మతకలహాలు, రాజకీయ వైషమ్యాలు భారతజన జీవితాన్ని ఛిన్నాభిన్నంచేయటం గమనించి ఎంతో వ్యాకులం చెందారు.

భారత దేశానికి 1949 ఉత్తరార్ధంలో తిరిగి విచ్చేశారు.

''రాజమండ్రి'' ఆంధ్రప్రదేశ్‌లోని పట్టణాలలో విశిష్టమైనది. అది సాహిత్యానికి కళలకు కాణాచి మాత్రమేగాక, సాంస్కృతిక, సంస్కరణ ఉద్యమాలకు గూడా సంగమ కేంద్రం. బ్రహ్మసమాజం, దివ్య జ్ఞానసమాజం వంటి జాతీయ, అంతర్జాతీయ సంస్థలు తమ ఉద్యమం తొలినాళ్లలోనే గోదావరి మండలంలో శాఖలను నెలకొల్పాయి. నాటి రాజమండ్రి పురప్రముఖులలో శ్రీ అవసరాల రామారావుగారు విశిష్టులు. శ్రీమంతులేగాక వితరణశీలురు. వృత్తిపరంగా న్యాయవాదులు. కళా, సాంస్కృతికరంగాలపై మోజుమెండు. సంస్కరణాభిలాషి. దివ్యజ్ఞాన సమాజ ప్రభావితులు. వారికి కృష్ణమూర్తిపై ప్రగాఢమైన అభిమానం. రాజమండ్రిలో కృష్ణమూర్తి ప్రసంగాలను ఎంతో ప్రయాసతో ఏర్పాటు చేశారు. 1949 నవంబరు నెల చివరి వారం నుంచి డిశెంబరు నెల మొదటి వారం వరకు రాజమండ్రిలో ఉండి మూడు ప్రసంగాలు చేసేందుకు కృష్ణమూర్తి ఎంతో బలవంతం మీద అంగీకరించారు.

ఆల్కాట్ తోటలోని దివ్యజ్ఞాన సమాజ భవనంలోనే బస చేసేందుకు, భవనాన్ని ఆనుకొని ఉన్న మైదానంలో సభ జరిపేందుకు నిర్ణయమయింది.

మొదటి రోజు ప్రసంగం ముగియటంతోటే సభామధ్యం నుంచి ఒకరు ప్రశ్నించారు -

''మనిషి, జగతికి అభివ్యక్తి (Measure - పరిమాణం); ముందుగా మనిషి మారినప్పుడు ఈ విశాల జగతిలో శాంతి నెలకొనగలదని శెలవిచ్చారు; మరి మీ స్వీయ పరివర్తనం ఈ విషయాన్ని నిరూపిస్తున్నదా?'' - అన్నది ప్రశ్న.

అందుకు కృష్ణమూర్తి సమాధానం -

''వ్యక్తి - ప్రపంచం అనేవి రెండు సత్యాలు కావు; నీవే ప్రపంచం. ఇదేదో ఆదర్శం గాని, ఊహకాని కాదు. ఇది వాస్తవం. ప్రపంచమే నీవైనప్పుడు, నీవుగాముందు పరివర్తనం చెందటం ద్వారా మానవ సంఘంలో కూడా పరివర్తన తీసుకు రాగులుగుతున్నావు. స్వలాభాపేక్ష, స్వీయకాంక్ష, దోపిడీ వంటివి అంతంకానప్పుడు నేను చెప్పుతున్నది నిరర్ధకం అని పృచ్ఛకుని అభిప్రాయం కావచ్చును. ఇది వాస్తవమేనా అన్నది

ప్రశ్న. ప్రచారం చేయటానికి గాక సత్యమేదో సూచించటానికి మాత్రమే ప్రపంచమంతటా పర్యటిస్తున్నాను. ప్రచారం ఒక అన్నృతం. ఒక భావనను లేదా ఒక ఆలోచనను ప్రచారం చేయవచ్చును. కాని సత్యాన్ని ప్రచారం చేయలేం. సత్యమేదో సూచిస్తూ నేను పర్యటిస్తున్నాను. దాన్ని తెలుసుకోగ లగటం, తెలుసుకోలేకపోవటం అనేది మీ వంతుపని. అది మీ ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుంటుంది. ఏ ఒక్కడూ తానుగా ప్రపంచాన్ని మార్చలేడు. అయితే మీరూ, నేను కలసి ప్రపంచాన్ని మార్చవచ్చును. అందుకు ముందుగా మీరు, నేను సత్యమేదో తెలుసుకోవాలి. సత్యమే - ప్రపంచంలోని దైన్యాన్ని ఖేదాన్ని - బాధలను, వ్యధలను - తొలగించ గలదు.''

- అంటూ తాము చేస్తున్న ప్రయత్నమేమో వివరించారు.

రాజమండ్రి ''రైల్వే స్టేషను'' ఆల్కాట్ తోటను ఆనుకొని ఉంటుంది. ప్రధాన ''రైలు'' మార్గంలో రాజమండ్రి స్టేషను ప్రముఖమైనది. వచ్చేబండి, పోయేబండి తప్పని సరిగా ఆగుతాయి. ప్రయాణీకులను చేరవేసే బండ్లు మాత్రమే గాక, సరకులు రవాణాచేసే బండ్లు కూడా విధిగా ఆగుతుండటం వల్ల ''రైల్వేస్టేషను'' ఎప్పుడూ సందడిగా ఉంటుంది. అప్పట్లో అన్నీ పొగబండ్లే. ''రైలు ఇంజను'' వదిలేపొగ, వేసే కూతలు, ప్రయాణీకుల గడబిడలు 'స్టేషను' పరిసరాలలో నివసించే వారిని చికాకు పరుస్తుండేవి. కృష్ణమూర్తి ప్రసంగ సమయంలో కూడా ఈ ఇబ్బంది తప్పిందికాదు. బసలో ఉన్న సమయంలో పరిస్థితిని వివరించ నవసరం లేదు. రాత్రింబవళ్లూ ఈ రొదను భరించటం కృష్ణమూర్తికి దుర్భర మనిపించింది. నిర్వాహకులు మరొక చోటును సూచించలేక పోయారేమో - ముందుగా నిర్ణయించిన కార్యక్రమాలలో మిగిలిపోయిన వాటి నన్నింటినీ రద్దు చేసుకొని కృష్ణమూర్తి మదరాసుకు చేరుకొన్నారు. ఆపైన కొలంబో ప్రయాణం.

పరిస్థితులు అనుకూలించనందున అవసరాల రామారావుగారు ఎంతో ప్రయత్నించి ఏర్పాటు చేసిన కృష్ణమూర్తి ప్రసంగాలు రాజమండ్రిలో అలా అర్ధాంతంగా ముగిశాయి. అందరికన్న ఎక్కువగా అవసరాల రామారావుగారే నొచ్చుకొని ఉంటారు. అవసరాలవారు పరిసరాలను గమనించలేకపోయారు. ఫలితం కృష్ణమూర్తి రాజమండ్రి ప్రసంగాలు కొనసాగక పోవటం. ఋషీవాలీ తప్పించి కృష్ణమూర్తి ఆంధ్రప్రదేశ్‌లో ప్రసంగించిన దాఖలాలు లభ్యం కావటంలేదు.

# 16

# కృష్ణమూర్తి తత్త్వ సార సంగ్రహం

కృష్ణమూర్తి - ఏమతానికీ చెందని విశ్వమానవుడు; మత సిద్ధాంతాలకు శాస్త్ర విషయాలకు పరిమితం కాని స్వతంత్రుడు.

వేదాలను - అధ్యయనం చేయలేదు; ఉపనిషత్ శాస్త్ర మీమాంసల దరికిపోలేదు.

ఉపన్యాసాలలో, చర్చలలో, రచనలలో కొన్ని ప్రాచీన సూక్తుల పోలికలు చూచిన కొందరు విమర్శకులు- కృష్ణమూర్తి తత్త్వం అద్వైతమని, కాదు బౌద్ధమని, అదీకాదు అద్వైత ప్రధానమైన బౌద్ధం అనీ, అదేదీ కాదు క్రైస్తవమని ఎవరికి వారు అభీష్టాలకు తగినట్లుగా సరిపోల్చుకొంటున్నారు. ఆమూర్తిలో దక్షిణామూర్తిని, బుద్ధభగవానుని, ఏసు ప్రభువును కాంచగలిగినవారూ ఉన్నారు.

ఎన్నో యుగాలుగా నిలచి ఉన్న సంప్రదాయాలను, ప్రమాణాలను కాదనటానికి గల అధికారం ఏమిటన్న సవాళ్లకు - తెలుసుకోవలసింది సత్యంగాని అధికారం కాదు; నా మాటలనైనా సరే విచక్షణ లేకుండా అంగీకరించవద్దు; స్వానుభవంతో తెలుసుకొన్న విషయాలను మీముందుంచుతున్నాను గాని గ్రంథాలు చదివి పాండిత్య పకర్ష ప్రదర్శించటం లేదు; వాస్తవ పరిశీలనకు ఎవరికి వారు ఉద్యుక్తులు కావాలి- అన్నదే కృష్ణమూర్తి జవాబు.

మతగ్రంథాలతో పరిచయం లేక, సూత్రభాష్యాల ప్రసక్తిలేక, సంప్రదాయ పదజాల ప్రయోగాలూ చేయక- సూటిగా చేసే విషయవివరణ- ఏ సంప్రదాయ మార్గానికీ ఇమడక పోవటం వల్ల కృష్ణమూర్తి తత్త్వం- తత్త్వశాస్త్రజ్ఞులను, పండితులను ఇరుకున పెడుతుంటుంది.

కృష్ణమూర్తి తాత్త్విక ధోరణిని ఏ సంప్రదాయ రీతితోనూ పోల్చటం సరిగాదు. కృష్ణమూర్తి తాత్త్విక సమాలోచనం- స్వీయానుభవాల వ్యక్తీకరణం- అది సహజసుందరం.

ప్రమాణాలు ప్రధానాలుకావు; సమస్యలను నేరుగా పరిశీలించి పరిష్కారాలను ఎవరికి వారే తెలుసుకోగలగాలి; అందుకు ఎట్టి ప్రభావాలకూ లోనుగాని ప్రశాంతచిత్తం ప్రధానమన్నదే కృష్ణమూర్తి హితవు.

మానవులను పట్టి పీడిస్తున్న సమస్యలకు కారణం- 'నేను' అనే భావన. అది మనోగతమైనదే కాని వాస్తవానికి భిన్నమైనది. సరియైన ఆత్మజ్ఞానం ద్వారా యథార్థాన్ని ఎఱుక పరచుకోగలం.

ఆత్మజ్ఞానం- అంటే స్వస్వరూపజ్ఞానం. తన స్థితిని తాను ఎఱుక పరచుకోవటమే స్వస్వరూపజ్ఞానం. అలాగే ఇతరులను గురించి, ప్రకృతి పరిసరాలను గురించిన జ్ఞానం సక్రమ జీవితానికి అవసరం- అంటూ మనిషి తనను గురించి తాను తెలుసుకోవలసిన అవసరాన్ని గుర్తు చేశారు.

వేల సంవత్సరాలుగా ఆత్మజ్ఞానాన్ని బోధ పరచుకోవలసిన అవసరాన్ని పవిత్రగ్రంథాలు ఉద్ఘోషిస్తున్నా మనిషిలో ఈ ప్రాథమికమైన మార్పురాక పోగా, 'అహం' కరడు గట్టుకు పోతున్నది. ''ఈత పాఠము కంఠస్థమైనది గాని ఈత కరస్థము కాలేదు'' అన్న చందంగా, ప్రవచనాలు పనికి రాకుండా పోయాయి.

ఆత్మజ్ఞానం అనే స్వస్వరూపజ్ఞానాన్ని కృష్ణమూర్తి తేలిక మాటలతో వివరించారు.

ముందుగా పరిశీలకుడిని పరిశీలించాలి. సూక్ష్మావలోకనం ద్వారా పరిశీలించే వాడు పరిశీలిత మయ్యేదానినుండి వేరు కాదని బోధపడుతుంది. అలాగే అనుభవం, అనుభవించే వాడు రెండు గాక ఒక్కటే. అదేరకంగా

ఆలోచన, ఆలోచించేవాడు కూడా ఒక్కటే. పరీక్షించటం, అనుభవించటం, ఆలోచించటం వంటివి చేతనావర్తంలోని ఒక దశమాత్రమే. ఆక్రియలో పరిశీలించేవాడు కాని, అనుభవించేవాడు కాని, ఆలోచించేవాడు కాని ఒక భాగమే గాని తదన్యంకావటానికి వీలులేదు.

ఒకే వ్యక్తి ఇతరులతో మసలేటప్పుడు వివిధ స్థాయిలలో ప్రవర్తించు తుంటాడు. అది ఇష్టాయిష్టాల ననుసరించి, గత స్మృతుల ననుసరించి ఉంటాయి. కల్పించుకొన్న ఊహలు, చేసుకొనే ఆలోచనలే అందుకు కారణాలు. ఆలోచనకన్న ఆలోచనా విధానమే ప్రధానమంటారు, కృష్ణ మూర్తి.

ఆలోచనలలోను, ఊహలలోను గల వైవిధ్యానికి మూలం 'మనస్సు'. విషయ గ్రహణ చేసేది మనస్సు. ఆ మనసుకున్న పరిమిత పరిధిలోనే సంచరిస్తూ విషయ గ్రహణం చేస్తుండటం వల్ల మనసు సంపూర్ణంగా దేనినీ గ్రహించలేదు. అనుభూతులు, ఇష్టాయిష్టాలు, తీరని కోర్కెలు, జ్ఞాపకాలు అంటిపెట్టుకొని ఉన్న మనసునకున్న సంకుచిత పరిధిని దాటాలి. వివేకం పొంది సూక్ష్మగ్రాహిత్వంతో యథార్థ స్థితిని కాంచగలగాలి- అన్నదే కృష్ణమూర్తి అభిప్రాయం.

గతంనుంచి పూర్తిగా విడిపోయిన మనసు స్పష్టంగా ఉంటుంది. అదే ప్రశాంత మనఃస్థితి. ఆస్థితిలో అనుభవాలు, జ్ఞాపకాలు తొలగిపోతాయి. ఆ మనఃస్థితిలోనే సత్యాన్ని తెలుసుకోగలం.

అనుభవాలు, జ్ఞాపకాల అవసరం నిత్యకృత్యాలు తీర్చుకోవటం వరకే పరిమితమై ఉండాలి గాని అవి మన జీవన సరణిని ప్రభావితం చేయకూడదు. కాని ప్రస్తుతం జరుగుతున్నది అదే.

నియమాలు, నిబంధనలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు, విశ్వాసాలు, నమ్మకాలనుంచి విముక్తి చెందాలి. అప్పుడు మనసు నిర్మలంగా, స్వేచ్ఛగా, స్పష్టంగా ఉంటుంది. సత్యాన్వేషణకు ఇదే ప్రథమ సోపానం.

మనసు కాలంతో ముడిపడి ఉంటుంది. గతస్మృతులు మనసును ఆవరించి ఉండటం వల్ల, భవిష్యత్తును ఆ గత అనుభవాల ద్వారానే

ఊహించుకొంటుంది. వర్తమానం- భూతభవిష్యత్తుల మధ్య ఒక మజిలీ. జ్ఞాపకాలు- మనసులో నిండి ఉన్న అనుభవాల ననుసరించి భవిష్యత్ వర్తమానాలకు హెచ్చరికలు చేస్తుంటాయి. సత్యాన్ని తెలుసుకోటానికి ఈ కాలమాన మనోగతి నుండి విడివడాలి. 'కాలం' అంటే కేవలం కాలచక్రంలోని దశలకు సంబంధించినది గాక, మనోగత కాలమే ప్రధానం. ఆలోచనకు, ఆచరణకు గల మధ్యనున్న విరామ కాలమే మనోగతకాలమని కృష్ణమూర్తి ఒక క్రొత్త కాల ప్రమాణాన్ని మనకు తెలిపారు. భయం, ద్వేషం, దౌర్జన్యం వంటి చేష్టలన్నీ ఈ కాలగతికి లోనైన మనసు ద్వారానే బహిర్గత మవుతాయి. ఈ కాల పరిధిని అతిగమించిన మనసు స్పష్టంగా ఉంటుంది.

మనసులోని వైరుధ్యాలు మానవునిలో ద్వంద్వ ప్రవృత్తిని ఏర్పరుస్తు న్నాయి. ఈ ద్వంద్వ ప్రవృత్తి కారణంగా మానవుల మధ్య సత్సంబంధాలు నెలకొనటం లేదు. అనుభవాలు, జ్ఞాపకాల పునాదులపై ఏర్పరచుకొన్న అభిప్రాయాలతోనే వ్యవహరించటం వల్ల అసలు మనిషి మరుగై భ్రమ కల్పిత మూర్తుల మధ్యే సంబంధాలు ఏర్పడుతున్నాయి. వైరుధ్యాలకు హేతుభూతమైన గత స్మృతుల నుండి విడివడిన మనసు ద్వారానే మానవుల మధ్య సత్సంబంధాలు నెలకొంటాయి.

జీవితానికి అర్థం జీవించటమే గాని అందులో ఏదో పరమార్థం ఉందనుకోవటంలో అర్థం లేదంటారు, కృష్ణమూర్తి. భ్రమలు కల్పించి, ఆశలు రేకెత్తించి మనిషిని మత్తుతో నింపి ఏదో క్రొత్త జీవితం ప్రసాదిస్తామనే ప్రబుద్ధులు వారి జీవితాలనే వారు సరిచేసుకోలేని స్థితిలోనున్నారు. తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనే తాపత్రయంలో నున్న వీరు, ఇతరులకు ఏదో సుగమమార్గాన్ని, తరణోపాయాన్ని ప్రసాదిస్తారనుకోవటం కేవలం భ్రమ మాత్రమే. ఎవరి జీవితాలకు వారే బాధ్యత వహించాలి గాని ఎవరో వచ్చి అద్దుకొంటారనుకోవటం సోమరితనాన్ని, పరాధీనతను సూచిస్తుంది.

జనన మరణాలు జీవిత క్రమానికి చెందిన ప్రధాన దశలు. శరీరంలోని జీవకణాలకు గూడా ఈ ధర్మం వర్తిస్తుంది. మృత్యువు జీవితాన్ని అంటి పెట్టుకొనే ఉంటుంది. భద్రత, శాశ్వతం అనేవి కేవలం భ్రమలు మాత్రమే.

మృత్యువు అనేది అవిదితమవటం వల్ల మానవ సహజమైన భయం మనుష్యులను పీడిస్తుంటుంది. అలవాటైన పరిసరాలపైని మక్కువ, క్రొత్త వాటియందు విముఖత, ఉన్నవి వదలుకోవలసి వస్తుందనే భీతి, ఆరాటం- మానవునికి జీవితంపై మమకారాన్ని, మృత్యువంటే భయాన్ని పురికొల్పు తున్నాయి. నిరంతర జీవన క్రమంలో పాతవిషయాలను మరచి క్రొత్త విషయాలను తెలుసుకొంటూ జీవించే వారికి మృత్యు భీతి ఉండదు. మృత్యువుకు ముందు జీవించటమంటే మృత్యువుతోనే జీవించటం- అంటే కాలాతీత ప్రపంచంలో జీవిస్తున్నట్లు విశదమవుతుంది.

ప్రపంచంలో నేడు నెలకొని ఉన్న అశాంతికి మూలం వ్యక్తిలో స్వార్థం ముదరటం. తన సుఖం, తన భద్రత, తన భవిష్యత్తు, మాత్రమే ముఖ్యమనుకొన్న వాడు ప్రపంచంతో సంబంధం కలిగి ఉన్నప్పటికీ ఒంటరివాడుగానే మిగులుతున్నాడు. అతనిలోని వైరుధ్య భావనాప్రవృత్తి వల్ల ప్రపంచం అంటే తానే అన్న విషయాన్ని మరచిపోతున్నాడు. నేను అనేది కేవలం భావన మాత్రమే. ఆ భావన, మనసులో ఆలోచన ద్వారా ఏర్పడుతున్నది. మనసుకు భావోద్రేకానికి సరియైన పొంతన ద్వారా సత్యం గోచరిస్తుంది. ఎఱుక అప్రమత్తతల వల్ల తమ యథార్థ స్థితి గోచరిస్తుంది.

నిర్మలమైన మనసు, కోమల హృదయం, మృదు శరీరం కలసి సమశ్రుతిలో నున్నప్పుడు సమ్యక్ జ్ఞానం బోధపడుతుంది. తాను ఒక్కడు అని గాక, తానే ప్రపంచమని విశదమవుతుంది.

విశాల హృదయం, కరుణాంతరంగం, అవ్యాజమైన ప్రేమల కలయికే నిజమైన సుఖం. అందులోనే విముక్తి. అదే సత్యం- శాశ్వతం.

ఈ సత్యాన్ని శోధించటానికి ఎవరికి వారే ప్రయత్నించాలి.

భాషకున్న పరిమితి స్వల్పం. భాష ద్వారా భావాలనన్నింటినీ సంపూర్ణంగా వ్యక్తపరచలేం. అక్షర రూపం దాల్చేసరికి అవి మరీ కుదించుకు పోతాయి. అందుకనే ఎవరికి వారు ప్రయత్నించి సత్యాన్ని అనుభవ పూర్వకంగా ఎఱుక పరచుకోవాలి.

# 17

# కృష్ణమూర్తి జీవన రాగం మృత్యు విరావం

జీవితం, మృత్యువూ రెండూ ఒకటిగానే కలసి వుంటాయి. మృత్యువు జీవితాన్ని సదా అంటిపెట్టుకొనే ఉంటుంది. కాగా, జీవితం మృత్యువూ సృష్టిక్రమానికి చెందిన రెండు దశలు మాత్రమే.

పుట్టిన జీవి గిట్టక మానదు. పొందిన అనుభవాలు, అంటిపెట్టుకొని ఉన్న జ్ఞాపకాలు, తద్వారా కలిగే ఆలోచనలు - జీవితం అనశ్వరం - అనే భ్రమను కలిగిస్తున్నాయి.

ఏదో ఒక విధంగా బ్రతకటం అలవాటు చేసుకొన్నజీవి, బ్రతుకు బాట ఏదో ఒక నాటికి మృత్యువు ఆగమనంతో అంతమవుతుందనే తలపు రావటంతోటే భయపడి మృత్యువు బారి నుంచి తప్పించుకోవాలని విఫల ప్రయత్నాలు చేయటం సహజమయి పోయింది.

అసదృశమైన స్వేచ్ఛా ప్రవృత్తి గల 'నేను' అన్న భావన - ఆ భావనకు దోహదం చేసే పరిసరాలు, కాలం, జ్ఞాపకాలు; ఆలోచనలు సృష్టించిన సుఖాలు, దుఃఖాలు, బాంధవ్యాలు - వీటన్నింటి నుంచి విముక్తి చెందినప్పుడు మృత్యువంటే ఏమిటో విదితమవుతుంది. అది ప్రయత్న పూర్వకంగా కాక సహజోద్గమంగా నిర్మలమైన మనసు ద్వారానే తెలుసుకో గలగాలి. మృత్యువుకు ముందు జీవించట మంటే మృత్యువుతో జీవించటమే- అంటే కాలానవచ్చిన్న ప్రపంచంలో జీవించటం.

కృష్ణమూర్తి జీవితపథంలోని జీవన రాగాన్నీ, మృత్యు విరావాన్నీ పరిశీలించినప్పుడు కృష్ణమూర్తి అటువంటి స్థితికి చేరుకొని, మృత్యువును దర్శించి, మృత్యువుతో సదా జీవించ గలిగినట్లు విదితమవుతుంది.

కృష్ణమూర్తి దృష్టిలో - మానవజీవితం ఒక బృహత్ గ్రంథం. ఎంతో అనుభవం, ఎంతో లోతుకు పాతుకు పోయిన భయాందోళనలు, సుఖదుఃఖాలు, లక్షల సంవత్సరాలుగా ప్రోదిచేసి పెంచుకొన్న నమ్మకాల సర్వస్వమూ - అన్నీ ఈ గ్రంథంలో నిక్షిప్తమై ఉన్నాయి. ఈ గ్రంథం ఏ ఒక్కడి జీవిత క్రమానికో చెందింది కాదు. అది అందరి జీవితాలకూ సంబంధించినది.

అన్ని జీవితాలూ స్థూలంగా ఒకే మూసకు చెందినప్పటికీ - కాలం, సమాజం, మానసిక స్థాయి, హృదయాంతరాళం, పరిసరాలు, వాతావరణం, వంటి విభిన్న వస్తుగుణ విశేషాల ప్రభావాలవల్ల ఏ జీవితానికి ఆ జీవితం భిన్నంగా తోస్తుంది.

సప్తస్వరాలు - స్వర, క్రమ, స్థాయీ భేదాల ద్వారా వివిధ రాగాలను సృష్టిస్తాయి. అన్ని రాగాలూ 'లయ' బద్ధమే. వివిధ వాద్యాలు అవేరాగాలను వివిధ ఆరావ విశేషాలతో మనస్సును ఆకట్టుకుంటాయి. ఒక్కొక్క వాద్య విశేషానిది - ఒక్కొక్క రవళి.

కృష్ణమూర్తి జీవితంలో మనకు అంతర్లీనంగా వినిపించే రాగారావం- ప్రత్యేకమైనదేకాక విశిష్టమయింది. అది కృష్ణమూర్తి హృదయతంత్రులు వినిపించిన రాగ విశేషం. ఆ జీవనరాగం కృష్ణమూర్తి అంతరంగ జన్యం. మస్తిష్కం, మనస్సు, హృదయం - సమశ్రుతిలో కలసి అలరించిన మూర్ఛన - ఆరాగం.

సృష్టి, స్థితి, లయల సమన్వయం జీవితం. ఇవి ఒకదానిని ఒకటి అంటిపెట్టుకొనే వుంటాయి. జీవిత నిర్వహణం జీవనం. అది ఒక విధానం - అంటే, మానవ సమాజం నిర్ణయించుకొని విధించుకొన్న పద్ధతి. లక్షల సంవత్సరాలుగా సమాజం ఏరి, కోరి, కూర్చి, పేర్చుకొన్న జీవన విధానంలో మౌలికమైన మార్పు లేకపోగా, మూల విధానానికి అనుబంధంగా మరికొన్ని విధానాలు కాలానుగుణంగా వచ్చి చేరాయి. క్రమంగా అప్రధానాలు ప్రధానాలుగా రూపొందాయి. విధానాలు శాశ్వతాలు కావు. ఇవి కాలగతమైనవి. కాలానవచ్చిన్న మనస్సును ఇవి అంటవు.

జీవితం అంటే ఒక స్రవంతి. అది నిండుగా, లోతుగా ప్రవహిస్తూ ఎన్నో మలుపులు తిరుగుతూ, నిమ్నోన్నతాలను అతిగమించి గమ్యం

చేరుతుంది. అది నిత్య చైతన్యవంతమైనట్టిది. జీవన సరణికి భిన్నంగా జీవించటం వల్లనే - నిరాశ, నిస్పృహ వంటివి మానవ జీవితంలో చోటు చేసుకుంటున్నాయి. జీవన వాహినితో సంబంధంలేక, దాని ప్రక్కన పడివుండే చైతన్యహీనమైన మడుగుల బ్రతుకులను ఆశ్రయించటం వల్లనే జీవితం నిస్సారం అవుతుంది - అన్నారు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ఉత్తమ భావుకుడు; సౌందర్యోపాసి, కవి. జీవితాన్ని లోతుగా పరిశీలించి, అందులోని సౌందర్యాన్ని, మర్మాలను మనముందుంచారు. నిరంతర సత్యాన్వేషణ ద్వారా తెలుసుకొని, తెలిపిన జీవిత తత్త్వం - ఆత్మత్యాగం. జీవుడు జీవితంతో ఐక్యం పొందటం ద్వారా ''నేను'' అనే వ్యక్తి భావన నుండి విడివడి విశ్వ మానవుడు అవుతాడు. కృష్ణమూర్తి విశ్వమానవుడు.

కృష్ణమూర్తి బాల్యం అంతా దినదిన గండం నూరేళ్ల ఆయుస్సుగా ఎప్పుడూ ఏదో ఒక రుగ్మతతో గడచింది. ఒకానొక సందర్భంలో తామే స్వయంగా చెప్పుకున్నట్లు లెడ్ బీటర్ గుర్తించకుంటే కృష్ణమూర్తి ఏనాడో మనకు దక్కకుండా పోయి ఉండేవారేమో? యౌవన ప్రాంగణంలోనికి ప్రవేశించిన తరువాత గూడా అస్వస్థత తరచుగానే పలకరించి పోతున్నా మధ్య వయస్సులోకి అడుగిడిన అనంతరం ఏవోకొన్ని సందర్భాలలో మాత్రమే తీవ్ర అస్వస్థతకు గురి అయ్యారు. వస్తుతా శరీరం దృఢమయింది కాదు. కాని వ్యాయామం, యోగాసనాలు, ఆహార నియమాలు, ముఖ్యంగా దినసరి కాలినడకతో శరీరాన్ని ఆరోగ్యంగా, మృదువుగా ఉండేటట్లు అదుపులో ఉంచుకో గలిగారు. ముఖ్యంగా ''ఓహై''లో యోగసంబంధమైన మొదటి అనుభవం పొందిన నాటినుంచి వారిలో ''మార్పు'' ప్రస్ఫుటంగా కనిపించసాగింది.

అది ఒక దివ్యానుభూతి. ఎవరో ఆవేశించినట్లు, ఏదో మహత్తరశక్తి ఆవహించినట్లు, ఎక్కడికో వెళుతున్నట్లు అతిలోక సౌందర్యాన్ని ఆస్వాదించినట్లు, ఆత్మ సాక్షాత్కారానికి ఆలంబన దొరకినట్లు, ఆనంద తన్మయత్వం అబ్బినట్లు, ప్రశాంత పరిధిలోనికి ప్రవేశించినట్లు - అనుభూతి చెందారు. ఆ అనుభూతి కృష్ణమూర్తిని చాలాకాలం అంటిపెట్టుకొని, మరికొన్ని అనుభవాలను పొందేందుకు సాయపడింది. మైత్రేయుడు, పరమగురువు 'కూత్ హూమి'ల సాక్షాత్కారంతోబాటు, వారి ఉపదేశాలు

కూడా లభ్యమైనట్లు, ఆత్మసాక్షాత్కారం, మానసిక శక్తుల విజృంభణ వంటి శక్తులు సిద్ధించినట్లు - వారి సంభాషణలలోను, ప్రసంగాలలోను ద్యోతకమయింది.

చదువుకోసం ఇంగ్లాండు వెళ్లిన తొలినాళ్లలోనే అంతర్మథనం ఆరంభమయింది. తమను జగద్గురువుగా ప్రకటించబూనటం, అందుకు గాను తమను ఆయత్త పరచే సన్నాహాలలో భాగంగా స్వీయ వ్యక్తి వికాసాన్ని నిరోధించటంతో బాటు, ఆంక్షలు, ఆకాంక్షల ఉచ్చులు బిగించి పంజరపు బ్రతుకు విధించబూనే ప్రయత్నాలు - అన్నింటిని వమ్ముచేసి స్వేచ్ఛను పొందేందుకు కొంత కాలం పట్టింది. తమ కోసం ఏర్పరచిన తారక సంస్థను రద్దు పరచటంతో పంచారపు బ్రతుకు నుంచి విముక్తి పొందినట్లయింది. ఆ పైని జీవితం స్వేచ్ఛగా సాగి మహోన్నత పథంలో పయనించింది. స్వేచ్ఛలోని ఆనందాన్ని, అనుభవించటమే కాక, ఆ ఆనందాన్ని అందరికి ఎఱుక పరచారు.

కృష్ణమూర్తిదారిద్ర్యం అనుభవించారు. కాని కృంగిపోలేదు. అలాగని సిరివచ్చి చేరినప్పుడు ఉప్పొంగి పోలేదు. తారక సంస్థను రద్దు పరచేనాటికే కోట్ల రూపాయల విలువగల ఆస్తిపాస్తులు సమకూరాయి. సంస్థను రద్దు పరుస్తూనే దాతలకు వారందించిన భూరి విరాళాలను తిరిగి ఇచ్చివేశారు. ఆనీబెసెంటుకు దత్తపుత్రుడుగా సంక్రమించిన ఆస్తిపాస్తులను మాత్రమే స్వీకరించారు. ''కృష్ణమూర్తి ఫౌండేషన్'' వారు పుస్తక ప్రచురణ, సమావేశాల ఏర్పాటు, విద్యాశాలల నిర్వహణ వంటి కార్యక్రమాల ద్వారా మరికొన్ని ఆస్తిపాస్తులు సమకూర్చ గలిగారు. కోట్ల రూపాయల విలువగల స్థిరచరాస్తులకు తాను హక్కు దారుగా ప్రకటించు కోటానికి విముఖత ప్రకటించారు. పుట్టినప్పుడు కాని ఆ తరువాత కాని, ఏ ఆస్తిపాస్తులూ లేని తమకు వీలునామా వ్రాసే అవసరమే లేదంటూ మిత్రులు, సన్నిహితులు ఎంత వత్తిడి తెచ్చినా అటువంటి ప్రతిపాదనలను త్రోసిపుచ్చారు.

ఐశ్వర్యాలు, ఆడంబరాల మధ్య మసలినా వాటికి లొంగలేదు. ఆర్భాటాలు, పటాటోపాల ప్రసక్తిలేదు. మహిమల ప్రదర్శన, జనాకర్షణ తతంగాలు లేవు. ప్రసంగాలు వినేవారి సంఖ్య కూడా అంత ఎక్కువగా ఉండేది కాదు. సాష్టాంగదండ ప్రణామాలను నిరసించేవారు. సభలకు విచ్చేసిన వారిలో ఎక్కువమంది విద్యావంతులుండేవారు.

అభిమానులలో కొందరి వింత ధోరణి ఒక్కొక్కప్పుడు కృష్ణమూర్తిని ఇబ్బంది పెట్టేది -

గురు - శిష్య వ్యవస్థను ఖండించిన కృష్ణమూర్తిని గురువుగానే కొలిచేవారు.

వ్యక్తి పూజను నిరసించిన కృష్ణమూర్తిని దైవంగానో, దేవదూతగానో ఆరాధించేవారు.

వ్యవస్థీకరణకు ఇచ్చగించని కృష్ణమూర్తి అభీష్టానికి భిన్నంగా మరో రూపంలో సంస్థలు నెలకొన్నాయి.

తన ప్రసంగాలపైనా, ప్రవచనాలపైనా అధికారం ప్రకటించేందుకు, మార్పులు చేసేందుకు, ఏ సంస్థకు గాని, సభ్యునికిగాని అధికారం లేదన్నారు. కాని ఆచరణ అందుకు భిన్నంగా ఉంటున్నది.

ప్రసంగాలు వినటంతోనే సరిపుచ్చుకోక ప్రతి అంశాన్ని పరిశీలించి ఎవరికివారు సమన్వయం చేసుకోవాలన్న కృష్ణమూర్తి హితవు ఎందరిని ఆ దారికి మళ్లించిందన్నది ఒక ప్రశ్నగానే మిగిలిపోయింది.

పరిస్థితులను ఎఱుకపరచి జాగరూకులను చేయటమే తమ వంతుపని కాని, మార్చటం తమ బాధ్యత కాదన్నారు, కృష్ణమూర్తి. చెప్పింది వినాలన్న నిర్బంధం లేదు. అది వ్యక్తిగత అభీష్టాలపై ఆధారపడి వుంటుంది.

ప్రపంచంలో నెలకొన్న ఉన్మాదాన్ని, అసమానతలను, ఆందోళనను మార్చేది 'ప్రేమ' ఒక్కటేనంటూ - 'ప్రేమ' అంటే స్వార్థత్యాగం; వ్యక్తుల మధ్య అంతరం లేకుండా చూచుకోవటం ద్వారానే ప్రేమ ఉదయిస్తుంది; శ్రద్ధతో కూడిన దర్శన, శ్రవణక్రియలు అందుకు అనువైన అనుసంధానాలు అన్నారు.

వివాదాలకు, వ్యవహారాలకు దూరంగా ఉండటమే కాక, హాని తలపెట్టిన వాళ్ళను కూడా చెంతకు చేరదీసి ప్రేమను పంచి ఇచ్చారు.

పసివారి మనస్సులను మలిన పరచకుండా స్వేచ్ఛాయుత వాతావరణంలో పెంచగలిగితే భాస్వంతమైన వారి జీవితాలు ఉజ్జ్వలంగా ప్రకాశించే అవకాశం మెండుగా ఉంటుందనే ఉద్దేశంతో అందుకు అనువైన పాఠశాలలు

కొన్ని నెలకొల్పారు. అవకాశం దొరకినప్పుడెల్లా విద్యార్థులతో ఇష్టాగోష్టి జరిపేవారు. అధ్యాపకులేకాక తల్లిదండ్రులు కూడా తమ బాధ్యతలు తెలుసుకొని తమ స్వార్థానికి, అభీష్ట సిద్ధికి మాత్రమేకాక, పిల్లల వ్యక్తి వికాసానికి తోడ్పడాలన్నారు.

కృష్ణమూర్తి, జీవితంలో ''లో వెలుగులను'' స్పృశించి తెలియ పరచటంతో బాటు మృత్యువుతెరలనుకూడా దర్శించి మృత్యువు అంటే ఏర్పడిన భయసందేహాలను తీర్చారు. మృత్యువు గురించి మీమాంస తమ్ముడు నిత్యానంద మరణించినప్పుడు పొందిన వేదనతో ప్రారంభమైనట్లు తోస్తున్నది. ఆ విషాదంనుంచి కోలుకొన్నప్పుడు, ఆతరువాత వివిధ సందర్భాలలోను మృత్యువు గురించి చేసిన ప్రస్తావనలు గమనార్హాలు.

కృష్ణమూర్తి మృత్యుభీతి చెందక పోవటమేకాక, ఒక్కొక్కమారు మృత్యువుకు చేరువయ్యేవారు. క్రూర వన్యమృగాలు ఎదురైనప్పుడు వాటికి దగ్గరగా వెళ్లేవారు. ఏ అపకారమూ చేయక వాటిత్రోవన అవి వెళ్లేవి. ప్రక్కనున్న వారికి భయభ్రాంతులతో శరీరం జలదరించేది.

మృత్యువు; సజీవంగా మృత్యుగహ్వర ప్రవేశం - అనే అంశాలపై కృష్ణమూర్తి, 1955 సంవత్సరం పూర్వ భాగంలో లండన్‌లో ఏర్పాటయిన బహిరంగ సమావేశాలలో మొట్టమొదటి సారిగా ప్రస్తావన చేశారు.

- తెలుసుకున్నవాటి నుండి, పేర్చి కూడగట్టుకొన్న మమకారాలు, బంధాలనుండి స్వేచ్ఛ పొందటమే, మృత్యువు. అది ఎలాగు ఉంటుందో తెలియదు కనుకనే మృత్యువు అంటే భయం కలుగుతుంది. బ్రతికి ఉన్నప్పుడే మృత్యువును దర్శించటం అంటే అదేదో రుగ్మతకు సంబంధించిన భావం (MORBID IDEA) కాదు. నశింపులేనిదే సృష్టి సృజన అనేవిలేవు - అన్నారు.

1959 సంవత్సరంలో కాశ్మీరంలోని పహల్‌గామ్‌లో బసచేసినప్పుడు మూత్రపిండ వ్యాధి, తీవ్రజ్వరం - వారిని తీవ్ర అస్వస్థతకు గురిచేశాయి. అయిపోయిందనే స్థితి - జీవకణాలపై పనిచేసే వ్యాధి నిరోధక ఔషధాలు (ANTI-BIOTICS) జీవితంలో మొట్టమొదటి సారిగా వాడారు. కాళ్లు చచ్చు బడిపోయాయి. అవిటి జీవితం తప్పదనే స్థితికి వచ్చారు. చాలాకాలానికి

తిరిగి మామూలు పరిస్థితికి రాగలిగారు - మృత్యు ద్వారం దర్శించినట్ల యింది.

ిర్తిని ఒక్కొక్కసారి ఏదోశక్తి ఆదేశించినట్లు, ఎవరో ఆవహించినట్లు ఉండేది. కంఠస్వరంలో మార్పు వచ్చేది. కళ్ళు ఉబ్బరించేవి. దృష్టి ప్రగాఢంగా ఉండేది. ముఖంలో మార్పు వచ్చేది. శరీరం ప్రకంపించేది. కొన్ని సమయాల్లో మూర్ఛపోయినట్లయ్యేది. ఆతావున ఎవరో శక్తి సంపన్నుడైన వ్యక్తి వచ్చి చోటుచేసుకొన్నట్లుండేది. శూన్యత, పరిపూర్ణతలు మిళితమైన ఏదో అనిర్వచనీయానుభూతి కలిగేది. కృష్ణమూర్తి ప్రసంగ సమయాలలో కూడా ఎన్నో సందర్భాలలో ఎవరో ఆదేశించి మాట్లాడించి నట్లుండేది. ఆయా సందర్భాలలో శ్రోతలు ఉత్తేజితులయ్యేవారు. కృష్ణమూర్తి ప్రసంగించే సభా ప్రాంగణంలో కూడా నిశ్శబ్ద వాతావరణం నెలకొనేది. అంతటా ప్రశాంతత. శ్రోతలు సమ్మోహి తులై వినేవారు.

ఏమిటి ఆ శక్తి? ఎవరా వ్యక్తి? మైత్రేయుడా? బోధిసత్వుడా? లేక మరొకరా? - ఇలాంటి ప్రశ్నలు ఎన్నో ఉద్భవించేవి. సన్నిహితులు కుతూహలంతో వివరాలు అడిగినప్పుడు విషయం దాటవేశేవారు. అయితే కొన్ని సమయాలలో చెప్పటానికి ప్రయత్నించి అర్ధాంతరంగా ముగించే వారు.

ఒక్కొక్కప్పుడు కృష్ణమూర్తి శరీరంలో 'శక్తి' ప్రవేశించే తరుణంలో శరీరం రంగు మారేది; చైతన్యం నశించి శవాకారం అయ్యేది. ప్రక్కనున్న వారికి శరీరాన్ని జాగ్రత్తగా చూడవలసిందిగా సూచనలు అందేవి. అటువంటిదే ఒకానొక సందర్భంలో - ''మీకు రక్షణ కల్పించేందుకే మృత్యువు మిమ్మల్ని సదా అంటిపెట్టుకొని ఉంటుంది. భయపడి తప్పించు కోవాలని ప్రయత్నించినప్పుడు మృత్యువు వాత పడక తప్పదు'' - అన్న సందేశం వినిపించింది.

1974 సంవత్సరం ఉత్తరార్ధంలో తమకు సన్నిహితంగా ఉండే మేరీ జింబాలిస్ట్‌తో ముచ్చటిస్తూ - చేయవలసింది ఇంకా ఎంతో ఉన్నది కనుక మరొక పది, పదిహేను సంవత్సరాలు జీవించాల్సిన అవసరం ఉన్నది. శరీరం పటుత్వం తరుగు తున్నా, మస్తిష్కం చెక్కు చెదరలేదు

- అంటూ తమ జీవిత కాల నిర్ణయం సూచన చేశారు. అప్పటికి కృష్ణమూర్తి వయస్సు డెబ్భై తొమ్మిది సంవత్సరాలు.

పసివారి మనస్సులు లేత మొగ్గల్లాంటివి. మొగ్గ ఆరోగ్యంగా, నిండుగా వికసించి పరిమళించటానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. దానికి ఏ కాలుష్యమూ సోకకూడదు. తగినంత గాలి, వెలుతురు, నీరు కావాలి. సహజ వాతావరణంలో ఎదిగి వికసించిన మొగ్గ కమనీయంగా ఉంటుంది. అలాగే పసివారి మనస్సులు వికసించేందుకు ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి.

నేటి విద్యావిధానం పిల్లల మనోవికాసానికి, పరిపూర్ణ మానవులుగా రూపొందేందుకు ఉపకరించేదిగా లేదు. వారిని మన అభీష్టాలకు, ఆశయాలకు తగినట్లు మలచుకొనే ప్రయత్నంలో వారికి మంచికన్న చెడు ఎక్కువగా చేస్తున్నాం. స్వప్రయోజనాలు అవతలకునెట్టి, పిల్లల మనోభావా లను గుర్తించి స్వేచ్ఛాయుత వాతావరణంలో పెంచి విద్యాబుద్ధులు నేర్పితే వారిబ్రతుకులు నిండుగా, పరిపూర్ణంగా ఉంటాయనే ఉద్దేశంతో కృష్ణమూర్తి కొన్ని పాఠశాలలు నెలకొల్పారు. పిల్లలకే కాక పెద్దలకు కూడా ఉపకరించేందుకు కొన్ని ధ్యానకేంద్రాలు నెల కొల్పాలనే తలపు కృష్ణమూ ర్తిలో చాలాకాలంగా మెదులుతుండినది. వీటి ఏర్పాటుకు, నిర్వహణకు ఎంతో వ్యయ, ప్రయాసలకు లోనవ్వాలి. ముఖ్యంగా శ్రద్ధతో పనిచేసే వ్యక్తులు లభించాలి. సంకల్పం మంచిదయితే వనరులు వాటంతట అవే సమకూరుతాయి - అనేవారు కృష్ణమూర్తి. విద్యాశాలలు నెలకొల్పారు. ధ్యాన కేంద్రాల స్థాపన ఇంకా కార్యరూపం దాల్చలేదు. అందుకే మరికొంత కాలం జీవించాలి - అని అనుకొన్నట్లు తోస్తున్నది. ఆతరువాత అనతి కాలంలోనే అనుకొన్న పనులు కార్యరూపం దాల్చాయి. వాస్తు శిల్పులు, వదాన్యులు ఉత్సాహంతో ముందుకు వచ్చి పనులు సానుకూలం చేశారు.

ఇంకా పది, పదిహేను సంవత్సరాలు జీవించాలి - అన్న సంకల్పం వెలిబుచ్చిన పదిరెండు సంవత్సరాలకు కృష్ణమూర్తి ఇహలోక యాత్ర చాలించారు. అనుకొన్న పనులు కూడా దాదాపు పూర్తి అయ్యాయి.

ఏదో ఒక రుగ్మత కృష్ణమూర్తిని కడవరకూ పలకరించి పోవటం ఆనవాయితి అయింది. ఒకసారి శుక్రాశ్రయం (PROSTATE GLAND)

శస్త్ర చికిత్స చేయాల్సివచ్చింది. వైద్యులు మత్తుమందు ఇవ్వబోతే శరీరం తట్టుకోలేదని వద్దన్నారు. శస్త్ర చికిత్స జరిగింది దేహానికి కాగా, ప్రాణికి ఆక్రియతో నిమిత్తం లేనట్లు మిన్నకుండినారు.

- తనదేహం, తన ఆలోచనలు, తనమార్గం వంటి వైయుక్తిక భావనలను త్యజించినప్పుడు మృత్యువు అంటే వెరపు ఉండదన్నారు.

ప్రాణభీతి లేకపోవటానికి మరొక కారణం - తమకు సదా రక్షణ కల్పించుతున్న అదృశ్య శక్తిగా చెప్పుకున్నారు. ఆ శక్తి వివరాలు మాత్రం చెప్పలేదు. తాము ప్రమాదాలకు లోనుకాక పోవటమేకాక, తమతో ప్రయాణించే వారికిగాని తమ సాన్నిధ్యంలో ఉండేవారికి గాని - ఏ ప్రమాదాలు సంభవించవన్నారు. వివిధ వాహనాలపై ఎంతో విస్తృతంగా ప్రయాణించినా ఎప్పుడూ ప్రమాదాలలో చిక్కుకోలేదు.

కృష్ణమూర్తి దేహాన్ని ఏదోశక్తి ఎప్పుడూ కాచుకొని రక్షణ కల్పించుతూ ఒక ప్రయోజనం కోసం వినియోగించుకొన్నట్లు ఎన్నో సంఘటనల వల్ల విశదం అవుతున్నది. ఆశక్తి మైత్రేయుడు కాని, బోధిసత్త్వుడు కాని లేదా మరొక మహా పురుషుడు కాని కాదని కొన్ని సందర్భాలలో వారే చెప్పుకున్నారు. దుర్బల శరీరంతో ఎప్పుడూ ఏదో ఒక రుగ్మతతో బాధ పడినా చిన్ననాటి నుంచి మనస్సు ఏ ఆందోళనా లేక ప్రశాంతంగా శూన్యంగా - ఉండినట్లు చెప్పుకున్నారు. మానసిక స్థాయి విశేషాలలో అది అత్యున్నతమైనది.

మృత్యువుపై విస్తృత వ్యాఖ్యలు జీవిత కాలంలోని చివరి దశకంలో ఎక్కువగా చేశారు-

- మృత్యువు అంటే తెలుసుకున్నవాటి నుంచి విడిపోవటం. అన్ని జ్ఞాపకాల నుంచి, భౌతికకాయం నుంచి విడిపోవటం. అన్ని బంధాలనుంచి విముక్తి చెందటమే బ్రతికి ఉండగనే చనిపోవటం. ఏదో రుగ్మతతో శరీరం కృంగి, కృశించి, నశించి పోవటమే మృత్యువును చేరుకోవటమనిపించు కోదు. సజీవంగానే ఉండి - శక్తి, బుద్ధి విశేషము, పరేంగిత జ్ఞానము - వీటితోబాటు తాముగా ఏర్పరచుకొన్న కొన్ని దృఢాభిప్రాయాలు, వైఖరులు, అనుభవాలు, బంధాలు - ఈ సర్వస్వాన్ని వీడి విముక్తి చెందటమే

మృత్యువును ఆశ్రయించటం. అంటే బ్రతికి ఉండగనే మృత్యువుతో జీవించటం. మృత్యువు అంటే ఎక్కడో దూరంగా లేదు. మృతి చెందట మంటే ఏదో ప్రమాద వశాత్తుగాకాని, రోగగ్రస్తమైకాని, ముదిమివల్లకాని జీవితం ముగియటం మాత్రమే కాదు. మనస్సులో పేరుకుపోయిన అన్ని జ్ఞాపకాల నుంచి విముక్తి చెందటమే మృతిచెందటం. అదే జీవితంతో కలసిన మృత్యువు-

- అంటూ వ్యాఖ్యానించారు.

కృష్ణమూర్తి జీవిత చరమాంకం ఉత్కంఠాభరితం. 1985 సంవత్సరం ముగింపుకు కొన్ని నెలల ముందు భారత దేశం విచ్చేశారు. రాజఘాట్, ఋషీవాలీ, మదరాసులలో తాము నెలకొల్పిన విద్యాకేంద్రాలను సందర్శిం చారు. పండితులు, పెద్దలు, విద్యార్థులు, అభిమానులు, సన్నిహితులు - అందరితోనూ ఇష్టాగోష్టి జరిపారు. బెంగళూరు, బొంబాయి, ఢిల్లీవంటి నగరాలకు కూడా వెళ్లి తమరాక కోసం ఎదురుచూస్తున్న వారినందరినీ కలుసుకోవాలను కున్నారు. ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించటంతో మదరాసునుంచి నేరుగా 'ఓహై' చేరుకొన్నారు.

భారతదేశానికి బయలుదేరటానికి ముందే అంతంత మాత్రంగా ఉండిన ఆరోగ్యం క్రమంగా క్షీణించసాగింది. రాజఘాట్‌లో రోజులు భారంగా గడచాయి. ఋషీవాలీలో ఉన్నరోజులు కూడా మరింత భారంగా గడచాయి. మదరాసు చేరేనాటికి నీరసంతో బాటు తీవ్రజ్వరం కూడాతోడ యింది. ఎక్కువగా మాట్లాడ లేకపోయారు. మదరాసులో మొదటి ప్రసంగం అర్ధాంతరంగా ముగిసింది. రెండవ ప్రసంగం అనుమానంలో పడింది. కాని, సుదూర ప్రాంతాలనుంచి విచ్చేసిన అభిమానులకు ఆశాభంగం కలుగకుండా అతికష్టం మీద సుమారు ఒకగంటసేపు ప్రసంగించారు.

జీవితం, జీవన సమస్య, సృష్టికి మూలం, భగవంతుడు, ధ్యానం, కంప్యూటర్లు - ఇలా వివిధాంశాలపై ప్రసంగం సాగింది. ప్రసంగం ముగిస్తూ - ఇది చివరి ప్రసంగం; కొద్దిక్షణాలు ప్రశాంతంగా కూర్చోవాలనిపించితే అలాగేనని మూడునిమిషాలు మౌనంగా కూర్చున్నారు. సభ

మౌనముద్ర వహించింది. చేతులు జోడించి నమస్కరించి వేదికపై నుండి నిష్క్రమించారు-

- మరికొన్ని రోజులలో జీవితరంగం నుంచే నిష్క్రమిస్తారని సభకు విచ్చేసిన వారు ఊహించలేదు. కొందరి మనస్సులలో సందేహం మెదలినా నమ్మశక్యం కాలేదు.

బౌద్ధమత గ్రంథాల భాష్యకారుడు పండితుడు శ్రీ జగన్నాథ ఉపాధ్యాయ కూడా మదరాసుకు విచ్చేసిన ప్రముఖులలో ఉన్నారు. వారు జ్యోతిషశాస్త్రంలో కూడా ప్రజ్ఞావంతులు. కృష్ణమూర్తి పరిస్థితిని గమనించి ఆందోళన చెందారు.

మృత్యువును ఆహ్వానించవద్దని కృష్ణమూర్తికి చెప్పవలసిందిగా, కృష్ణమూర్తికి సన్నిహితంగా ఉండే ఒక వ్యక్తితో చెప్పారు. జరుగుతున్నదేమో ఉపాధ్యాయ మనస్సుకు తట్టినట్లుంది.

అందుకు కృష్ణమూర్తి- తాము మృత్యువును ఆహ్వానించటం లేదని, కాని ఎంతకాలం దుర్బల శరీరం నిలుస్తుందని, అప్పటికే ఆరుకిలోల బరువు కోల్పోయిన శరీరం మరికొంత బరువును కోల్పోతే నడవటం కూడా సాధ్యంకాదని, ఆపైన ప్రసంగాలు నిలిచి పోతాయని, శరీరం శుష్కించి నశించి పోతుందని, అప్పుడు శరీరం ప్రయోజనం కూడా శూన్యం అవుతుందని చెపుతూ, విషాద వదనంతో తమవైపు చూస్తున్న ఆ వ్యక్తిని వారించారు.

మదరాసులో గడపిన చివరి రోజున అడయారు సముద్ర తీరానికి వెళ్లి నాలుగు దిక్కులకు ప్రదక్షణ నమస్కారం చేసి మదరాసుకు, అడయారు పరిసరాలకు కడపటి వీడ్కోలు చెప్పారు.

అమెరికా చేరినతరువాత వైద్యపరీక్ష చేయించుకున్నారు. అస్వస్థతకు కారణం పుట్టకురుపు అని తెలిసింది. చికిత్స ఆరంభం అయింది. ఫలితం కనిపించటం మాట అటుంచి ఏరోజుకు ఆరోజు పరిస్థితి ఆందోళనకరంగా పరిణమించింది. శరీరం బరువు మరింత తరిగింది. జ్వరం తగ్గలేదు. పరిచర్య చేస్తున్నవారి ముఖాలలో విషాదం తొంగి చూడనారంభించింది.

మరణం ఆసన్నమైనట్లు తోస్తున్నది; శరీరం విడచిపోవటానికి ఇంకాఎందుకు ఆటంకం? సర్వదా రక్షణ కల్పిస్తున్న ఆ 'శక్తి'కి - మృత్యువుకు మధ్య పెనుగులాటను కాంచగలుగుతున్నాను - అంటూ తామున్న పరిస్థితిని వివరించారు కృష్ణమూర్తి.

పరిస్థితి రానురాను విషమించి అదుపు తప్ప నారంభించింది. తాము స్థాపించిన సంస్థలను పర్యవేక్షిస్తున్న వారిలో యువతరానికి చెందిన కొందరు వ్యక్తులను పిలిపించమన్నారు. వారు వచ్చి కలుసుకున్న తరువాత వారి బాధ్యతలను గుర్తుచేశారు.

మృతి చెందిన శరీరాన్ని దహనం చేసి అస్తికలను, చితాభస్మాన్ని మూడు భాగాలుగా విభజించి - ఒక భాగాన్ని - 'ఓహై'కి, మరొక భాగాన్ని 'బ్రూక్‌వుడ్'కు, మూడవ భాగాన్ని భారత దేశానికి పంపమన్నారు. అస్తికలు భూస్థాపితం చేసిన ప్రదేశాలు పవిత్ర స్థలాలుగా మార్చటంకాని, పూజాపురస్కారాలు వంటివి జరిపించటంకాని కూడదన్నారు.

భారత దేశానికి పంపిన అస్తికలు, చితాభస్మం రాజఘాట్ వద్ద గంగలో నిమజ్జనం చేశారు.

మొదటిసారిగా స్వస్వరూప జ్ఞానం పొందిన ప్రదేశం - మిరియపు చెట్టు పాదాన్ని చూస్తూ 1986 ఫిబ్రవరి 16వ తేది (భారత కాలమానం ప్రకారం) అర్ధరాత్రి గాఢ నిద్రలో అంతిమ శ్వాసవిడచారు.

మత సంప్రదాయాలపై నమ్మకంలేని కృష్ణమూర్తి అభీష్టం మేరకు మృత దేహానికి ఆ మరుచటి రోజు ఉదయం స్నానం చేయించి తెల్లని ఖద్దరు శిల్కుగుడ్డను కప్పారు. కృష్ణమూర్తి భౌతిక కాయం అగ్నికి ఆహుతి అయింది.

ప్రసంగించటం ఆగిపోయిన రోజున తమకు శరీరంతో పనిలేదన్న కృష్ణమూర్తి అశరీరులైనారు.

కృష్ణమూర్తి జీవితం అసాధారణం. ఆనిండు జీవితంలో ఏడుపదుల సంవత్సరాలు ప్రపంచమంతటా పర్యటించి మానవమేధలో రావలసిన తత్‌క్షణ మార్పును గురించి పదేపదే హెచ్చరికలు చేశారు. ప్రపంచ

చరిత్ర, మానవజాతి మనుగడ ఒక సంకట పరిస్థితిలో కొట్టుమిట్టాడుతున్న సమయంలో కృష్ణమూర్తి, మానవమేధలో రావలసిన మార్పును సూచించారు. ఒకానొక సందర్భంలో చెప్పినట్లు - మానవుల మూల స్వభావంలో మార్పురానప్పుడు, అందుకు ముందుగా వ్యక్తి మారనప్పుడు, మనలను మనమే నాశనం చేసుకొంటాం. మానసిక విప్లవం - ఎప్పుడో ఏ వేయి సంవత్సరాల అనంతరమోకాక ఇప్పుడే, ఈ క్షణాన్నే సంభవించాలి. ఇప్పటికి అటువంటి ఎన్నోవేల సంవత్సరాల కాలం దాటిపోయింది. అయినా ఇంకా మనల్ని మృగలక్షణాలు అంటి పెట్టుకొనే ఉన్నాయి. ఇప్పటికి ఇప్పుడు మనం మారకుంటే రేపటికి - లేదా మరికొన్ని వేలరేపులకయినా మృగాలుగానే ఉండిపోతాం - కేవలం ఒకవ్యక్తి మారినంత మాత్రాన ప్రపంచం మారుతుందా? - అన్న ప్రశ్న ఉదయించవచ్చు. అందుకు కృష్ణమూర్తి జవాబు - ముందుగా నువ్వు మారు; ఏంజరుగుతుందో అప్పుడు చూద్దాం - మానవజాతి తత్ క్షణ కర్తవ్యం ఇదే -

కృష్ణమూర్తిపై వ్యక్తిగత నిందారోపణలతో కొన్నిగ్రంథాలు, వ్యాసాలు ప్రచురిత మవుతున్నాయి. కొందరు పనిగట్టుకొని నిందా ప్రచారం ప్రారంభించారు. కృష్ణమూర్తి జీవించి ఉన్నప్పుడు మిన్నకుండి, వారు దివంగతులైన తరువాత ప్రచారం ఆరంభించారు. కృష్ణమూర్తి సజీవులుగా ఉన్నప్పుడే ఈ ప్రబుద్ధులలో కొందరు కొంత ప్రయత్నం చేసి విరమించుకున్నారు. కాని, కృష్ణమూర్తికి వస్తున్న ప్రచారం, కృష్ణమూర్తి ప్రబోధనలకు వస్తున్న ప్రాచుర్యం ఈ ప్రబుద్ధులకు సంకటం అయినట్లుంది. ఈ ప్రచారం - ఈ కువిమర్శకుల మానసిక స్థితిని, స్థాయిని ప్రదర్శించుతున్నదే కాని, కృష్ణమూర్తి అంతరంగ వైభవాన్ని తాకలేదు. వ్యక్తిపూజకు అలవాటయిన సమాజం, వ్యక్తిగత నిందారోపణల పట్లకూడా కుతూహలం ప్రదర్శించవచ్చు. వ్యక్తిపూజను నిరసించిన కృష్ణమూర్తిని, వ్యక్తిదూషణ అంటదు. నిజం నిలకడమీద తెలుస్తుంది. కృష్ణమూర్తి తమ జీవితకాలంలోనే ఇటువంటి పరిస్థితులను ఎదుర్కొన్నారు.

వ్యక్తిజీవితం అప్రధానం - వ్యక్తపరచిన తత్త్వమే ప్రధానం -

●

# 18

# కైమోడ్పు

కృష్ణమూర్తి జీవితం, తత్త్వాలను తెలిపే గ్రంథాలు తెలుగులో పట్టుమని పదికన్నా లేవు.

ఏనాడో శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావు వ్రాసిన గ్రంథం, తరువాత మచిలీపట్టణం త్రివేణి పబ్లిషర్స్ వారి ప్రచురణలు, ఇటీవల శ్రీమతి కనకదుర్గ రామచంద్రన్ అనువాద గ్రంథాలు మినహా గ్రంథ రూపంలో మనకు కృష్ణమూర్తి జీవితానికి సంబంధించిన విశేషాలు గాని, తత్త్వ విషయాలు గాని లభ్యం కావటం లేదు.

తెలుగులో వ్యాసాల రూపంలో శ్రీవిరించి, శ్రీ నీలంరాజు లక్ష్మీ ప్రసాద్ వంటి రచయితలు ప్రముఖ దిన వార మాస పత్రికలలో అడపాదడపా కృష్ణమూర్తికి సంబంధించిన విశేషాంశాలను అందిస్తున్నారు. వాటిని ప్రచురించిన పత్రికలలో ఆంధ్ర ప్రభ- దిన వారపత్రికలను ప్రముఖంగా పేర్కొనాలి. ఆంధ్రజ్యోతి, ఆంధ్ర పత్రిక, ఉదయం పత్రికలు గూడా కొన్ని వ్యాసాలను, సమావేశ విశేషాంశాలను ప్రచురించాయి.

ఆంగ్లంలోను, ఇతర దేశ విదేశ భాషలలోను వందల సంఖ్యలో కృష్ణమూర్తి జీవితం, తత్త్వ విషయాలు తెలిపే గ్రంథాలు వెలువడ్డాయి.

ఈగ్రంథ రచయితకు కృష్ణమూర్తి గురించి రచనలు చేయాలనే తలంపు ఆదిలో లేదు. మిత్రులతోడి సంభాషణలలో కృష్ణమూర్తి జీవిత విశేషాలను తాత్త్విక ధోరణిని ప్రస్తావించటం, కృష్ణమూర్తి గ్రంథాలను చదవటం, ప్రసంగాలను వినటం వరకే పరిమితమైన ఆసక్తి, మిత్రుల ప్రోద్బలంతో వ్యాసాలు వ్రాయటంతో ప్రారంభమై, ప్రస్తుత గ్రంథ రచన వరకు వృద్ధి చెందింది. సాహితి మిత్రులతోడి పరిచయం, రెండున్నర దశాబ్దాలకు పూర్వం ఏవో రచనలు చేయటం మినహా అంతగా రచనానుభవం లేదు.

కృష్ణమూర్తిని గురించి, ఈ రచయిత వ్రాసిన వ్యాస పరంపరలో మొదటిది- 'ఈ శతాబ్దపు తాత్త్వికుడు'- అన్నది, ఆంధ్ర ప్రభ 1987 ఫిబ్రవరి 17వ తేది దిన పత్రికలో ప్రచురితమయింది. సంపాదకులు శ్రీపొత్తూరి వెంకటేశ్వరరావు ఇచ్చిన ప్రోత్సాహంతో మరికొన్ని వ్యాసాలు ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జ్యోతి, ఉదయం- దిన పత్రికలలో కృష్ణమూర్తి వర్ధంతుల సందర్భంగా 1988, 1989 సంవత్సరాలలో ప్రచురితమయ్యాయి. అదే ఒరవడిలో వివరంగా కృష్ణమూర్తి జీవిత విశేషాలను, మరికొన్ని అంశాలపై వ్యాసాలను వ్రాసి గ్రంథ రూపంలో తీసుకు రావలసిందిగా మిత్రులు ప్రోత్సహించటంతో ఒక సమగ్ర గ్రంథ రచనకు పూనుకోక తప్పింది కాదు. ఇదే ఆ ప్రయత్న ఫలితం.

కృష్ణమూర్తి జీవిత విశేషాలు, తాత్త్విక సమాలోచనలకు సంబంధించిన గ్రంథాలు తెలుగు భాషలో విరివిగా రావాలి. ఆ దిశగా- ఇది తొలి ప్రయత్నం మాత్రమే.

- కృష్ణమూర్తి జీవిత విశేషాలను పరిచయాత్మకంగా తెలిపి At the Feet of Master (పరమగురు చరణ సన్నిధి) అన్న కృష్ణమూర్తి తొలిరచన ఆంగ్ల ప్రతిని కూడా ఇచ్చి మూడు దశాబ్దులకు మునుపే కృష్ణమూర్తి తాత్త్విక ధోరణిపై ఆసక్తి కలిగించినవారు శ్రీమాన్ శ్రీ.న.చ. శ్రీరంగాచార్యుల మామగారు.

- సంభాషణలలో కృష్ణమూర్తి జీవిత విశేషాలు, తాత్త్విక విషయ ప్రస్తావనలు విని, రచనకు ఉద్యమింప జేసి తగు సూచనలతో ముందుకు నడిపించుతున్న మిత్రులు- కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు సాహిత్య ఆచార్యులు శ్రీమాన్ కోవెల సుప్రసన్నాచార్య, ప్రముఖ రచయిత, ఉపన్యాసకులు శ్రీ పురాణపండ సూర్యనారాయణ ప్రకాశదీక్షితులు (ఉషశ్రీ)....

- భావార్థాలు అక్షరరూపం దాల్చటంలో హెచ్చుతగ్గులు రాకుండా తగుసూచన లిచ్చిన వారు- శ్రీరామానుజ రామాయణకర్త శ్రీమాన్ శ్రీ.న.చ. రామానుజాచార్యుల బావగారు.....

- సంకల్పం విని ప్రోత్సహించి, గ్రంథస్థం కాని విషయాలను కూడా తెలిపి, ఎప్పటికప్పుడు హెచ్చరికలు చేసి రచనా వ్యాసంగం కొనసాగటానికి కారకులు- ఆంధ్ర ఆంగ్ల భాషలలో ప్రసిద్ధులైన రచయిత, కృష్ణమూర్తికి బాగా పరిచయస్తులు, శ్రీ ఎన్.సి. రామానుజాచారి (శ్రీవిరించి).....

ప్రచురణకు ఇచ్చిన వ్యాసాలను కొద్ది మార్పులతో ప్రచురించి ప్రోత్సహించిన పత్రికా సంపాదకులు- శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు (ఆంధ్ర ప్రభ), శ్రీ నండూరి రామమోహనరావు (ఆంధ్ర జ్యోతి), శ్రీ కొండుభట్టు రామచంద్రమూర్తి (ఉదయం) శ్రీ ఎన్.సి. రామానుజాచారి (కృష్ణమూర్తి).....

తత్త్వ జిజ్ఞాసకు ప్రేరణ- అర్ధాంగి శ్రీమతి జయలక్ష్మి.....

-వీరందరికీ కృతజ్ఞతలు.

''శ్రీ జిడ్డు కృష్ణమూర్తి జీవితం, తత్త్వం-'' గ్రంథాన్ని చదవటమే గాక, చదివిన వాటిని పునర్విమర్శ చేసుకొని సత్యాన్వేషణకు ఉద్యమించుతా రని ఆశిస్తూ-

కైమోడ్పులతో-

కె. కె. రామానుజాచార్యులు

.... .... ....

'స్పందన' పఠితృ హృదయాలను అలరించినందుకు ఎంతో సంతృప్తి.

పెద్దలు ఆమోదప్రమోదాలు తెలిపారు. పత్రికలు ప్రశంసించాయి. మలిముద్రణకు రెండు సంవత్సరాలక్రితమే ప్రయత్నం జరిగింది. కొన్ని ముఖ్య సవరణలతో బాటు మరికొన్ని తాత్త్విక అంశాలను కూడా చేర్చి మరింత సమగ్రంగా 'స్పందన' ద్వితీయ ముద్రణ 'కృష్ణమూర్తి శత జయంతి'కి వెలువరించితే బాగుంటుందన్న సూచనను శిరసావహించి, ప్రస్తుత ప్రతికి రూపకల్పన చేయటమయింది.

'స్పందన' వెలువడిన తరువాత తెలుగులో కృష్ణమూర్తి జీవితము, తత్త్వాలను వివరించుతూ మరికొన్ని గ్రంథాలు వచ్చాయి. ''కృష్ణమూర్తి ఫౌండేషను, ఇండియా'' వారు అనువాద గ్రంథాల ప్రచురణ చేపట్టారు. ఇప్పటికి నాలుగైదు అనువాద గ్రంథాలు తెలుగులో వెలువడ్డాయి. మరికొన్ని రూపు దిద్దుకొంటున్నాయి.

కృష్ణమూర్తి జీవిత విశేషాలు, తాత్త్విక సమాలోచనలకు సంబంధించిన గ్రంథాలు తెలుగు భాషలో విరివిగా రావాలని ఆశిస్తూ, ఆ దిశగా - తొలిప్రయత్నంగా వెలువరించిన 'స్పందన' ప్రచురణ ఆశయం నెరవేరినట్లు అయింది. పత్రికలు కూడా కృష్ణమూర్తి జీవితం, తత్త్వాలను వివరించే వ్యాసాలను ఎక్కువ సంఖ్యలోనే ప్రచురించుతున్నాయి. హర్షించదగ్గ విశేషాంశం ఇది.

ఈ నేపథ్యంలో స్పంధన ద్వితీయ ముద్రణ కూడా పాఠకులకు ''ప్రాప్తిబుక్స్, మద్రాసు'' వారు అందిస్తున్నారు.

సహృదయులైన పాఠకులకు, విశాల మనస్కులైన పెద్దలకు, పత్రికా సంపాదకులకు, విమర్శకులకు కృతజ్ఞతాభి వందనములు.

గ్రంథపఠనంతో సరిపుచ్చుకోక, సత్యాన్వేషణకు కూడా ఉద్యమించాలని మరొకమారు విన్నవించుకొంటూ,

వినమ్రతతో నమస్సుమాంజలి ఘటించుతూ-

కె. కె. రామానుజాచార్యులు

# 19

# అనుబంధం

## ఉపయుక్తమైన శ్రీ కృష్ణమూర్తి గ్రంథాలు

**Gollancz and Harper & Row**

వారిప్రచురణలు

1. The First and Last Freedom (1954)
2. Education and Significance of Life (1955)
3. Commentaries on Living (1956)
4. Commentaries on Living - Second series (1959)
5. Commentaries on Living - Third series (1960)
6. This Matter of Culture (1964)
7. Freedom from the Known (1964)
8. The Only Revolution (1970)
9. The Urgency of Change (1971)
10. The Impossible Question (1972)
11. Beyond Violence (1973)
12. The Awakening of Intelligence (1973)
13. The Beginnings of Learning (1975)
14. Krishnamurti's Note Book (1976)
15. Truth and Actuality (1977)
16. The Wholeness of Life (1978)
17. Exploration into Insight (1979)
18. Meditations (1979)
19. Poems and Parables (1981)
    (ఇదే From Darkness to Light అన్న పేరుతో కూడా ప్రచురితమయింది.)
20. Krishnamurti's Journal (1982)
21. Life Ahead (1963)
22. You are the World (1972)
23. The Ending of Time (1985)
24. Last talks at Saanen (1986)
25. Krishnamurti to Himself (1987)
26. The Future is Now (1988)

## **Penguin** వారి ప్రచురణలు

1. The Penguin Krishnamurti Reader (1970)
2. The Second Penguin Krishnamurti Reader (1973)
3. The Beginnings of Learning (1976)
4. The Impossible Question (1978)

## ఇతర ప్రచురణకర్తలవి

1. The Way of Intelligence (1985)
2. The Last Talks (1989)
   (The Future is Now - అన్న పేరుతో 1988లో ప్రచురితమయింది.)
3. Tradition and Revolution (1984)
4. Mind without Measure (1984)
   (Krishnamurti Foundation India వారు
   B.I. Publications Pvt. Ltd. వారు
   Orient Longman Ltd. వారు
   Sangam Books వారు- పైన ఉదహరించిన పుస్తకాలను ముద్రించారు.)

## శ్రీకృష్ణమూర్తి గురించి ప్రచురితమైన గ్రంథాలు

1. The Years of Awakening - Mary Lutyens (1975)
2. The years of Fulfilment - Mary Lutynes (1983)
3. The Open Door - Mary Lutyens (1988)
4. Krishnamurthi - Pupul Jayakar (1986)
5. One Thousand Moons: Krishnamurti at Eighty Five (1985)
6. The Mind of J. Krishnamurthi (1971)
7. The Life and Death of Krishnamurti - Mary Lutyens (1990)
8. The quest of the Quiet Mind-Stuart Holroyd(1980)

## తెలుగులో లభ్యమవుతున్న గ్రంథాలు

1. విద్య: జీవితార్థము (Education and Significance of Life)
   - (త్రివేణి పబ్లిషర్సు), మచిలీపట్టణము - (1956)
2. ధ్యానవాహిని (Meditations)
   కనకదుర్గ రామచంద్రన్ - అనువాదం (1971)

3. ధ్యానవాహిని (Meditations)
కనకదుర్గ రామచంద్రన్ - అనువాదం (1981)
4. విద్య (On Learning)
కనకదుర్గ రామచంద్రన్ - అనువాదం (1981)
5. తనలోతాను, వికాసము (A Dialogue with Oneself & Inward Flowering)
కనకదుర్గ రామచంద్రన్ - అనువాదం (1981)
6. విడుదల (Freedom from the Known)
కనకదుర్గ రామచంద్రన్ - అనువాదం (1982)
7. జిడ్డుకృష్ణమూర్తి జీవన దర్శనము - జె. శ్రీరఘుపతి రావు (1990)
8. కృష్ణాజీ జీవితం - చిక్కాలకృష్ణారావు (1992)
9. విఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి తత్వదర్శనం - శ్రీవిరించి (1992)

శ్రీ గుంటూరు సుబ్బారావుగారు వ్రాసినగ్రంథాలు, Krishnamurti Writings INC వారి గ్రంథాలు లభ్యంకావటం లేదు.

కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియావారి అనువాద గ్రంథాలు

1. తెలివిడి నుండి స్వేచ్ఛ (శ్రీవిరించి)
2. శ్రీలంక సంభాషణలు (సి. హనుమంతరావు)
3. ముందున్న జీవితం (సరోజిని ప్రేమ్‌చంద్)
4. ఈ విషయమై ఆలోచించండి - 2 భాగాలు (సి. హనుమంతరావు)

ఆంగ్లమూల గ్రంథాలను చదువగలిగినవారు వాటినే ఎంచుకోవటం ఉత్తమం. ఆంగ్లంలో పైన ఉదహరించినవే గాక ఇంకా ఎన్నో గ్రంథాలు న్నాయి.

కొన్ని గ్రంథాలు పట్టికలో చేరి ఉండకపోవచ్చు. సరి అయిన సమాచారం అందకపోవటమే అందుకు కారణం. ఉద్దేశ పూర్వకంగా మినహాయించలేదు. పట్టికలోని గ్రంథాలు ముఖ్యంగా ఆంగ్ల గ్రంథాలు ఈ గ్రంథ రచనకు ఉపకరించాయి.

# శ్రీ కృష్ణమూర్తి జీవిత పథం

## ముఖ్యమైన ఘట్టాలు

| | |
|---|---|
| 1895 మే 12 | 11వ తేది అర్ధరాత్రి దాటిం తరువాత 30 నిమిషాలకు జననం |
| 1898 మే 30 | తమ్ముడు నిత్యానంద జననం |
| 1901 | ఉపనయనం |
| 1905 జనవరి 7 | మాతృ వియోగం |
| 1909 జనవరి 23 | అడయారు జీవితారంభం |
| 1909 నవంబరు 27 | ఆనీబెసెంటును మొదటి సారిగా దర్శించటం |
| 1910 డిసెంబరు | At the Feet of the Master రచన |
| 1911 జనవరి 11 | Order of the Rising Star స్థాపన |
| 1911 మే 28 | లండన్‌లో మొదటి ఉపన్యాసం |
| 1920 ఫిబ్రవరి 8 | మొదటి సారిగా అనుభూతి |
| 1920 జూలై | దివ్యజ్ఞాన సమాజం వారితో విభేదం |
| 1921 మే 22 | స్వీయ సత్యాన్వేషణ ఆరంభం |
| 1922 ఆగస్ట్ 17-20 | ఓహైలో అనుభూతి - జీవిత దృక్పథంలో మార్పు |
| 1925 జనవరి | ఋషీవ్యాలీలో పాఠశాలకు స్థలం ఎంపిక |
| 1925 నవంబరు 13 | తమ్ముడు నిత్యానంద మరణం |
| 1927 జూన్ 30 | సన్యాసి కావాలనే ఆలోచన |
| 1929 ఆగస్ట్ 3 | Order of the Star సంస్థ రద్దు |
| 1929 డిసెంబరు | దివ్యజ్ఞాన సమాజంతో తెగతెంపు |
| 1933 సెప్టెంబరు 20 | ఆనీబెసెంట్ మరణం |
| 1934 మార్చి 1 | ఛార్లెస్ వెబ్‌స్టర్ లెడ్‌బీటర్ మరణం |
| 1948 | మిత్రుడు రాజగోపాల్‌తో ఇక్కట్లు మొదలు |
| 1968 | Krishnamurti Writings INC సంస్థతో తెగతెంపులు |
| 1980 | దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలో తిరిగి అడుగు మోపటం |
| 1980 మే 11 | శ్రీకృష్ణమూర్తి వేయిపున్నముల దర్శనం |
| 1986 జనవరి 4 | మదరాసు వసంత విహార్‌లో చివరి ప్రసంగం |
| 1986 ఫిబ్రవరి 17 | నిర్యాణం |

# 20

# అనుస్పందన

## ''స్పందన'' ఆవిష్కరణ సభలో ప్రముఖుల అభిప్రాయాలు ఫిబ్రవరి 17, 1990, కాకినాడ

### డా॥ఎన్.సి. రామానుజాచారి, (శ్రీవిరించి) :

''- భాష, కులం, మతం, ప్రాంతం - వీటన్నింటినీ అతిగమించి విశ్వమానవ హృదయాన్ని అందరిలోనూకాంచగలిగిన గొప్ప తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి.

- జ్ఞానం అంటే జిజ్ఞాస. మానవుడు దీర్ఘ దృష్టితో ఆలోచించటం నేర్వాలన్నదే కృష్ణమూర్తి హితవు.

- కృష్ణమూర్తి జీవితాన్ని, తత్త్వాన్ని తెలుపుతూ భారతీయ భాషలలో మొట్ట మొదటి సారిగా ఒక గ్రంథం తెలుగులో రావటం మనందరకూ గర్వకారణం.

కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సుమానికి ప్రతీక. ఆ మహనీయుని గురించిన గ్రంథావిష్కరణ కాకినాడ దివ్యజ్ఞాన సమాజం వేదికపై జరగటం ముదావహం.''

### శ్రీ సి. రాఘవాచారి, విశాలాంధ్ర ప్రధాన సంపాదకులు:

''- మానవునిలో అంతర్గతంగా ఉండే సృజనాత్మక శక్తి అనంతమైనది. ఎప్పటికప్పుడు నూతన భావాలు, ప్రక్రియలు అతని మదిలో పరవళ్లు త్రొక్కుతుంటాయి. ఈ విశిష్ట లక్షణానికి 'కామా' లేగాని 'ఫుల్‌స్టాప్' లేదు. ఒక వేళ ఈ మహత్తర శక్తి స్తంభించిపోతే ఈ అనంత విశ్వం అంతరించినట్లే. అంతర్మధనం ద్వారా ప్రతి ఒక్కరూ తమ శక్తి యుక్తులను పెంపొందించు కోవాలి. పరిపూర్ణస్థితి బుద్ధి వికాసాన్ని బట్టి లభిస్తుంది. అయితే మానవునిలోని అంతర్మధనానికి కారణభూతమైన అంశాలను

ఛేదించటంలో మనం ఇంకా ప్రాథమిక దశలోనే ఉన్నాం. ఒక దశలో మతం, మరొక దశలో దేముడు, ఆ తరువాత సిద్ధాంతం - ఇలా ఒకదాని తరువాత ఒకటి నమ్మకాలను కుదుర్చుకున్నామే కానీ శాశ్వత పరిష్కార మార్గం తెలుసుకోలేక పోయాం. కాగా వీటిపై రాద్ధాంతాలు, కొట్లాటలు, యుద్ధాలు మనకు సంక్రమించాయి. మానవుడు స్వతంత్రంగా ఆలోచించటం మాని ఎవరో కొందరిని చూచి అనుకరించే విధానానికి అలవాటుపడటంతో మానవ సమాజం పురోగమించక పోగా తిరోగ మిస్తోంది. మానవుని పరిపూర్ణత అనంతమైనది. విషయ గ్రాహ్యతకు ఆచరణతో కూడిన జ్ఞానం అవసరం. నియమాలకూ, నిబంధనలకు, కట్టుడులకు లొంగని స్వతంత్రమైన ఆలోచన సృజనాత్మకమైనది. దానినే కృష్ణమూర్తి ప్రజల ముందుంచారు. సత్యాన్వేషణ గురించి ఎందరో మేధావులు ఎవరికి తోచిన విధంగా వారు చెప్పారు. అయినా ఈ అన్వేషణ ఇంకా సాగుతూనే ఉన్నది. ఎంత ఆస్తి సంపాదించినా, ఎంత పేరు ప్రఖ్యాతులు ఆర్జించినా మానవుడు సంతృప్తికి నోచుకోలేదు. అనుదిన సంఘర్షణకు అలవాటై, జీవితాన్ని దుర్భరం చేసు కొంటున్నాడు. జ్ఞానం, ఆచరణ - వీటిని సమన్వయ పరుస్తూ ఆరోగ్యకరమైన ఆలోచనా ధోరణిని అలవరచు కోవాల్సిన అవసరం ఎంతయినా ఉన్నది. ఎవరి జీవితాన్ని వారే దర్శించి చక్కదిద్దు కోవటాన్ని ''జె.కె'' రచనలు, ఉపన్యాసాలు తెలియ జేస్తున్నాయి..... కృష్ణమూర్తి జీవితమే ఒక నిరంతర సత్యాన్వేషణ. ఆ అన్వేషణ ద్వారా తెలుసుకొన్నవాటిని మనకు అందించటమే గాక వాటిని ఆచరించారు.

- ఆ పరిపూర్ణ మానవుని జీవితాన్ని, తత్త్వాన్ని తెలుగు పాఠకులకు అందించిన శ్రీ కె.కె. రామానుజాచార్యులు అభినందనీయులు''.

**డా॥ కోవెల సుప్రసన్నాచార్య**, కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు సాహిత్య శాఖ ఆచార్యులు :

''- నేటి మానవాళి తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. మహనీయుల బోధనలను అవగాహన చేసుకొని ఆచరించక పోవటం వల్లనే అనేక అనర్థాలు ప్రాప్తిస్తున్నాయి.

- సత్యానికి నిశ్చితమైన మార్గము లేదు. ఎవరి జీవితానుభవంతో వారు సత్యాన్ని తెలుసుకోవాలి. ప్రతివ్యక్తి తనలోని 'అహం' త్యజించి, జీవితంలో ఎదురైన సంఘటనల నుంచే జ్ఞానం పొందటం అవసరం.

- ఎటువంటి వత్తిడులకు లొంగకుండా, స్వేచ్ఛగా హాయిగా మనసును విహరింప జేసి ఆలోచించటం ద్వారా విశ్వమానవ కళ్యాణానికి దోహదం చేసినట్లవుతుంది - అన్నదే కృష్ణమూర్తి సందేశం-''

**శ్రీ ఉషశ్రీ - ప్రముఖ ఉపన్యాసకులు, పురాణేతిహాసాలలో పండితులు :**

''- చెప్పటమే కాని వినే అలవాటు లేని నన్ను నాలుగేళ్ల క్రితం మద్రాసులో ''జె.కె.'' ఉపన్యాసం - వినేలా చేయటమే గాక తన్మయుడిని చేసింది.

మానవాళికి, ముఖ్యంగా నేటి యువతరానికి జె.కె.బోధల ''స్పందన''ను సూది మందులా ఎక్కించాల్సిన అవసరం ఎంతయినా ఉన్నది.

నిజానికి ఆయన ఏ మతానికీ చెందని బోధనలు చేశారు. కాని ఒకరికి బుద్ధుడు లాగా, మరొకరికి ఏసుప్రభువు లాగా, మరి కొందరికి దక్షిణామూర్తి లాగా - ఇలా విభిన్న కోణాలలో కనిపిస్తారు. ప్రపంచంలో గల సర్వ మతాలనూ, దేముళ్లను కృష్ణమూర్తిలో చూస్తాం.

మహా మేధావులు చాలామంది ఈశాన్యంలోనే పుట్టారు. వారిలో జె.కె. ఒకరు.

1900 నుండి సంఘసంస్కర్తలు తమ రచనల ద్వారా విప్లవాన్ని తీసుకు వచ్చారు. 1960 నుంచి మన జాతి బానిస బ్రతుకు బ్రతుకుతున్నది. తిరిగి 1990లో నైనా అటువంటి కదలిక, చైతన్యం, ఊపు రావాలి. అందుకు జె.కె. రచనలు దోహదం చేస్తాయి.

ఒకరు చెప్పింది విని ముక్కున పెట్టుకోవటం గాకుండా, స్వతంత్రంగా ఆలోచించాలన్నది జె.కె. ఇచ్చిన, సులువైన, అమూల్యమైన సందేశం.

జె.కె. రచనలను బాగా మథించి సమర్పించిన 'స్పందన' అందరికీ అర్థమయ్యేలా ఉన్నది. గ్రంథాన్ని ఆదరించటమే గాక చదివి ప్రతి ఒక్కరూ ''కృష్ణమూర్తి''గా రూపొందాలి.''

- శ్రీ ఎస్.ఎన్.సి. రామానుజాచార్యులు - శ్రీ రామానుజ రామాయణం పేరుతో వాల్మీకి కృత సంస్కృత రామాయణాన్ని యథాతథంగా తెలుగు భాషలోనికి అనువాదం చేస్తున్న కవి, పండితులు :

''శ్రీ కృష్ణమూర్తి 'జీవిత తత్త్వం' విశేషమైనదే కాక 'స్వేచ్ఛ'గా ఎవరికి వారే తమ జీవితాలను సుగమం చేసుకోవటానికి దోహదం చేస్తుంది.''

# పత్రికలలో ప్రముఖుల అభిప్రాయాలు

## ఉదయం - నవతరం వారపత్రిక 25.5.1990

మతాలూ, ఆధ్యాత్మిక గురువులూ వ్యక్తిస్వేచ్ఛకు ప్రతిబంధకాలనీ, ప్రతి మనిషీ సమస్యలు లేకుండా స్వేచ్ఛాజీవిగా బ్రతకవచ్చుననీ, సమస్యలను సృష్టించేది మనిషి మనస్సేనన్న సత్యాన్ని ఎవరికి వారు గ్రహించాలనీ, మనిషిలో మౌలికమైన మార్పు వచ్చినప్పుడే తన చుట్టూ ఉన్న సమాజంలోను, ప్రపంచంలోను మార్పు వస్తుందనీ ప్రబోధించిన విశ్వవిఖ్యాత తత్వవేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.

జిడ్డు కృష్ణమూర్తి జీవిత విశేషాలనూ, జీవన తత్వాన్ని సునాయాసంగా చదవగలిగే శైలిలో రచించి గ్రంథరూపంలో సమర్పించారు శ్రీ కె.కె. రామానుజాచార్యులుగారు.

ఈపుస్తకంలోని కొన్ని భాగాలు వ్యాసరూపంలో కొన్ని తెలుగు దినపత్రికల్లో ప్రచురితమయ్యాయి. ఈ శతాబ్దపు తాత్వికుడు, తత్వసార సంగ్రహం అనే వ్యాసాల్లో కృష్ణమూర్తిగారి వ్యక్తిత్వాన్ని, తత్వాన్నీ సంక్షిప్తంగా సింహావలోకనం చేయగా, వాటిలోని వివిధ ముఖ్యాంశాలను తొమ్మిది భాగాల్లో ప్రత్యేకంగా విశదీకరించారు. సత్యాన్వేషణ, చిత్తవృత్తి, ధ్యానం, విద్య, మతం, హింస, విప్లవం, మృత్యువు మొదలైన విషయాలపై ఆరుదశాబ్దాలపాటు చేసిన ప్రసంగాల సారాన్ని సరళంగా, స్పష్టంగా పొందుపర్చారు.

''లక్షల సంవత్సరాలుగా ఎందుకు మానవులు శాంతియుతంగా జీవించలేకపోతున్నారు..... ఈ భయాందోళనలకు బాధ్యులం మనమేనని తెలుసుకోవాలి. హింస, పగ, ద్వేషం, విద్రోహం, యుద్ధం వీటన్నిటికీ కారణం మనమే. ఎక్కడో, ఏ దేశంలోనో కాదు. మన హృదయాల్లో, మన మనసుల్లోనే యుద్ధం సాగుతోంది. ఈ సమాజానికి కారకులం మనమే. మనమే ఈ సమాజం... ప్రతి ఒక్కరిలోను మూలస్వభావంలో మార్పు రానంతవరకు యుద్ధాలు తప్పనిసరి అవుతాయి. భౌతిక, సాంకేతిక, వైజ్ఞానిక రంగాల్లో ఎంతో అభివృద్ధిని సాధించగలిగా మనుకుంటున్నాం. కాని

అంతరంగంలో మాత్రం మనమింకా అల్పులమేనన్న విషయం గ్రహించాలి... అంతరంగంలో శాంతి కొరవడినప్పుడు బాహ్య ప్రపంచంలో శాంతి నెలకొల్పటం సాధ్యంకాదన్న విషయాన్ని తెలుసుకోవాలి.

'మతం పేరుతో కొన్ని దుష్టశక్తులు మంచికన్న చెడు ఫలితాలనే ఎక్కువగా ఇచ్చాయి.'

'మనం పెరిగిన వాతావరణం మనం నేర్పిన చదువులు జీవితాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోవడానికి ఏమాత్రం ఉపకరించడంలేదు. జీవితాన్ని అర్థం చేసుకోడానికి ముందు మనల్ని మనం అర్థం చేసుకోవాలి అదే విద్యకు ఆది...'

'...భౌతికమైనటువంటి బాహ్యవిప్లవం కన్న ఆంతరంగిక విప్లవం ప్రధానం...' ప్రేమ ఒక్కటే సమాజంలో నెలకొన్న ఉన్మాదాన్ని ఆందోళనను మాపుతుంది. ప్రేమ అంటే స్వార్థత్యాగం. అంటే ఇద్దరు వ్యక్తుల మధ్య అంతరం లేకుండా చూచుకోవడం.'

'...నిరంతర జీవనక్రమంలో పాత విషయాలు మరచి కొత్తవిషయాలను తెలుసుకొంటూ జీవించే వారికి మృత్యుభీతి ఉండదు.'

కృష్ణమూర్తిగారి బోధనలను విస్తృతంగా సునిశితంగా అధ్యయనం చేసి, ఆకళింపుచేసుకున్నవారికి గాని ఇంత సమగ్రదృష్టితో ఇంత క్లుప్తంగా పొందుపర్చడం సాధ్యంకాదు. ఇందుకు ఈగ్రంథకర్త అభినందనీయులు.

ముఖ్యంగా 1986లో మద్రాస్‌లోని వసంత విహార్‌లో కృష్ణమూర్తి గారు తమ అంతిమ ప్రసంగాన్ని చేసిన సన్నివేశాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించడం ప్రశంసనీయంగా ఉంది. మనసుని ఆర్ద్రపర్చేట్లుగా ఉంది.

పుస్తకం ఆఖరున కృష్ణమూర్తిగారి గురించి అవశ్యపఠనీయాలైన ఇంగ్లీష్, తెలుగు పుస్తకాల వివరాలను కూడా అందించారు.

ప్రకృతినీ, చుట్టూ ఉన్న పరిసరాలనూ, తోటి మానవులనూ చూసి స్పందించే హృదయం, కరుణ, సున్నితత్వం, ప్రేమా నిండిన మనస్సుకల శ్రీ జిడ్డు కృష్ణమూర్తి 'జీవితం తత్వం' చదివిన పాఠకుల్లో కూడా స్పందన కలుగుతుందని ఆశించవచ్చు.

- అబ్బూరి ఛాయాదేవి

## విశాలాంధ్ర - 25.2.1990

## నిరంతర సత్యాన్వేషి, నిత్య తాత్వికుడు

'అసతోమా సత్‌గమయ
తమ సోమా జ్యోతిర్గమయ'

సత్యాన్వేషణలో లక్ష్యం చేరటమంటూ లేదు. అఖండ సత్యం ఎల్లప్పటికి అందరాని గమ్యమే. గమనమే గమ్యంగా భావించిన ప్రాచీన తత్వవేత్తల కోవకు చెందినవాడు జిడ్డు కృష్ణమూర్తి.

1895, మే 12న, మదనపల్లిలో ఒక పేద మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన ఈ బాలుడిలో, లెడ్ బీటర్, ఆనిబిసెంటులు, ఏ భవిష్యద్వాణి విన్నారో తెలియదు. జగద్గురువు లక్షణాలన్నీ ఇతనిలో ఉన్నాయని తండ్రిని ఒప్పించి తమ శిక్షణలోకి తీసుకున్నారు. కఠినమైన శారీరక, మానసిక శిక్షణ యిచ్చారు. ఉన్నత విద్యావకాశం కల్పించారు.

ఆనిబిసెంటు అధ్యక్షతన నడుస్తున్న దివ్యజ్ఞాన సమాజ ఆస్తులన్నిటికి ఇతడే వారసుడని, ఆనిబిసెంటు దత్తపుత్రుడని పత్రాలు రిజిష్టరు చేశారు.

తాను జగద్గురువునని ప్రకటించుకోవటమే ఇక తరువాయి.

వారి ఆశలన్నిటినీ వమ్ము చేస్తూ కృష్ణమూర్తి 1920 నుండే తాత్విక భిన్నాభిప్రాయం వ్యక్తం చేయసాగారు. 1929తో ఆ సంస్థతో పూర్తి తెగతెంపులు చేసుకున్నారు. పిమ్మట ఐదేండ్లకు లెడ్ బీటర్, ఆనిబిసెంటు గారలు మరణించారు.

నాటి నుండి వారు, గత జీవితం నుండి సంక్రమించిన, భౌతిక, మానసిక శృంఖలాలను విసర్జిస్తూ ముందుకు సాగారు. ఏ సంస్థతోనూ, మతంతోనూ సంబంధం లేదు. ఏ ప్రమాణ గ్రంథాలు లేవు. ప్రతి వ్యక్తి తన జీవితానుభవాన్ని తాను గ్రహించి పాతవాసనలను త్యజిస్తూ ముందుకు సాగాలనే తన ప్రతిపాదనను తానే అక్షరాల అమలు జరిపాడు. 90 ఏండ్లు నిండు జీవితం గడిపి 1986, ఫిబ్రవరి 17న అమెరికాలో ఓహై ఆశ్రమంలో ప్రశాంతంగా కన్ను మూశారు.

ఏ మత సంస్కారాలూ లేవు. తన ఆస్తికి వీలునామా రాయలేదు. ''పుట్టినప్పుడు ఏమీ లేదు. పోయేటప్పుడు ఏమీ లేదు. వీలునామా ఎవరి కోసం'' అంటూ అనంత విశ్వంలో లీనమైనాడు.

ప్రేమ, కరుణ, స్వేచ్ఛ ఈ మూడు భావాలు కృష్ణమూర్తి తాత్విక చింతనకు ప్రాతిపదికలు. మొదటి రెండు భావాలు కృష్ణమూర్తిని, మానవతావాది, శాంతి కాముకుడు, కుల, మత, జాతి, వర్గ కలహాలన్నిటికి అతీతమైన సమాజాన్ని గురించి కలవరించిన స్వాప్నికునిగా చేశాయి. ''నిన్నటి అనుభూతి నీడకు రేపటి ఆశల వెలుగుకు'' అతీతమైన స్వేచ్ఛాభావన, వర్తమానవాదిని చేశాయి.

వ్యధ, వ్యాకులం, ఆస, అడియాస- మానవులను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. 'నేను', 'తాను' భావనలను విసర్జించి, ఒక ఆలోచనకు, మరొక ఆలోచనకు మధ్య ఏర్పడే అతి స్వల్ప విరామంలో లీనం కావటమే ధ్యానం, యోగం. మంత్రోచ్ఛారణ కేవలం ఆత్మసమ్మోహనం. సత్యాన్ని ఎవరికి వారే తెలుసుకోవాలి. భావ వివరణ.

కుండలినీ విద్య, పునర్జన్మ, జగద్గురుత్వం లాంటి చిన్నతనవు భావాలన్నిటినీ, సంపూర్ణంగా విసర్జిస్తూ కృష్ణమూర్తి చేసిన ప్రయాణం, వారిని ఉత్తమ తాత్వికస్థాయికి చేర్చాయి.

కైవల్యం, మోక్షం, నిర్యాణంలాంటి వైయుక్తిక ముక్తి భావనను, ప్రేమ, కరుణ, అహింసలాంటి సామాజిక భావనను, స్వేచ్ఛ దృష్టితో రంగరించి, జీర్ణం చేసుకున్న నిత్యపథికుడు, నిరంతర సత్యాన్వేషి కృష్ణమూర్తి.

ప్రతితత్వ వేత్త జీవితంలో ఒక మలుపు ఉంటుంది. తాత్విక భావ సమీకరణ పూర్వార్ధం. తద్భావ వ్యక్తీకరణ, ఆచరణ ఉత్తరార్ధం. పూర్వార్ధంలోని శృంఖాలానదృశ్యమైన వాసనలన్నిటినీ విసర్జించుకుంటూ తత్వవేత్త ముందుకు సాగుతాడు ''త్రైగుణ్య విషయా వేదాః నిస్త్రైగుణ్య భవార్జున'' అనే గీతా వాక్యం జిడ్డు కృష్ణమూర్తి విషయంలో పూర్తిగా వర్తిస్తుంది.

ఈ గ్రంథంలో రెండు భాగాలున్నాయి. 74 పేజీ వరకూ కృష్ణమూర్తిగారి జీవిత చరిత్ర, తాత్విక పరిణామం ఎంతో చిత్తశుద్ధితో, నిర్మోహమాటంగా నడిచిన చక్కని కథానికా రూపం ధరించింది.

మిగతా సగభాగం కృష్ణమూర్తి తాత్విక భావ వివరణ.

ధ్యానం, యోగం, మతం, విప్లవం, అహింస, మృత్యువు, చిత్తవృత్తి లాంటి అంశాల వివరణలో రచయిత ప్రత్యేక ప్రజ్ఞకనపరచారు.

పూర్వ తాత్వికులలో, చాలా మందిలో అస్పష్టత అంటూ ఒకటి ఉండేది. తద్వ్యాఖ్యాతలు దానిని మరింత అయోమయంచేసి, తత్వశాస్త్ర మంటే పాఠకులు భయపడేటట్లు చేశారు.

కృష్ణమూర్తి తాత్విక చింతనలో అస్పష్టత ఏకోశాన లేదు. అసమగ్రత ఉండవచ్చు. అర్థం కాని విషయం ఏదీ లేదు. భిన్నాభిప్రాయం ఉండవచ్చు.

రచయిత రామానుజాచార్యులుగారు, కృష్ణమూర్తి తాత్విక హృద యాన్ని పూర్తిగా గ్రహించినవారు. భాషలో, వివరణలో, విశ్లేషణలో సారళ్యతకు అదే కారణం.

చిన్న పుస్తకంలో పెద్ద భావనలను నిక్షిప్తం చేసిన రచయిత కృషి ప్రశంసనీయం. కృష్ణమూర్తి భావనలపై ఇంగ్లీషులో చాలా గ్రంథాలున్నాయి. తెలుగులో వెలువడిన కొద్ది గ్రంథాలలో ఇది ఉత్తమం.

ఇట్టి గ్రంథాన్ని కవిత్వమా అనిపించే వచనంలో రాసిన కె.కె. రామానుజాచార్యులు గారు, పుస్తకాన్ని అత్యాకర్షణీయంగా ప్రచురించిన విరించి గారు, తెలుగు పాఠకులలో తత్వ చింతనావ్యాప్తికి ఎంతో దోహదం చేసిన వారైనారు.

–బలరామమూర్తి

## ఆంధ్రజ్యోతి - వారపత్రిక - 6-4-1990

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి (1895-1986) అసాధారణమయిన వ్యక్తి. ఎవరు ఈ కృష్ణమూర్తి?- జగద్గురువు అంటే ఏమిటి? ఈయన ఎలా జగద్గురువు? మతము, మత సంప్రదాయాలు, సనాతాన ధర్మ ప్రవచనాలు- మొదలయిన వానితో విరివిగా పరిచయం లేకుండా ఎవరయినా జగద్గురువు కాగలరా? ప్రత్యేకమయిన భగవంతుడిని గురించి ప్రస్తావించని ఈ మనిషి ఇతరుల మత జీవితానికి తత్వ దర్శనానికి ఎలా మార్గదర్శకుడు కాగలడు?... ఇలాంటి ప్రశ్నలు చాలామంది మనసులలో మెదులుతాయి కృష్ణమూర్తి పేరు ప్రస్తావన కాగానే.

దివ్యజ్ఞాన సమాజంవారు ఎవరో ఒక మనిషిని 'జగద్గురువు' అన్నారు, అతడికి ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చి తమ 'రాగాన్ని' ఆలపించమన్నారు. కాని అతడు పెరిగి పెద్దవాడై వారిని కాదన్నాడు. అసలు మనిషి 'ఆధ్యాత్మికం'గా పెరగడానికి సంస్థలే అక్కరలేదన్నాడు. తనకోసం నిర్మాణం చేసిన 'తారక సంస్థ' అనే దానిని కూడా మూసివేసి దాని ఆస్తిపాస్తులు విరాళాలు ఇచ్చినవారికి వాసను చేశాడు - ఈ రకమయిన ప్రస్తావనలు కూడా ప్రచారంలో వున్నాయి. యథార్థాల వెనకాల వున్న తత్వం ఏమిటి? కృష్ణమూర్తి ఇలా ప్రవర్తించడానికి కారణం ఏమిటి? ఇంతకూ ఈయన చెప్పే 'సంగతులు' ఏమిటి? ఇవన్నీ కూలంకషంగా తెలుసుకోవలెనంటే తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం ఇది - 'స్పందన'.

శ్రీకృష్ణమూర్తి జీవితంలో వివిధ దశలను వింగడించి వికాసం విక్రమణం, విరాజనం అనే శీర్షికల కింద నిష్పాక్షికమయిన విశ్లేషణం ఇచ్చారు రచయిత శ్రీ కె.కె. రామానుజాచార్యులుగారు. పోతే తత్వ దర్శనాన్ని విపులీకరిస్తూ సత్యాన్వేషణ, చిత్తవృత్తి, నీవే ప్రపంచం, ధ్యానం, చదువు-జీవితం, మతం-మత జీవనం, హింసాకాండ, విప్లవం, జీవితం-మృత్యువు, తత్వసార సంగ్రహం అనే పది అధ్యాయాలలో సూటిగా, అకలుషితంగా కృష్ణమూర్తి వచనాలను సరళమయిన తెలుగులో చదువరుల ముందు వుంచారు.

'నేను బోధకుడిని కాదు, మతాచార్యుడిని కాదు; అందరమూ కలసికట్టుగా కూర్చుని సమాలోచన జరుపుకుందాము' అనగల చిత్తసౌకుమార్యం, సౌశీల్యం ఆయన ఆభరణాలు. మానవాళి ఎప్పుడో ఎక్కడో తప్పటడుగు వేసింది; దీనిని మనం ఇప్పుడయినా సరయిన మార్గంలో పెట్టడం అవసరం. 'స్వస్వరూప జ్ఞానం' కోసం ప్రయత్నించడం తప్ప ఇందుకు మరో మంచి మార్గంలేదు అంటారు ఆయన.

తాను చేసిన పనిని తానే సమీక్షించుకోగలగడం, తన ఉపన్యాసాలు, సాధన, పుస్తకాల మీద తానే నిష్పాక్షికమయిన 'విమర్శలు' వ్రాసుకోవడం. చేతనయిన మనిషి కృష్ణమూర్తి. జీవితము, తత్వము వేరు వేరు కాదు; ఓతప్రోతంగా కలిసిపోయి వున్నాయి. వీటిని 'అఖండం' గానే చూడాలి. ముక్కలు ముక్కలు చేసి నరికిపారవేసి జీవితాన్ని దుఃఖ భాజనం చేసుకోగూడదు- అంటారు.

శ్రీ కృష్ణమూర్తి జీవితాన్ని, తత్వాన్ని ఇలా యథాతథంగా ప్రదర్శించడమే గాక, రచయిత పుస్తకాంతంలో అనుబంధంగా వారి ఇంగ్లీషు, తెలుగు పుస్తకాల వివరాలు, జీవిత ఘట్టాల తేదీలు సమకూర్చారు. కృష్ణమూర్తిని గురించి మరింతగా తెలుసుకోదలచుకున్నవారికి ఈ వివరాలు చాలా అవసరం.

ప్రాప్తి బుక్స్‌వారు ఈ ప్రచురణ ద్వారా తెలుగు పాఠకలోకానికి మంచి సేవ చేశారు. భారత భాషలలో ఇదే మొదటి ప్రయత్నం. రచయిత తమ సులభ శైలిలో, మూల తత్వానికి 'అనువాదం'గా మంచి పుస్తకం తయారుచేశారు. కృష్ణమూర్తి జీవిత వేదాంత తత్వాలను గురించి వీరు మరిన్ని పుస్తకాలు వ్రాయాలని, వ్రాస్తారని మా ఆకాంక్ష.

— చక్రవర్తి

## జగతి - జూలై 1990

...తను జగద్గురువుని కానని, కేవలం సత్యాన్వేషిననీ బాహాటంగా ప్రకటిస్తాడు కృష్ణాజీ. అదే ఆయనలోని గొప్పతనం - ఆ సాహసచర్యే ఆయనని యుగపురుషునిగా చేసింది. జవహర్‌లాల్ నెహ్రూ, ఆల్డస్‌హక్స్లే వంటి మహనీయులు ఆయనని సలహా అడిగే వారంటే, కృష్ణాజీ ఎటువంటి మహోన్నత పీఠం అధిరోహించారో తెలుసుకోవచ్చు. ఇరవై సంవత్సరాలుగా తనచుట్టూ కట్టిన మణిమయకాంతుల బంగారు సౌధాన్ని ఛేదించి, జగద్గురువుగా పూజలందుకున్న పీఠాన్ని పక్కకినెట్టి, జనార్ణవంలోకి వచ్చి, ఈ శతాబ్ది ప్రజను సృజనాత్మక చైతన్యం వైపుగా కళ్లు తెరవమని ప్రబోధించిన కృష్ణాజీ మహాజ్ఞాని, ఆధునిక రుషి..., స్వబుద్ధితో సత్యాన్వేషణ గావించమనే కృష్ణమూర్తి, తన 91వ ఏట 1986, ఫిబ్రవరి పదహారు అర్ధరాత్రి గాఢనిద్రలో కడపటి శ్వాస వొదిలేదాకా, చుట్టూన్న వారిని తన జ్ఞాన జ్యోతితో ప్రభావితులు గావిస్తూనే వున్నారు.

'శరీరానికి స్నానం వంటిది మనసుకి ధ్యానం. ధ్యానం అంటే ప్రార్థన కాదు - ఆత్మజ్ఞానాన్ని యిచ్చేది. అందుకు ముఖ్యంగా కావలసింది ప్రేమ- ప్రేమ ఉన్నచోట భయం ఉండదు... యోగం అనగా ఒక జీవన విధానం... అన్వేషణ మానవుని సహజ లక్షణం... జీవితానికి అర్థం జీవించడమే గాని అందులో ఏ పరమార్థమూ లేదు... సృష్టి సృజన జీవలక్షణాలు... సృజనాత్మక జీవనమంటే స్వార్థాన్ని అధిగమించి చూడగలగటం' - ఇలా చెబుతారు కృష్ణమూర్తి.

కె.కె. రామానుజాచార్యులు, జిడ్డు కృష్ణమూర్తి జీవితాన్ని ఒక తైలవర్ణ చిత్రంలా మనముందు వుంచారు. ఫోటో గ్రాఫర్ ఏనాడూ చూపలేని అందాలను చిత్రకారుడు తన రేఖలూ రంగులూ ద్వారా సృజనాత్మక లక్షణంతో మన కళ్లకగుపింప చేస్తాడు. అదే చేశారు రచయిత రామానుజాచార్యులు చక్కటి తెలుగులో మనసుకి హత్తుకొనే రీతిని, కృష్ణాజీ జీవితమూ ఫిలాసఫీ చెబుతూ! ఈ శతాబ్దపు మహాజ్ఞాని గురించి తెలుసుకోదలుచుకున్న వారికొక కరదీపిక.

— క్షీరసాగరమ్

# నిత్యనూతన - ఏప్రిల్ 1990

శ్రీ జిడ్డు కృష్ణమూర్తితత్త్వాన్ని అర్థం చేసుకోవడం సాధారణమైన మానవుడికి అంతగా సాధ్యంకాని పని... ఆంగ్లము, ఇతర దేశ విదేశీ భాషల్లో శ్రీ కృష్ణమూర్తిగారి తత్త్వాన్ని తెలియచేసే గ్రంథాలు వందలాదిగా వున్నాయి. తెలుగు వాళ్ళకు కూడా ఆ తాత్త్విక విరాట్ స్వరూపాన్ని చూపించాలని ప్రయత్నించిన శ్రీ కె.కె. రామానుజాచార్యులుగారు ఎంతైనా అభినందనీయులు.

ఈ గ్రంథంలో మొత్తం పదమూడు వ్యాసాలున్నాయి. వీనిలో శ్రీ కృష్ణమూర్తి గారి జీవిత విశేషాల్ని తెలిపే వాటికంటే వారు ప్రతిపాదించిన, పరిశీలించిన, ప్రబోధించిన తాత్త్విక విషయాలను తెలియచేసేవే ఎక్కువగా వున్నాయి. 'ధ్యానం', 'జీవితం - మృత్యువు', 'తత్త్వసారసంగ్రహం' అనే వ్యాసాలలోని విషయాలు అర్థం చేసుకోవాలంటే నిజానికి సామాన్య మానవుడు మరల మరల చదువుకోవలసి వుంటుంది. అయినప్పటికీ అటువంటి మార్గంలో కూడా పూల పరదాను పరచి, సామాన్యుడికి కూడా ఆ 'మాన్యుడి' తత్త్వాన్ని సులభంగా అందించిన శ్రీ రామానుజాచార్యులుగారు అత్యంత శ్లాఘనీయులు... ప్రతివారూ తమ గ్రంథాలయంలో ముందువరుసలో పదిలపరచుకోదగినదీ పుస్తకం.

– "మను"